సుబంధు సంస్కృతమునకుఁ దెలుగు

[illegible]

[illegible]

[illegible] 5-10-49

# వాసవదత్త

(లఘుటీకతో - పద్యకావ్యము)

సాహితీసమితి

మూల్యము
3-0-0

ముదిగొండ వీరభద్రమూర్తి

శివాభ్యాంనమః

# తొలి పలుకు

ఇందలికథ:— "చింతామణి"రాజ పుత్రుఁడు "కందర్ప కేతువు" కలలో నొక సుందరినిఁ గాంచి వలచి విచారించుచు సఖుఁడైన "మకరందుని"తో వింధ్యపర్వతారణ్యమందు విహరించి రాత్రి యొక చెట్టుక్రిందఁ బరుండెను. చెట్టుపై నాలస్యముగా గూటికిఁ జేరి తోడుపక్షి యగు శారికచే సందేహింపఁ బడిన శుకము, తాను కుసుమపురము వెళ్లితి ననియు; నా పురప్రభు వైన శృంగారశేఖరుని కుమార్తెరు "వాసవదత్త" స్వయంవరమందు నెవ్వరిని వరింపక యా రాత్రి కలలో నగుపడిన "కందర్పకేతువు"ను వలచి, తదన్వేషణార్థ మొక శారికనుఁ బంపుచుండ, నా శారికతోఁ గూడి తా వచ్చుటలో నాలస్య మైన దనియు; నది వృక్షమూలమందున్నదనియుఁ, జెప్పెను.

పక్షిభాషఁ దెలిసిన "కందర్పకేతువు" తత్కథ విని వృక్షమూలమందలి శారికనుఁ దన్నెఱిఁగించి, యాపెయే తన స్వప్నసుందరి యని నిర్ణయించి, శారిక యిచ్చిన లేఖనుఁ జదువుకొని, యా పక్షి త్రోవఁజూప "మకరంద"సహాయుఁడై కుసుమపురముఁ జేరి, "వాసవదత్త"నుఁ గలసెను. "మకరందు" నందు వార్తకొఱకుదిగవిడచి రహస్యముగా"వాసవదత్త"తోఁ గూడ నొక యశ్వముపైఁ దన పురముఁ జేర బ్రయాణించుచుఁ "కందర్పకేతువు" వింధ్యారణ్యమున వేకువ విశ్రమించెను.

మధ్యాహ్నమున మేల్కాంచిన రాకొమరుఁడు ప్రేయసి కనుపడక చిత్తమై వెదకి వేసారి దుఃఖించుచు సముద్రముఁ జేరి యం దాత్మత్యాగ మొనరింపఁబూనియు నాకాశవాణి వారింప నోడఁబడి జీవించుచు నరణ్యమునఁ దిఱుగుచుండి యొకనా డొకచోటఁ గనఁబడిన ఱాతిబొమ్మను మెచ్చి చే నంటెను. వెంటనే బొమ్మ "వాసవదత్త" యై, యాశ్చర్య సంతోషము లనుభవించు "కందర్పకేతువు"నకుఁ దా నెట్లు ఱాతిబొమ్మగా నయ్యెనో యా శాపవృత్తాంతమును విన్న వించెను. అంతలో "మకరందుఁడు"నుఁ గనఁబడెను. సతీ హితసహితుఁడై "కందర్పకేతు"మహారాజు తన పురముఁ జేరి సుఖించెను. ఇది యిందలి యితివృత్తము.

## నా ర చ న

మూలములోని కొన్ని శ్లేషము లాంధ్రమున కందనివి, యందినను నందగింప వని నాకుఁ దోచినవి వదలఁబడినవి. మూలములో పులినవర్ణన మైన తరువాత సముద్రవర్ణనము. దీనిలో సముద్రవర్ణన మైన తరువాత పులినవర్ణనము. (విహరింపఁ దగిన సమయమున కనుగుణముగా) వర్ణనములలోని వాక్య ముల వరుస యథామూలముగా నిందు లేదు. ఛందస్సున కను గుణముగా దోషము లేనట్లు మూలవాక్యము విడువక నే నొక వరుస పాటించితిని.

96–100 పేజీలలోని చెలుల సంవాదములోను, 90–93 అభిసారికా దూతికాలాపములలోను, మూలములోని కొన్ని

వాక్యములు విడువఁబడి యా స్థానములలో స్వకల్పితము లుంచఁబడినవి. వర్ణనము పద్యములోని కొన్నిపాదముల కే సరిపోగా మిగిలిన పద్యభాగవాక్యము మూలములోనిది కాకున్నను నాచే వ్రాయఁబడినది.

"సన్నగిల్లరె మది దిగు లున్నవారు" 31 పే, 24 పం. కొన్ని యిట్లు.

నాచే టిప్పణి శ్లేషము ప్రధానముగాఁ గొని చాల క్లుప్తముగా వ్రాయఁబడినది. ధ్వనులు నలంకారము లెన్నెన్నియో కలవు. వానినిఁగూర్చి నే నిందుఁ జర్చించుట లేదు. ద్వితీయముద్రణములోనో లేక యాలోపలఁ బ్రత్యేకముగానో ప్రకటింపఁ దలఁచితిని. నా యాంధ్రీకరణములలో నిదియే మొదటి దగుటవలన దోషము లుండకపోవు. పునర్ముద్రితము వెలువడునంతవఱకు రసజ్ఞులు వాని యొప్పుపాఠములఁ జదువు కొనఁ గోరుచున్నాను.

తప్పొప్పుల పట్టికలోఁబడనివి నాకుగుర్తున్నవి కొన్ని:-

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 125 | 9 | జిలకరించె | జిలుకరించె |
| ,, | 11 | గులకరించె | గులుకరించె |
| 94 | 17 | సంతరళత్సుధా | సంతరళప్రభా |
| 108 | 5 | విద్యాధర మహానుబావుని | విద్యాధరేంద్ర మహానుభావుని |

ఇట్లు జదువవలయును.

## మహాకవి సుబంధుని గూర్చి

ఏబదియవపుటలో నాల్గవపద్యములో "ఇది బృహత్కథయు నెంతో యపూర్వము" అని యుండుటచే ఖిల మని యను కొనఁబడుచున్న "గుణాఢ్యు"ని "బృహత్కథ" యప్పటికి సుబంధువునకు లభ్యమై యపూర్వమైన యీ యాఖ్యాయిక యందునుండి గ్రహింపఁబడినట్లుఁ దోఁచును. మరియు:—

గీ॥ "బృహత్కథాలంబనములకు సరిగ"_51 పు-5 పద్యము

గీ॥ "బృహత్కథానుసారులుగ గుణాఢ్యులు" పు.67-56 ప.

యని పొగడుటచేఁ దన వాసవదత్తాఖ్యాయికకు మాతృకయైన బృహత్కథయందునుఁ దత్కర్తయైన గుణాఢ్యునియందును సుబంధు మహాకవి కపారగౌరవము కలదు.

ఈ నా తెలుగురచనకు మాతృక సంస్కృతములోని సుబంధుమహాకవి ప్రణీతవాసవదత్తాకావ్యము. సుబంధువు చాల ప్రాచీనుఁడు.

14 పే. 12 ప. కం॥ భువిఁ గీర్తిశేష మొందె నల విక్ర మాదిత్యపతి కొలంకుబలె నయో!" ఇది యితని ప్రాచీనతా నిదర్శనము.

1913 వ సం॥లో "న్యూయార్కు" నుండి కొలంబియా యూనివర్సిటీవారు "Indo-German Series" 8 వ వాల్యూముగా దీని ననువదించి ప్రకటించినారు. అను వాదకుఁడైన "Louis H. Gray P.H.D. తన యుపోద్ఘాతములో "Vasavadatta a sanskrit romance by subandhu is one

of the best examples of ornate style" అని యారంభించి సుబంధుని కవితాసామర్థ్యమును వివరించినాడు. సంస్కృతాంధ్ర కవులు కొందరు సరేసరి యీకవిని "భట్టబాణస్తోత్రిపాత్రుఁ"డని యనుకొనుటకుఁ దగినట్లు ప్రశంసించినారు.

భట్టబాణునిచే "హర్షచరిత"లో "కవీనా మగళ ద్దర్పో నూనం వాసవదత్తయా" యని పొగడఁబడిన దీ కావ్యము కా దని కొందఱు పండితుల యుద్దేశ్యము. ఈయన కాక మరొక వాసవదత్తాకావ్యకర్త కనుపడువఱకు నీ సుబంధువే పై శ్లోకార్థమునఁ గొనియాడఁబడినా డని కొందఱితోఁబాటు నాకునుఁ బ్రత్యయము.

## విజ్ఞప్తి

పార్థివ సం॥ర చైత్రములో బూర్తి యయిన దీనిని నేడు వెలువరింపగలిగితిని. ఇందుకు సహాయపడిన యందఱకును, ఏలూరు సాహిత్యమండలివారికిని నా ధన్యవాదములు. అచ్చొత్తించుటకుముందు నా కోరికపై నీ కావ్యమును సవిమర్శముగా విన్న శ్రీ వ్యాకరణ విద్యాప్రవీణ, ఉభయ భాషాప్రవీణ, శిష్ట పేరయ్యశాస్త్రి M. A. (సంస్కృతోప న్యాసకులు సర్ సి. ఆర్. రెడ్డి కళాశాల ఏలూరు) గారికిని, తమ తమ యభిప్రాయము లొసంగిన పండితకవులకును నమస్సులు.

హాల్ మకాం, ఏలూరు.
ది 20—7—49

ముదిగొండ వీరభద్రమూర్తి.
మాదల (గుంటూరుజిల్లా)

---

# అభిప్రాయములు

అవధాని శిరోమణి, శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు,

క. ముదిగొండ వీరభద్రుని
వదనాంగణసీమ నాంధ్రవాసవదత్తా
సుదతి నటియించె నౌరా!
పదపదరసబంధురప్రబంధమణి యనన్.

గుంటూరు.
2—7—49.

కాశీ కృష్ణాచార్యులు,

తర్క వేదాంత సార్వభౌమ శ్రీ మండలీక వెంకటశాస్త్రిగారు.

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారిచే సంస్కృతభాష నుండి యనూదితమైన "వాసవదత్త"యను కావ్యమును స్థాలీపులాకన్యాయముగ విని యానందించితిని. కావ్య మత్యంత ప్రౌఢముగ సరసపదభూయిష్ఠమై మధురార్థప్రతిపాదకమై శ్లేషాద్యలంకారోపశోభితమై సలక్షణముగ విరాజిల్లుచుండుటచే సహృదయహృదయాహ్లాదక మనుటలో సందియము లేదు. శ్రీ కవిగారిట్టి సద్గ్రంథభూషలచే నింకను నాంధ్రభాషామ తల్లి నలంకరింతురుగాత మని కోరుచున్నాను.

హాల్ మకాం ఏలూరు.
19—7—1949.

మండలీక వెంకటశాస్త్రి,

శిరోమణి, (శ్రీ) వేదాల తిరువెంగళాచార్యులుగారు.

*

సుబంధు మహాకవి గీర్వాణభాషయందు రచించిన "వాసవ దత్త" ప్రత్యక్షరశ్లేషమందుఁ బ్రపంచవిన్యాసవైదగ్ధ్యనిధి. అతి కఠినపాకము. అది సామాన్యముగా నెవ్వరునుఁ జదువరు. ఏ కొలఁదిమందియో పండితులు మాత్రము దానినిఁ జదివెదరు. పరగ్రంథాన్వయము నభ్యసింపఁగోరు కొలఁదిమంది విద్యార్థులు కూడ దానినిఁ దమతమ యాచార్యులయొద్దఁ గొలఁదిగా నభ్య సించుటయు నటనటఁ బ్రాచీనకాలమునఁ గలదు. మొత్తము మీఁద భావస్ఫూర్తిఁ గల్గించు పట్టు లెడపడడప నాగ్రంథమున లేకపోలేదు; కాని రసస్ఫురణమును సద్యఃకాలమునఁ గలిగించు పట్టులు లేనేలేవనవచ్చును.

అయితే యిట్టిదానిని "కవీనా మగళ ద్దర్పో నూనం వాసవదత్తయా శక్త్యైవ పాండుపుత్రాణాం గతయా కర్ణ గోచరం" అని బాణభట్టల ప్రశంసించె ననవచ్చును. అది ఈ వాసవదత్త కాదు. "లు బాఖ్యాయి కాభ్యో బహులం ఆఖ్యానాఖ్యాయి కేతిహాసపురాణేభ్యశ్చ" అను వార్తికముల భాష్యమునందు భగవానుఁడు పతంజలిమహర్షి యుదహ రించినది. అది చాల రసవంతమై యుండఁబోలు. మహాకవి బాణభట్టు ప్రశంసించినది "సుబంధు వాసవదత్త" యేల కా దందురా? "సదారామాశ్రితై ర్మహావీరచరితై రివ నారి కేళీధరైః" అని వాసవదత్తలో బాణుని తరువాతి వాఁ డగు భవభూతి స్మరింపఁబడి యున్నాఁడు. అట్టియెడ నాగ్రంథ మును సుబంధుని కన్న నొక శతాబ్దము పూర్వము

వాఁడగు బాణుఁ డెట్లు స్మరింపఁగల్గును? కావున నేనిమిదవ శతాబ్దములోని సుబంధువు రచించిన వాసవదత్త బాణుని స్మరణలోనిది కాకపోవుటయే కాక కాఁదగినదిగాఁ గూడ లేదు. ఏమనగా? మొదటనే నుడివితిమి కదా! అది రసవంతము లగువానిలోనిది కాదని. శ్లేష విన్యాసము తక్క మిగిలిన వాని విన్యాసవైదగ్ధ్యము కూడ నందు మృగ్యమే. అట్టి దానిని "బాణోచ్ఛిష్టం జగత్త్రయం" అను ప్రఖ్యాతి నొందిన బాణభట్టు అట్లు స్తుతించునా? అట్టి స్తుతి దాని కర్హ మగునా? అది శ్లేష వైచిత్ర్యము నెఱుంగ గోరువారికిని గీర్వాణ భాషాభ్యాసము సేయఁగోరువారికి నవశ్య పఠనీయము.

ఆ గ్రంథమును దుదముట్టఁ జదువుద మని నే నైదారు పర్యాయములు ప్రయత్నించి రెండు, మూఁడు పేజీలు చదివినంతనే విసుఁగుదల జనించి యూరకొనుచు వచ్చితిని. ఇక నెట్లయినను దుదముట్టఁ జదువవలె నని మహాసంరంభమున నెట్లో యొకటిరెండుపర్యాయములు సంస్కృతగ్రంథమును జదివితిని. ఫలితములు విసుగుదల, అతృప్తి, శ్రమ, ఇట్టి గ్రంథము సంస్కృతకావ్యము. బూర్వ మెవ్వరో తెలిగించిరట కాని నేను దానినిఁ జూడలేదు. ప్రకృత మీ ముదిగొండ వీరభద్రమూర్తిగారొనర్చిన యీ యనువదమును నే నయిదారుపర్యాయములు సావధానముగా వినుట సంభవించినది. విసిన ప్రతితడవయు సంస్కృతగ్రంథముఁ జదువు నప్పటిస్థితికి వ్యతిరేకముగా నున్నది. ఈ కవి వక్తవ్యవిషయ

మును జక్కఁగా మనమున భావించుకొని తన స్వాంతవిష యముగా దానిని వెలువరింపఁగలవాఁడు. చాలమంది యను వాదముల నెఱుంగుదుము. వారు ముక్కఁ-నఁ బెట్టుకొని పరాయి తనముఁ జూపింతురు. శ్లోకార్థము పద్యములం దుండును; కాని యది మెట్లో యొదుగక కృత్రిమముగా నచట నిడినట్లుండును. ప్రకృతపుటనువాద మట్టిది కాక మూల మున్న దని తెలియని వారి కిది స్వతంత్రముగా రచించినట్లుగానే స్ఫురించును. ఇందుకుఁ గల కారణ మేమి? మూలగ్రంథములోని విషయ ములనుఁ బలుమారు భావించిభావించి వానిని స్వభావనా రూపావగాఢములుగా నొనర్పుట. ఈ విషయమున 'మహాకవి మురారి' యిట్లనుచున్నారు.

శ్లో॥ చేతశ్శుక్తికయా నిపీయ శతశ శ్శాస్త్రామృతాని క్రమా
ద్వాంతై రత్నరమూర్తిభి స్సుకవిభి రుక్తా ఫలై ర్గుంభితా"

అని. ఇంతకు దీనిసారాంశము భావనాపరిపాకమున గాని విషయములు సరియగు తీరున వినుపింపఁబడవు. అపుడుగాని సహృదయాస్వాదము నొందఁజాలవు.

భావనాపరిపక్వములగు విషయములకు సరియగు పదముల యదుకు లేనిదే రుచింపవు. అందుకు మృదుపదములతోఁ బాటు వాని న్యాసముకూడ నతిలలితసరళముగా నుండ వలయును.

అదియే శైలీసౌభాగ్యము. ఇందును శయ్యాపాకము లని ద్వైవిధ్యము కలదు. ఇవి సౌరభపరిమళముల వంటివి. అవి

సూక్ష్మాంతరములగు వీనిని గ్రహించి చక్కగా సంధింపఁ గలిగిన నాఁడే గ్రంథము సభ కెక్కఁగల్గును. ప్రకృతగ్రంథమున శయ్యాపాకములఁ గల వైలక్షణ్యమును ఆస్వాదమాధుర్యములో గ్రహింపలేకపోవుదురేమో! ఇంతటి చక్కని శైలిలో వాసవదత్త ననువదించుట చాలామందికి దుష్కరమనియే నా యభిప్రాయము. ఈ కవి సంస్కృతగ్రంథమును సమన్వయపఱచుకొనుట నా యా పట్టులందు స్వయముగా నెఱుఁగుదును. ఈయనతో నొక సంవత్సరమునుండియు బాగుగాఁ బరిచయము నాకుఁ గలదు. ఇందువలన నీ గ్రంథ సందర్భమునఁ గల విషయము లన్నియు సావకాశముగఁ దెలియుటకుఁ దగిన వీలు దొరకినది.

ఈ రచయిత కావ్యకవి. అనగా నెంతటి తర్కకర్కశ ఫణితినిఁ గూడ మాటలనేర్పుతో విడఁదీసి మధురముగాఁ జెప్పఁగలఁడు. ఈ విషయము కావ్యమునఁ బలుతావులందు స్పష్టమగును. మూలకావ్యము నా యా స్థలములయందుఁ జూచుచో నీ కవిప్రతిభ యనువాదమునం దెట్టి బంగరు పూవులఁ బూచినదో తెలియఁగలదు. రాజశేఖరుఁడు నిరూపించిన యష్టవిధకవులలో నీతఁడు మొదటివాఁ డగు రచనా కవిగా నాకుఁ దోచుచున్నాఁడు. ఇంతేకాక యుక్తివైదగ్ధ్యము కూడ ప్రచురపుష్పిత మగుటవలన సూక్తికవి కూడ నగును. ఇట్టి వైదగ్ధ్యములు లేనివాఁ డీ కావ్యము ననువదించుట— అనఁగా సహృదయులకు శ్రుతిమనఃప్రేయముగా నందఁజేయుట గగనకుసుమమే. కావుననే కాబోలీ కవియం దీ రెండునుఁ

బరస్పరస్పర్ధాసాహిత్యముతో నలరారుచున్నట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించినాఁడు. లేనినాఁడు దుశ్శ్రవమును దుర్లభము నగు సంస్కృతములోని "వాసవదత్త" మనకెట్లీనాఁడు సుశ్రవ మును సులభము నయి యుండును? ఇట్టి మధురవిద్యాప్రౌఢిమ యింకను రచనాప్రపంచమున విస్తరించి మకరందతుందిలము లగు సుమముల మన కందించుగాతమని నా యాశాసనము.

ఆనంద తీర్థాశ్రమము
గుంటూరు
2—7—1949

వేదాల తిరువెంగళాచార్యులు
శిరోమణి.

---

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, అభినవవ్యాస, ప్రసన్నవాల్మీకి, కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

*

వాసవదత్త:— ఈ యద్భుతోపాఖ్యానము దొల్లి సుబంధు వను మహాకవి రచించి లోకమునకు సమర్పించినాఁడు. ఈ గ్రంథ మంతయు శ్లేషయమకాదులతో నద్భుతముతో నలం కారములతో నిండియున్నది. ఇది తెలుగున బరివర్తింపఁ జేయుట కష్టసాధ్యము.

దీనిని శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు నిజశేముషీ విశేషంబునఁ జేసి వ్రాసి మీరఁ జేసియున్నారు. ఈ గ్రంథము నేను స్థాలీపులాకన్యాయముగాఁ జదివి యానందించితిని. కవిత్వము మృదుమధురముగా నుండి పాండిత్యమునుఁ బ్రక టించుచున్నది. వీరి తెలుగులోని శ్లేషలు సంస్కృతమునకు

సరిపడి మిక్కిలి యానందమును గూర్చుచున్నవి. శ్లేషయమక చిత్రగర్భిత మగుటన్ జేసి శైలి యించుక కఠిన మని తోప వచ్చిన వచ్చును. అది కవిదోషము కాదనియు నెంత సౌలభ్యము నాసించినవారైనను నిట్లే చేయవలసియుండు ననియు మనవిఁ జేయుచున్నాను.

రాజమహేంద్రవరము.
7—4—1949.

(శ్రీ)పాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

కింకవీంద్రఘటా పంచానన, శతావధాని, శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు (మద్రాసు ప్రభుత్వాస్థానకవులు)

*

బ్ర॥ (శ్రీ)॥ మాదిగొండ వీరభద్రమూర్తిగా రుభయభాషలలోఁ గూలంకషప్రజ్ఞఁగల ప్రతిభాశాలియైనకవి. శ్లేషమయమై రమణీయభావకల్పనా చాతుర్యము కల మహాకవి సుబంధు వాసవదత్తాకావ్యము నింత రసవంతముగా నాంధ్రీకరించినవీరి నిఁగూర్చి ధారాశుద్ధిఁ గలవారు మధురముగా వ్రాయఁగలవారని వ్రాయ నవసరము లేదు. ఇందుమూలములోని శ్లేషలన్నియు వచ్చినవి. జతుకాష్ఠశ్లేష లొండు రెండు విడువఁబడినవి. అవి తెలుగుసేయ నెవరికిని సాధ్యపడదు. కనుక నే

మ॥ "జతుకాష్ఠ కియ నొప్పు సంస్కృతపు శ్లేషల్ తెల్గులో
మార్ప నా । మతికిన్ శక్య మటంచుఁ దోప దల
(శ్రీ)నాథాదు లిప్పట్టున । న్నతు లప్పించిరి నిక్కమియ్యది
ప్రమాణంబుల్ తదుద్గ్రంథముల్"

అని మేము శ్రీనివాసవిలాసకావ్యములో వ్రాయవలసి వచ్చినది. వీ రనేక కావ్యము లిట్లు రచింతురుగాత మని యాశీస్సులు.

క్షీరసాగరం బిల్డింగ్సు
విజయవాడ
11-7-1949.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి.

---

కవిసమ్రాట్, విశ్వనాథ సత్యనారాయణగారు, M. A.

*

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు రచించిన వాసవదత్త వారే వినుపింపఁ గొన్ని భాగముల వింటిని. వీరిరచన మధురమైనది, ధారాశుద్ధిఁగలది. 'వాసవదత్త' శ్లేషప్రబంధము. కొన్ని శ్లేషలు తెనుఁగున కొదుగవు. ఈ కవి యీ తెలుగుసేత యనేకశ్లిష్టబంధములు సులభముగాఁ జేసియున్నాడు. ఈ 'వాసవదత్తను' సంస్కృతములోఁ జదివినవారే యెఱుగుదురు. దానినిఁ దెలుగులోఁ జదువునట్లుఁ జేసిన యీయనకుఁ దెలుగువారు ఋణపడియున్నారనవచ్చును.

విజయవాడ,
9-7-1949.

విశ్వనాథ సత్యనారాయణ.

---

సాహితీ సమితి సభాపతి, తీర్థాశ్రమ సాపక, సాహిత్యాచార్య, కవీంద్ర, శ్రీ శివ శంకరస్వామి.

*

శివశ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు ఆంధ్రీకరించిన "వాసవదత్త" మూలకవి సుబంధువు. వాక్పతిరాజ విరచితమగు 'గౌడవధ' కావ్యములో భాస, కాళిదాస, హరిచంద్రు

లతో పాటు సుబంధునామము కానవచ్చుచున్నది. మంఖకుఁడు తన 'శ్రీకంఠచరిత' మహాకావ్యమున 'మేంఠ, భారవి, బాణు' లతో సుబంధువును గలిపినాఁడు. సుబంధువు, బాణభట్టు, తాను శ్లేషలో సిద్ధహస్తుల మని కవిరాజు చెప్పికొన్నాఁడు. క్రీ. శ. ౧౧౬౮ సంవత్సరమునాటి కర్ణాటకశిలాశాసనమున సుబంధువు కావ్యరీతిలో గట్టివాఁ డని తెలియుచున్నది. డాక్టర్ "కీత్" పండితుని మతప్రకారము సుబంధువు బాణభట్టుకన్నఁ బూర్వుఁడు. కామసూత్రము, ఛందోవిచితి, నాట్యశాస్త్రము, బృహత్కథ, ఉపనిషత్తులు, న్యాయము, పూర్వమీమాంస, బౌద్ధధర్మము మొదలగువానిలో సుబంధువు నిష్ణాతుఁడు.

ఒకచో తరుణిని వర్ణించుచు "న్యాయస్థితి మివ ఉద్యోతకర స్వరూపామ్; బుద్ధసంగతి మివ అలంకార భూషితామ్" అన్నాఁడు. ఇక్కడ ఉద్యోతకారుఁడును, ధర్మకీర్తియు సూచితులు. వీనినిబట్టి సుబంధు క్రీ. శ. ఏడవశతాబ్ది ద్వితీయ దశకములోనివాఁ డనియు భట్టబాణునకు సమకాలీనుఁ డనియు స్పష్టముగాఁ జెప్పవచ్చును. భట్టబాణుఁడు తన హర్షచరిత ప్రస్తావనలో—

శ్లో॥ కవీనా మగల ద్దర్పో నూనం వాసవదత్తయా
శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచరమ్—

అని చెప్పియుండుట సుప్రసిద్ధమే కదా.

సుబంధుకవి కథావిధానమునకును పాత్రోన్మీలనమునకును పాటుపడలేదు. భాషాప్రభుత్వమును ప్రదర్శించుటయే

ఆయన ప్రధానోద్దేశము. "వాసవదత్తలో" ప్రముఖమైనది గౌడీయరీతి. ప్రబంధమో ప్రత్యక్షర శ్లేషమయ ప్రపంచ విన్యాస వైదగ్ధ్యనిధి. గౌడీయశైలి సమాసభూయిష్ఠము. ఓజో గుణమే ప్రధానమగుటచే నెడనెడ కటుశబ్దములుకూడ కర్ణ గోచరములగుచుండును. ఒక్క ధాతువుపై నాధారపడి, వాక్యము బహుదూరము పరుగువారుచుండును. ఇట్టి వాక్యములు వాసవదత్తలో నెన్నో యున్నవి; కాని చిన్నచిన్న వాక్యములుగూడ సందర్భానుసారముగా కొన్నికొన్ని గోచరించును. కావ్యము శబ్దాలంకారభూయిష్ఠము. యమకములు, శ్లేషలు, విరోధాభాసములు నిండుగా నుండును. మొత్తము మీద రచన రమణీయము.

"కందర్పకేలిలంపట లాటీలలాటతట లులితాలక
ధమ్మిల్లభార కుసుమపరిమళ సమృద్ధమధురిమగుణః
కామకలాకలాపనిపుణ కర్ణాటసుందరీ సుందర స్తనకలశ
యుగళ ఘుసృణధూలిపటలపరిమళామోదవాహీ,
రణరణకరసితాపరాంతకాంతా కుంతలోల్లసిత
సంక్రాంతపరిమళ మిలితాలిమాలా మధుకరఝంకార
రవముఖరితనభఃస్థలః, నవయౌవనోద్ధత కేరలీకపోలపాలీ
పత్త్రావలీపరిచయచతురః, చతుష్షష్టికలా కలాప
విదగ్ధముగ్ధముఖరమాలవీనితంబబింబ సంవాహన
సుభగః, సురతపరిశ్రమపరవశాంధ్రపురంధ్రీ నీరంధ్ర
పీనపయోధరభార నిదాఘజలకణనికరశిశిరః
మలయమారుతో వవౌ."

ప్రారంభ ప్రస్తావనలో ౧౨ ఆర్యావృత్తములు, గ్రంథ మధ్యమున రెండు శార్దూలవిక్రీడితములు, ప్రదేశాంతరమున శిఖరిణీ స్రగ్ధరలును కలవు. గ్రంథమందలి రెండుశ్లోకములు మాత్రము సుబంధుకృతములు కావు.

కుసుమపుర నృపాలుఁడగు శృంగారశేఖరునకు, రాజ్ఞి అనంగసేనకును ముద్దులబిడ్డ యీ వాసవదత్త. నాయికా నామమునుబట్టి ఈ యాఖ్యాయికకు వాసవదత్తయను పేరు వచ్చినది. ఈ గద్యకావ్యమును పఠించి, ముగ్ధుఁడై భట్టబాణ కవీంద్రుఁడు అప్రతిమానము లగు నిజగ్రంథములు రచించి నాఁడు.

వాసవదత్తను పద్యరూపమున ఆంధ్రీకరించినవారిలో మూర్తిగారు ద్వితీయు లని తోఁచుచున్నది. వీరు విద్వత్కవి కుటుంబములోనివారు. మూలమును సంపూర్ణముగా గ్రహించి సాధ్యమగునంతవరకు యథామాత్రకముగా తెలిఁగించినారు. మూలములోని శ్లేషలు, యుక్తులు, విరోధాభాసలు సమర్థతతో ఆంధ్రములోనికి తేఁగలిగినారు. మూర్తిగారిది మొత్తము మీఁద ప్రౌఢధోరణి. పానకములో పుల్లవలె పద్యములనడుమ వచనము వెగటు కలిగించును. అట్టిలోపము రాకుండ, వీరు గ్రంథమంతయు పద్యమయముగా నడపుట ప్రమోద దాయకము.

గీర్వాణవాణిలో ప్రసిద్ధములై ఆంధ్రములోనికి రావలసిన గద్యకావ్యము లింకను గలవు. 'ధనపాలుని తిలకమంజరి,'

'వాదీభసింహుని గద్యచింతామణి,' 'వామనభట్టబాణుని వేమ భూపాలచరితము' వంటివి మూర్తిగారు ఆంధ్రీకరించినచో ముదావహమగును.

ఇతి శివమ్

సాహితీసమితి, పిఠాపురము
సర్వధారి, మహాశివరాత్రి

(శ్రీ) శివ శంకర స్వామి.

---

(శ్రీ) భువనగిరి కోదండపాణిగారు.

(Retired Joint Subregistrar.)

*

కవి కెందే ననువాద మన్నది పరీక్షాపత్ర మందున్ మహా
కవి వీ "వాసవదత్త" నాఁ దగు మహాకావ్యమ్ముఁ దెల్గించుటం
దివరంబందుఁ బ్రవాహమందుఁ బ్రతిభం విజ్ఞాన మేపొంద ది
వ్యవిధిన్ గూర్చితి వీరభద్ర! కవిరాడ్భ్రాజాసనాధిష్ఠితా!

గుంటూరు.
13—7—1949.

భువనగిరి కోదండపాణి.

---

సర్వతంత్రకళాశాలా ప్రధానాచార్యులు, బాలసరస్వతి (శ్రీ)॥ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రిగారు

*

శ్లేషాలంకారపరసీమలోఁ జిందులు త్రొక్కి చిన్నారి పొన్నారి నడకలఁ బ్రదర్శించిన సిద్ధాంతకవులలో సిద్ధహస్తు

డైన 'సుబంధు'మహాకవి శేముషీనిధి యనియు,దానిని సమన్వయించుట సాహిత్యనిధులకే సాధారణ మైనది కాని సాధారణ పండితుల కసాధారణమైన దనియు వేరే చెప్పనక్కర లేదు. ఇక సంస్కృతభాషనుండి తెలుగులోని కనువాదముఁ జేయుట; అందునుఁ బ్రసాదగుణముతోఁ బ్రసాదించుట;యెంత సహజకవి కైనను శ్రమ సాధ్యమనిపింపకపోదు. సులభసాధ్యముగా నుండునందురా 'నమోస్తు తేషాం విలక్షణ విశాల బుద్ధీనాం బహుతరనియమైః క్షుణ్ణాయాః పూర్వకవితాయాః మూలోన్మూలనే సిద్ధహస్తానాం ప్రకృత మనుసరామః"

ఏతావతా కష్ట మనువాదము శ్లేషకవితానువాదమో కష్టతరము. ఇక సుబంధుకవికృతశ్లేషప్రబంధానువాదమో కష్టతమమని తేలినది. దీనితో ననుస్యూతములైన బహుగ్రంథములకు రచయితలును ననేకవిధరచనాశైలీ సిద్ధహస్తులు నైన (శ్రీ) ముదిగొండ వీరభద్రమూర్తిగారు మహాకవి యని తేలినది. ఇతర ప్రబంధశ్రవణసందర్భములలోనూ వీరు మధురకవితతో నా కనులకుఁ గట్టినట్లు మహాకవులను సాక్షాత్కరింపజేసినారు. మరల ననువాద గ్రంథము నింతటి ధారాశుద్ధితో ననువదించుట యాంధ్రుల భాగ్య మని యానందించుచు దానితో నివ్వెరపాటు పొందినాను.

విజయవాడ,
15—6—49

తాడేపల్లి సాంబమూర్తి.

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు.

*

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారిని నేను బాగుగా నెఱుఁగుదును. ఈయన మంచికవి. మధురముగా వ్రాయఁగలవారు. ఈ మాధుర్యము పరజన్మనుండి తెచ్చికొన్నది. దీనికిఁ దోడు "మాష్టరు"గారి దివ్యపరిచయభాగ్యమువల్ల నీయనరచన తగినంత ప్రౌఢి గడించుకొన్నది. ఇంతేకాదు, పద్యము చదువుటయందుఁ గూడ నీయనను మెచ్చుకొనవలసినదే. మఱి కావలసినదేమి? వలసిన గుణము లన్నియు నున్నవి. ఇట్టి గుణసమాహార మెచ్చటనో!

ఈయన యిట్టి తెలుగుసేతలతోనే కాక స్వతంత్రరచనలచే నాంధ్రసరస్వతి పాదపూజ నొనర్చుగాత.

విజయవాడ,
17—7—1949.

ధూళిపాళ శ్రీరామమూర్తి.

---

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు M. A. B. L.

*

శ్రీ మహాకవి ముదిగొండ వీరభద్రమూర్తిగారి హృదయము బృందావనము. కనుకనే సామాన్యులకు స్వాధీనపడని శ్లేషాలంకారరమణీయమైన వాసవదత్తాకావ్యము ఆశ్చర్యపఱచునంత మధురముగా వీరిచే నాంధ్రీకరింపబడి వేణుగానభరితమైనది. సుబోధకమై ధారాధిరూఢమైన యభంగసభంగ శ్లేషకవిత్వము వీరిపాటమై హృదయముఁ జూరగొనును. అది కలవానిలో మరల నింతకాలమునకీ యాంధ్రవాసవదత్త యొకటి.

విజయవాడ
11—7—49

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

# ప్రప్రధాన సహాయకులు

---

శ్రీ భోగరాజు బుచ్చిరామయ్యగారు,

కార్యదర్శి, సాహిత్యమండలి, ఏలూరు.

,, సాహిత్యమండలివారు, ఏలూరు.

,, విద్యోద్ధారక ఈదర వేంకట్రావు పంతులుగారు,

ప్రొప్రయిటరు వెంకట్రామ్ పవర్ ప్రెస్, ఏలూరు.

,, భావరాజు వేంకటసుబ్బారావుగారు, బి. ఎ, వసంతవాడ.

(ప. గో. జి)

,, యద్దనపూడి సూర్యనారాయణమూర్తిగారు,

కార్యదర్శి, విజ్ఞానసమితి, తాడేపల్లిగూడెం.

,, రాజా రాఘవరాజు ఎర్రంరాజుగారు,

వెంకటాపురం. (తూ. గో. జిల్లా)

,, విజ్ఞానసమితివారు, అమలాపురం. (తూ. గో. జిల్లా)

---

# ప్రధాన సహాయకులు

---

విజయవాడ

శ్రీ డా॥ దమ్మాలపాటి రామారావుగారు,

సత్యనారాయణపురం.

,, యం. పి. సదాశివరావుగారు, } శ్రీ భారతీ ఇంజనీరింగువర్క్సు
,, K. S. R. ఆంజనేయులుగారు, } ప్రొప్రయిటర్లు.

,, సిరిపురపు కోటీశ్వరరావుగారు, M. C.

---

,, మాదల లక్ష్మీకాంతంగారు, మాదల. (గుం. జిల్లా)

,, మాదల గోపాలదాసుగారు, మాదల. (గుం. జిల్లా)

,, డా॥ గంగరాజు వేంకట్రామయ్యగారు, L. M. P.
కొమ్మూరు (గుం. జిల్లా)

---

ఏలూరు (ప. గో. జిల్లా)

,, కలిదిండి సుబ్బరాజుగారు, B. A.
(Special officer, Dt. Board,) సాహిత్యమండలి ఉపాధ్యక్షులు.

,, పోపూరి వేంకటకామేశ్వరరావుగారు, M.A.B.L.అడ్వకేటు.

,, సోమంచి లింగయ్యగారు, B. A. B. L. అడ్వకేటు.

,, నల్లాన్ చక్రవర్తి శ్రీనివాస పార్థసారథి అయ్యవారు,

,, ,, శ్రీనివాస వెంకటాచార్యులుగారు,
శతావధానులు, శ్రీనివాససోదరకవులు.

,, కలువలపల్లి సుబ్రహ్మణ్యంగారు,

,, బుద్ధిరాజు రాజభూషణరావుగారు, B. A. B. L. అడ్వకేటు
అధ్యక్షులు, సాహిత్యమండలి.

,, నండూరి రామకృష్ణరావుగారు,
అసిస్టెంటు బ్రాంచి మేనేజరు, స్టాండర్డు ఇన్స్యూరెన్సు కంపెనీ.

,, డా॥ దుగ్గిరాల రాజశేఖరరావుగారు M. B. B. S.
ఉపాధ్యక్షులు పురపాలకసంఘం, ఏలూరు.

,, డా॥ రుద్రపాక విశ్వేశ్వరశర్మగారు
ప్రొప్రయిటరు : త్రిపురసుందరీ ఆయుర్వేదౌషధాలయం.

,, ఈదర వెంకయ్య పంతులుగారు
ప్రొప్రయిటరు: రామా అండ్ కో., ఏలూరు.

,, ఉభయభాషాప్రవీణ, సామవేదం జానకిరామశర్మగారు

ఆంధ్రోపాధ్యాయులు, బాలికోన్నత పాఠశాల

,, చాగంటి శంకరశాస్త్రిగారు B. A. B. L. అడ్వకేటు

---

,, కాటూరి వేంకటేశ్వరరావుగారు

ఎడిటర్: కృష్ణాపత్రిక (కాటూరు కృ.జి.)

---

రామచంద్రపురం (తూ. గో. జి.)

శ్రీ రామచంద్రపురం క్లబ్బువారు

,, రాజా కాకర్లపూడి రామచంద్రరాజు బహదూరుగారు

,, బుద్ధవరపు మహాదేవుడుగారు B. A. B. L. అడ్వకేటు

,, జ్యోతిస్సమ్రాట్ వాడ్రేవు వీరేశలింగంగారు

---

శ్రీ బోడా వేంకటరత్నంగారు వర్తకులు, భూస్వాములు,

తాపేశ్వరం (తూ. గో. జి.)

,, అగస్త్యేశ్వరస్వామివారి విచారణమండలివారు ,,

,, మహాత్మాగాంధీ హైస్కూలు కమిటీవారు

ఆత్రేయపురం, (తూ.గో.జి.)

,, పోడూరు మృత్యుంజయరావుగారు

ప్రొప్రయిటరు: మృత్యుంజయ కాఫీమిల్సు, తాడేపల్లిగూడెం.

,, కోకా శివరామశాస్త్రిగారు దివాన్, పిఠాపురం ఎస్టేటు,

పిఠాపురం.

,, బచ్చు సన్యాసిరావుగారు (B. Com.)

మర్చంట్సు అండ్ బ్యాంకర్సు కాకినాడ.

శ్రీ పైడా శ్రీరామకృష్ణయ్య జమీందారుగారు ,,

,, ఇవటూరి వెంకటలక్ష్మీ నరసింహారావుగారు B. A. B. L.

అడ్వకేటు. రాజమహేంద్రవరం

,, మందపాటి సీతారామరాజుగారు

గుండంవారిపాలెం (గు. జి.)

---

## సహాయకులు

---

ఏలూరు. (ప. గో. జిల్లా)

శ్రీ యల్లాపంతుల జగన్నాధం పంతులుగారు

(B. A. (Retired Subregistrar)

,, గరిమెళ్ల కృష్ణమూర్తిగారు, రిటైర్డు ఇంజనీరు

,, వారణాసి పద్మనాభంగారు M. A. L. L. B. వకీలు.

,, ఆత్మకూరి గోవిందాచార్యులుగారు M. L. C.

,, వందూరి వెంకటసుబ్బారావుగారు B. A. B. L. వకీలు.

,, పల్లా సుబ్బారావుగారు

,, నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు B. A. B. L.

వకీలు.

,, శ్రీమతి చుండూరు రత్నమ్మ జమీందారిణిగారు

,, ఉభయభాషాప్రవీణ, కవిశేఖర, గరికపాటి మల్లావధానిగారు

తెలుగు పండితులు, సర్ సి. ఆర్. రెడ్డి కాలేజీ.

,, దామరాజు వెంకట్రావుగారు, అగ్రహారీకులు

Ex-Chairman

శ్రీ బొడ్డు మల్లిఖార్జునరావుసోదరులు, జమీందార్లు.

,, బందా కనకలింగేశ్వరావుగారు B. A. B. L.

,, విద్యారత్న, సాహిత్యభూషణ, నందిరాజు చలపతిరావుగారు

ప్రొప్రయిటరు మంజువాణీ ప్రెస్

,, గ్రంధి ఆంజనేయులుశ్రేష్టిగారు

,, విద్వాన్, సాహిత్య విద్యాప్రవీణ ఇంద్రకంటి సూర్య నారాయణమూర్తిగారు

ఆంధ్రోపాధ్యాయులు, థియసాఫికల్ మిడిల్ స్కూలు.

,, పాలూరి సత్యనారాయణరావుగారు

ఉపాధ్యాయులు, థియసాఫికల్ మిడిల్ స్కూలు.

---

తాడేపల్లిగూడెం (ప. గో. జిల్లా.)

శ్రీ డా॥ తేతలి సత్యనారాయణమూర్తిగారు L. M. P.

,, దూడగడప కృష్ణారావుగారు

,, ములుగు లక్ష్మీనరసింహాచార్యులుగారు

ప్రొ॥ ధనంజయ మోటారు బస్ సర్వీసు

,, బొమ్మిరెడ్డిపల్లి రామలింగేశ్వరావుగారు B. A. B. L.

అడ్వకేట్.

,, భూపతిరాజు వెంకట సుబ్బరాజుగారు

ప్రొ॥ మారుతీ మోటారు బస్ సర్వీసు

,, పోతుకూచి శ్రీరామమూర్తిగారు

,, చివుకుల సూర్యనారాయణశాస్త్రిగారు

,, మల్లాది శ్రీరామమూర్తిగారు

చిత్రకారులు, గాయకులు-లలితకళాశ్రమము

,, డా॥ S. R. అత్తిలిగారు L. I. M.

శ్రీ విద్వాన్, కొత్తపల్లి రామశాస్త్రిగారు

---

రామచంద్రపురం (తూ. గో. జిల్లా)

(శ్రీ) డాక్టరు చెలికాని రామారావుగారు, L. M. & S.

,, పులవర్తి వెంకట నరసింహంగారు.

,, దేశపాండ్య, డా. నందూరి సూర్యప్రకాశరావుగారు.

,, బంధకవి బాపిరాజుగారు, B. A, Vakil.

,, డా. నందివాడ సత్యనారాయణరావుగారు, M. B. B. S.

,, ముక్కవల్లి వెంకటనారాయణగారు, B. A. B. L. Vakil.

,, పిడపర్తి పూర్ణయ్యగారు, B. A. B. Ed.

ఉపాధ్యాయులు, జాతీయోన్నత పాఠశాల.

,, క్రోవి సోమసుందరశాస్త్రిగారు, B. A. B Ed.,

ప్రధానోపాధ్యాయులు, జాతీయోన్నత పాఠశాల.

,, తటవర్తి సుబ్బారావుగారు, Retired Asst. Teacher

జాతీయోన్నత పాఠశాల.

,, తంత్రవహి వెంకటలక్ష్మీపతిరావుగారు, B. A. B. Ed.,

ఉపాధ్యాయులు, జాతీయోన్నత పాఠశాల.

,, శతావధాని, విద్వాన్, మధురకవి,

పులుగుర్త రామారావుగారు,

కనకదుర్గా మోటారు ట్రాన్స్‌పోర్టు కంపెనీ.

,, దువ్వూరి నరసరాజుగారు, B. A. B. L. Advocate.

,, ఆర్టిస్టు, దుర్గవరపు సర్వేశ్వరరావుగారు,

దక్షవాటికా చిత్రకళా సమితి.

,, మట్టె ఉమామహేశ్వరరావుగారు, శ్రీ కృష్ణా రైసుమిల్లు.

శ్రీ తటవర్తి రామచంద్రరావుగారు.

,, శూలి గౌరాంగమూర్తిగారు, వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు.

---

రాజమహేంద్రవరము

,, అవసరాల రంగారావుగారు, B. A. B. L. Advocate.

,, నందూరి బంగారయ్యగారు, B. A. B. L. Advocate.

,, దువ్వూరి రామకృష్ణరావుగారు, B. A.

,, వడ్డాది అప్పారావుగారు, B. A. B. L. Advocate.

,, ఉండవల్లి శంకరకోటీశ్వరరావుగారు,

మ్యునిసిపల్ కౌన్సిలర్ & టింబరు మర్చంటు.

---

గంద్రేడు

,, జ్యోతిర్విద్యావిశారద, ర్యాలి వి. రాజుపంతులుగారు,

శ్రీ పంచముఖి మహాజ్యోతిషాలయం.

,, నూనె నరసన్నగారు, గ్రామ మునసబు.

,, నూనె అమ్మన్నగారు.

,, G. V. S. సత్యనారాయణగారు,

(Section Officer. P. W. D.) విజయవాడ.

,, భువనగిరి కోదండపాణి శర్మగారు,

(Retired Joint - Sub Registrar) గుంటూరు.

,, ఉండవల్లి సత్యనారాయణమూర్తిగారు,

పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, కొయ్యలగూడెం... 

,, ముంటముక్కల వెంకట్రామ దుర్గాప్రసాదరావు

జమిందారుగారు, మలకపల్లి. (ప. గో. జిల్లా.)

(తూర్పుగోదావరి జిల్లా)

,, డా॥ రొవ్వూరి బ్రాహ్మణరెడ్డిగారు, పసలపూడి.

శ్రీ పోతంశెట్టి సుబ్బిరెడ్డిగారు, పసలపూడి.
,, కొంపెల్ల గోపాలకృష్ణగారు, తుని.
,, వట్రికూటి సత్యనారాయణమూర్తి చౌదరిగారు, పులుగుర్త.
,, నేమనూరు శ్రీరామమూర్తిగారు, నేమనూరు.
,, ఆయుర్వేదాచార్య డా॥ కె. హరిహరస్వామిగారు,
M. B. B. S. & A. I. M. కాశ్యప చికిత్సాలయము, అమలాపురం.
,, కందుకూరి రామభద్రరావుగారు, B. A. B. Ed.,
ప్రధానోపాధ్యాయులు, మహాత్మా గాంధీ హైస్కూలు, అత్రేయపురం.
,, మేడేపల్లి వెంకటేశ్వర దేవరాజుగారు, B. A.
గొల్లలమామిడాడ

కాకినాడ

,, విద్వాన్, సాహిత్య విద్యాప్రవీణ,
కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు.
,, కిళాంబి రాఘవాచార్యులుగారు, M. A. B. L. Advocate.
,, సమయమంత్రి అచ్చన్న పంతులుగారు B.A.(Hon)B.L.,Do.
,, బులుసు వెంకట సుబ్బారావుగారు B.A.B.L. Advocate.
,, తోపల్లె కృష్ణబ్రహ్మశాస్త్రిగారు B. A. B. L. Vakil.
,, చిట్టూరి రంగయ్య అండు సన్సు
Merchants & Manufacturer's Agents
,, బొల్లాప్రగడ రామంగారు Vice Chairman
,, చావలి రామసోమయాజులుగారు B.A.B.L. Advocate

తాపేశ్వరం (తూ. గో. జిల్లా)

శ్రీ బి. వి. సుబ్బారావుగారు, ప్యారీకంపెనీ యిన్స్పెక్టరు.

శ్రీ డా॥ ద్రోణంరాజు భాస్కరరావుగారు L. I. M.

,, పెనువర్తి పాపారావుగారు గ్రామమునసబు

---

పెద్దాపురం (తూ. గో. జిల్లా.)

శ్రీ కేశవంపు కామరాజు పంతులుగారు, వకీలు.

,, దర్భా రామబ్రహ్మంగారు B. A. B. L. Advocate

,, శెలపాక సత్యనారాయణమూర్తిగారు B. A. వకీలు.

# కృతి సమర్పణము.

---

గీ॥ "చిన్నతనమందె కఱవయ్యె నాన్నగారు
మల్లికార్జునశాస్త్రి సంపదలచెలమ"

పలుకులఁ గండచక్కెరలఁ బంచిన చక్కని కైతతో సము
జ్జ్వలతరకీర్తితో మధురసాహితితో విలసిల్లు తండ్రిగా
రిల నవధానముల్ సలుప నేఁగననోచన నాకవిత్వపున్
దోలుసున కెంత మెచ్చుకొనునో! ఋణమీగతి వంచునున్నచో॥

ఓ! తండ్రీ! భవదీయ మీ తనువుమున్ వ్యుత్పత్తి నీ పాదసే
వా తీర్థమ్మునఁ గామి కెంత వగతున్ బ్రారబ్ధమిట్లుండె నీ
రీతిన్ గొంతయు నూఱడిల్లి కృతి నర్పింతున్ గపర్దాంకుశో
భాతారళ్యము: గొన్న నీ విధియు సంభాళింపు మున్నప్రభా!

ఇరువదిమైనవత్సరములే శతమై చనకున్న నన్న శం
కరుమొయి నుండి యాత్మరుచి కాండమునన్ రజతాద్రియందు ని
త్తఱి విబుధావళిన్ బలె పితా! శత కావ్యరసామృతప్రభా
ఝరిఁ గవిరాట్చకోరముల సంతతమున్ దనియింపకుందువా॥

శివాభ్యాం నమః

# వాసవదత్త

## అవతారిక

శ్రీవాణీగిరి జాధిపాధిపు శివున్ సేవించి చిచ్ఛక్తినిన్
దేవిన్ మ్రొక్కి "సుబంధు" ప్రౌఢరచనన్ దేదీప్యమానమ్ములౌ
భావమ్ముల్ రవలొల్కు-కాంతుల కదంబం బిందు బింబింపమేల్
దావున్ వాసవదత్త నీ కృతిని సందర్భింతు నాంధ్రమ్మునన్॥

కం॥ శ్రీ మంజిమ ప్రథోన్నతుఁ
డౌ మద్గురున్ మహాత్ముఁ దలఁతు వి
ద్యామరగురునిన్ ముదిగొం
డామృతవంశభవు "మల్లికార్జునశాస్త్రి"న్.

కం॥ ఏ విబుధుఁడు నిగమాగమ
శేవధి సాహిత్యమున విశేషప్రజ్ఞుం
డా "వీరభద్ర" గురునిన్
భావింతు మదీయవంశ్యుఁ బరమప్రేమన్॥

గీ॥ " మల్లికార్జునశాస్త్రిని" మామకీన
జనకు సత్కవిచంద్రు ప్రముఖ నుతియింతు
మజ్జననియైన "నాగమాంబకు" నమస్సు
లివియె శరణులు నిఖిలమాహేశ్వరులకు॥

గీ॥ కాళిదాసాది సంస్కృతకవుల నాంధ్ర
కవుల నన్నార్యముఖ్యుల గణుతిసేతు
సత్కవుల నెల్లరనుఁ బ్రేమ సంస్మరింతు
నాధునికులనుఁ గావ్యశిల్పార్ణవులను.

సీ॥ శ్రీ శేషగిరిరావు చిరమిత్రుఁడు మనీషి
వేంకట రాయని పెద్దకొడుకు
దమ్మాలపాటి వంశమ్మున మేల్మత్య
మారువేల నియోగి యతిమనస్వి
సత్యవచస్వి సాహిత్య శిరోమణి
పట్టమ్ము నొందిన పండితుండు
సంస్కృతభాష వాసవదత్త నన్వయిం
చుటలోనఁ గొంత బాసటగ నిలచె

గీ॥ నా విబుధు తమ్ముఁడౌ రామరావు వైద్య
శేఖరుఁడు సర్వసద్గుణ శ్రీయుతుండు
విజయ వాటీని వాసుఁడు విమల కీర్తి
భరితచతురోక్తియు రసపిపాసి యలరు

నైషధకావ్య మాంధ్రమునొనర్చిన మా కవినాథ లేఖినీ
భూషణమా మదీయకరభూషణ లేఖినివై కవిత్వపీ
యూషము జాలిచ్చి విబుధోత్కరమున్ దనియింతువన్న సం
తోషము సంతరించితి నినుంభజియించితి మాట నిల్పుమా!

గీ॥ ఏని దయ ననేకు లైన గంధర్వుల
కయ్యె శాపమోక్ష మట్టి పూజ్యు
నుద్భటప్రభావు "నుద్భటారాధ్యు" మ
ద్వంశకర్త నెలమిఁ బ్రస్తుతింతు

గీ॥ ఉద్భటారాధ్యవంశీకు లొగి నిల ముది
గొండవారనఁ జేరొంది కొలువువారు
బ్రాహ్మణులు శైవు లతివేలభవ్యయశులు
వేదవేదాంగములలోఁ బ్రవీణులైరి

కం॥ భారద్వాజసగోత్రులు
పారాఖిలమంత్రశాస్త్రపారీణులు తే
జోరవులు నాల్గుజాతుల
వారల శిష్యులనుఁ గల్గి వఱలుదు రెందున్

తమ పాండిత్యప్రకర్ష రాజులు జమీందార్లున్ ధనుల్ శిష్యులై
విమలానేక మణీకనత్కనకముల్ పెంపారన్ జరీ పట్టుపు
ట్టము లీనాములభూములీడవలు మేడల్ మెచ్చియర్పింప న
శ్రమమా పెద్దలురాట్సభాంగణములన్ జాల్కొల్పి రానందమున్

సీ॥ ముదిగొండ యను శివపురముఁ "ప్రతాప రు
ద్రు"ని పూర్వ్యలొసఁగ నందు నివసించి
తమపరి కొండవీటి దణీలు పిలుపించు
కొన వచ్చి తత్సభఁ గు స్తరించి
యగ్రహారప్రాప్తి నలరి "ప్రోలేశుడు"
పిలువ "మామంచల" స్థలి వసించి
యమరావతీనేత లగు "వాసిరెడ్డి వా
రల" యొజ్జలై మాన్యముల గ్రహించి

గీ॥ నాఁడు "మామందలమ్ము"ను నేఁడు "మాద
ల"యు నయిన యూరఁ జాల కాలమ్ము నిలచి
యుండిరి మహాశయుల్ "ముదిగొండవారు"
భక్తిసేయఁగ "మాదలవారు" మెచ్చి

గీ॥ గణయుతంబైన కైలాస మనుకరించె
మా గణార్చనపరుల "మామందలమ్ము"
రుద్రపాఠమ్ము ఘంటల మ్రోఁత శంఖ
రవము శివపూజవేళ నారభటి మొఱయ॥

గీ॥ చందనాగురుకర్పూరసౌరభములు
వివిధకుసుమపరీమళవిలసితములు
లలితధూపసుగంధగంధిలము లవిర!
వారి గృహములు షట్కాలభవ్యపూజ

సీ॥ ఏ దేవు మాహాత్మ్య మెలరొప్ప వ్రాసె మ
జ్జనకుండు "మల్లికార్జున" మనీషి
యే యీశు వైభవం బెచ్చించు "ముదిగొండ
సోమనారాధ్యుండు" సొమ్ము గుప్పి
యే లింగమును బ్రతిష్ఠించె సద్భక్తి నా
సార్వభౌముడు మును "సగరరాజు"
నే వంద్యునకు నిత్యనైవేద్య కల్యాణ
ములకునై మాన్యముల్ గలవు మిగుల

గీ॥ నట్టి "సగరేశ్వరుండు" లింగ మధివసించు
పావనస్థలి ధనికుల పట్టు గొమ్మ
రాజకీయప్రసంగ చర్చావితర్ది
మా నివాసమ్ము "మాదల" మానితమ్ము

కం॥ పెఱయూళ్ళ భూములుండన్
వరశిష్యుల యభిమతమ్మునన్ "మాదల" నీ
డిరి నివసించుచు నా మా
యిరువుల "ముదిగొండవా"ర లెందఱొ నేఁటన్

గీ॥ కలరు విద్వచ్ఛిరోమణుల్ గలరు శతవ
ధాను లాగమ వేదశాస్త్రిప్రవీణు
లెందఱో కళాప్రపూర్ణులు నీ కొలంపు
వారిలో నేఁడుఁ గూడ సంపదలఁ బొదలి॥

గీ॥ అట్టి యారాధ్యవంశంబున్కనందలి యొక
పండితుల కోవ మాయది యండ వదల
కుంటి మా గ్రామమందె మా యొజ్జతనము
భూమి జీవిక కాధారములుగఁ దనర॥

ఆ॥వె॥ బహుసహస్రసంఖ్య మహిదేవభోజన
మహితదానకలన మా కుటుంబ
ములఁ దరాలనుండి పిలువ "సహస్రాల
వార"నంగఁ బేరువడితి మేము॥

జనకుం "డప్పయయయ్యవారు" శివపూజానిష్ఠు డార్యేశలన్
దనసోదర్యులుసాంబమూర్త్యుడును "లింగయ్యాయ్యవారు"ఁ గణా
ర్చననిష్ఠుల్ సుజనప్రపూజ్యులు సతీరత్నంబు"మీనాక్షమ్మ"
దన యర్ధాంగిగ నొందె మేలుగని మా తాతయ్య "నందీశుడే".

కుందనముఁ హసించు మెయిసోముని నందము జిందుభోగి పల్
చంద ములైన వైభవ మెసంగ సుఖించెను సాటివారిలో
నందఱ కన్న మిన్నగ శివాగమపండితుడైనవాఁడు మా
"నందయ"తాత చాతురి పెసంగొను మాటలు పుట్టదిట్టయై.

గీ భవ్య "లింగాంబ" "బుచ్చిపాపయ్యవారి"
జాయ యాప్తి నొసంగె వత్సలతఁ బెంచి
శిష్యసంచారభాగ మిచ్చె జనకుండు
ధన్యు డెంతొ మా తాత "నందయ్యవారు"

గీ॥ అస్మదీయపితృభ్రాత యాగమశ్రు
త్రిప్రవీణుడు సుందరదీప్రమహిత
విగ్రహుఁడు "శంకరారాధ్య"విబుధుఁడేడి
"వర్ధనమ" యేది తద్భార్య భవ్యచరిత

పలుకుల కండచక్కెరలఁ బంచిన చక్కని కైతతో సముఁ
జ్జ్వలతరకీర్తితో మధురసాహితితో విలసిల్లు తండ్రిగా
రిల యవధానమున్ సలుప నేఁగన నోచన నా కవిత్వపుం
దోలుకున కెంత మెచ్చుకొనునో ఋణ మీఁగితి వంచునున్నచో॥

గీ॥ మూఁడు తరములనుండియు "ముల్గువార"
లనబడిన "వేమనారాధ్య" నన్వయంపు
వారితోఁ సాఁగె మా కుటుంబంపు వియ్య
మమ్మయును బామ్మయును నామె యత్త గాఁగ॥

గీ॥ అన్నదానంబునందు మా యయ్య తల్లి
యైన "మీనాక్షమ్మ"కు నెన యైన వారి
"వినము చూడము" టంచు నెందును వచింత్రు
మమ్ము సంతే నెఱుంగు జనమ్ము లెపుడు॥

గీ॥ పంచకల్యాణిగుఱ్ఱంబు భాగ్యగరిమ
దానశీలము పాండితి దర్పకోజ్జ్వ
లాకృతియుఁగల "వీరభద్రయ్యవారు"
ధార్మికుండు మదీయమాతామహుండు

గీ॥ శీవికిని గొప్ప దర్జాకు తావు "ములుగు"
కొలపు సంద్రదంపు నెల "యాటుకూరు" వాసి
యమృతహస్తుఁడు "వీరభద్రయ్యవాగు"
దండివెజ్జు మదీయమాతామహుండు।

గీ॥ లక్ష్మి విహరించు పచ్చని లపనసీమఁ
బెద్ద కుంకుమబొట్టుతో పృథివినున్న
గౌరి వలె నయ్యె మా యమ్మఁ గన్నతల్లి
"యంబమ" పతివ్రతామణి యంఘుశీల

ఒక నిముసమ్ము నన్నుఁ గనకున్న యుగమ్ముగ నెంచుచుండు నే
నొకఁడనె సంతు కాగ విభవోద్ధతి నే నెటు లెన్ని వేలు రూ
పికలను వెచ్చబెట్టినను "బిల్లఁడునొచ్చు" నటంచు బెట్టుఁ బ
ల్కె నను దిద్దు నా జనని జ్ఞానధురీణయు ధైర్యరాశియై

ఉ॥ కన్నుల చందమామ యని క్రన్నన నన్గని "నాన్న తప్పతి
న్నినుఁ గళంకితోడ గుపనిందితుతో క్షయరోగితోడఁ బో
ల్చ న్నినుఁ బిల్చుఁబుణ్యముల పంటనుగా నిపుడొప్పె" నన్న న
న్గన్న సుధీసతిన్ విదుషి "నాగమ" గోల్పడి కష్ట మందితిన్

కం॥ నే నేనుఁగుపై నంబా
రీ నూరేగినవి పెండ్లిరే లది గని తా
నేనుంగు నెక్కినంతై
యానందము నొందె దల్లి యన నామె కదా!

నా పాటాడఁగ మెత్త పట్టుపఱుపుల్ నా యత్త మిల్లంగ మ
ల్లీపుష్పమ్ములశయ్య నా తినఁగ ఢిల్లీభోగ మృద్వన్న మె
న్నో పాకమ్ముల కమ్మవంటకములుం గోరాఁగన్నటుల్ రత్నభూ
షాపాళిన్ సమకూర్చిన న్బెనిచి రస్మ న్మాతయుం బామ్మయున్.

గీ॥ చిన్నతనమందె కలువయ్యె నాన్నగారు
"మల్లికార్జునశాస్త్రి" సంపదల చెలమ
నడివయస్సునఁ గలువయ్యె "నాగమాంబ"
మలహర పదాంబుజాలంబ మామతాంబ

మా ముత్తాతల శిష్యులై సువిపులః మాన్యంబు నిప్పించి మ
మ్మామోదం బభిమానముల్ దొలుక నుద్యద్రీతి నీనాఁడు నెం
తో మన్నింతురిక శ్ప్రసిద్ధిగల "కొమ్మూర్" "రంగరాజ" న్వయ
శ్రీమంతుల్ ద్విజు లారువేలఘనవంశీకుల్ మహోదారులై

కం॥ మా తాతల శిష్యులు మ
మ్మాతతఁనిర్ భక్తియుక్తి నీక్షింతురు శ్రీ
స్ఫీతులు "మాదలవారు" సు
నీతినిరతు లారువేల నియోగివరుల్॥

సీ॥ వారలలో "పెదపండయ్య" మనుమలు
"గోపాలదాసు" సద్గుణు నిదాను
"డాదినారాయణుం" డతులమేధావి యా
శ్రితపోషకుండు స్వర్గీయుఁడయ్యె
బెజవాడ నుండు సవ్వీములు తమ్ముఁడు "పాంకు
రంగసదాశివరావు" విభవ
రాజి "లక్ష్మీకాంతరా" వాంధ్రభూషణభా
షల నారితేరె సౌజన్యశాలి

గీ॥ ధర్మకర్త యశస్వి యాధన్య గృహిణి
"రాజ్యలక్ష్మమ్మ" గృహలక్ష్మి పూజ్యచరిత
భర్తృసంసేవనవ్రత భాగ్యభరిత
మమ్ముగురుభక్తి నలరించు మహిత విదుషి

కం॥ ఆ "లక్ష్మీకాంతార్యుడు"
భూలక్ష్మీదాన మొసఁగి పూజించె మమున్
శ్రీలలితుఁడు మర్యాదకు
శీలమునకు తావు మమ్ము జేకొను నెలమిన్

గీ॥ వంద లొసగిరి "కల్వాలవారు" "పోల
వారు" మున్నగు శిష్యులు వైశ్యవరులు
నూరు లెన్నని "తుమ్మలవారు" "గుండు
వారు" మొదలగు రెడ్లిడి నార లటులె

కం॥ కొమరుల మువ్వుర నలువురఁ
గొమరితలన్ గంటి ధూపగుంట్లాన్వయజా
త మదీయపత్ని ముప్పదె
నిమిదేఁడుల యీడువాఁడ నేఁ బార్థివతో॥



# వాసవదత్త

## ప్రథమ తరంగము

గీ॥ కరబదసదృశమ్ముగాఁ గవులు భువనః
తలము నెల్లను సూక్ష్మమతులగుచుఁ గను
గొందురో యత్ప్రసాదము నొంది యట్టి
దేవిని సరస్వతిని జయార్థినయి కొలుతు 1

అలసితి శైలముల్ వదలు మందఱ మేము భరింతు మంచు గో
ల్లలు త్వరవెట్ట దా భుజముల౯ సడలించిన తోడ వారి బా
హులు వితథమ్ములై నిలుప నోపక భుగ్నములౌటఁ గాంచిమి
క్కిలి హసియించుసుందరుడు కృష్ణుడుమిమ్ములనోముగావుత౯.

గీ॥ ఫాలనయనప్రదీపమ్ము పయిని గౌరి
కాటుకనుఁ బట్టఁదలఁచి యుత్కంఠనిడిన
రాజితము శుక్తియా యన! రాజరేఖ
మౌళిఁ గలిగిన తండ్రి మమ్మేలుఁగాత!

గీ॥ కఠినతర దామ వేష్టనఘటిత లేఖ
లేమొ! యను సందియమ్ము నొందించు వళివి
భంగములు గల వనమాలి బ్రాతిఁ బ్రోచు
సర్వజనులను సంపదల్ సౌఖ్య మొసఁగి ॥ 4

గీ॥ ఇతరుల గుణమ్ము వృద్ధి నొందించు చున్న
సుజను సౌభాగ్య మధికమై సొంపు నించుఁ
గలువపువ్వుల విరియించు కతనఁ జల్ల
వెలుఁగుజిగి జమిలించిన చలువగాఁడె॥ 5

గీ॥ నీచకార్యమునం దవి నీతిపరుల
తెలివి కడుఁ జతురమ్ముగాఁ దేజరిల్లుఁ
గటికి చీఁకటిలోన మిణుఁగుఁటము కాదె
గుడ్లగూబల కనుకలి కొఱలుబెల్ల॥ 6

గీ॥ విషధరకన్న ఖలు డతివిషమువృత్తి
యనిన బుధవచన మ్మసత్యమ్ము కాదు
నల కులద్వేషి యగు పిశునాత్మకన్న
నకులవిద్వేషి సర్పంబ నయము కాదె॥ 7

గీ॥ బూతిచే మలినంబైన చేతి కీడు
చెడ్డవా డెంత రాపిడిన్ జేయుచుండు
నంత నిర్మలమగు వాసి నందగించు
దర్పణమునకు సరిఁ బూఁగు ధార్మికుండు 8

గీ॥ పరుల గొనములఁ జెఱుపఁగఁ బాపజాతి
ఖలుని మాలిన్య మధికమై కావిరించుఁ
గరము నలుపెక్కి కనుపట్టుఁ గాదె చంద
మామ మెఱుఁగును లోఁగొన్న మబ్బురంగు॥ 9

కం॥ అవిదిత గుణమయ్యును స
త్కవికృతి చెవిలో మరందధారలఁ గురియున్
డవులదు వల పైగను జా
జీవిరుల సరి చూడ్కి కెంతో చెలువము కాదే। 10

కం॥ సుజనులకునుఁ దమగుణముల
నిజస్థితులు పరుల వలననే తెలియఁబడున్
బ్రజ లద్దం బెఱిగింపక
నిజనేత్ర ప్రభనుఁ దెలియ నేర్తురె యెందున్ 11

కం॥ భువి గీర్తి శేష మొందెన
ల "విక్రమాదిత్య" పతి కొలంకు బలె నయో
కవిత రసపుష్టి యొనరదు
నవకవి జృంభణములే కనంబడు నెందున్ 12

# కథాప్రారంభము

భూమిపు లెల్ల సంపదలఁ బొంపిరివోవఁ దనీయనూనచూ
డామణిశాణకోణములు డంబగు రాపిడి మకుటీటి యే
కామితదాయి పాదనఖక్రమమణుల్ వెలుగొందు నట్టి చిం
తామణి నామధేయ వసుధాపతి భారతరత్నమై తగున్ 13

కృతవసు దేవతర్పణుడు కృష్ణుని మాడ్కి యశోద మెప్పు సం
తతముగఁ గంసమర్దనుఁ విధంబున గల్గు ననంతభోగి మా
ళి తల చిరత్నరత్నరుచి లీనపదుండు సముద్రశాయి య
ట్లతఁ డుదధిస్థితిన్ సమకరాంచితుఁడై తగు వాహినీశుడై 14

చెలగున్ దత్పతి తా హిరణ్యకశిపుచ్ఛేత్రప్రదానంబులో
న లలిన్ మానవసింహుఁడై పృథివి నా నారాయణున్ బోలి భా
సిలి సౌకర్యమునన్ భరించును మహాసేనానుయాతుం డతం
డలరు న్నిర్జితమారుడై హరుని సామ్యం బొంది సౌఖ్యంబుమై॥15

గీ॥ విశ్వ కర్మాశ్రయుండును విబుధ నిలయు
డౌట మేరువుఁ బోలు నా శాంతరక్షు
ణుండు వరుణుని సరి యగస్త్యుండు మాడ్కి
దక్షిణాశా ప్రసాధన దక్షుఁ డతఁ డు" 16

కం॥ రతి సుఖదుఁడు ననిరుద్ధో
న్నత సంపత్కలితుఁ డౌట ననవిల్తునకున్
గృత కావ్యాదరుడై భూ
పతి వసుదేవునకు నీడు వచ్చునుఁ బేర్మిన్॥ 17

కం॥ ఛాయా సంతాపంబును
ద్రోయుట క్షణదాన పగతుఁ దొడరుట రవి కె
ట్లో యా భూభుజునకు న
ట్లే యగునుం గాన సమము లిరువురి గుణముల్। 17

గీ॥ అతఁడు ధృతరాష్ట్రుడయ్యె గుణానురాగి
యతరశత్వంబుఁ గలిగియు నతఁడు నాయ
కమణి విద్యాధరుండయ్యె సుమనసుండు
నతఁడు రాజయ్యె మిత్రుడై యతిశయించు 19

కం॥ అనయము క్షమానుగతుఁడ యు
యినను సుధర్మాశ్రితుఁడుగ నెసఁగును సరళ
త్వానిభృతి లోఁ గల డా జన
వనజరవి భృహన్నలానుభావుండయ్యెన్ 20

గీ॥ జనితకుశలవయోరూపశక్తి గాన
రాముడనియు సుమిత్రాభిరాముడయిన
ధృతసుమిత్రుండు గాన పంక్తిరథుడనియు
కవులు కీర్తింతు రా కవికల్పశాఖి॥ 21

గీ॥ అతని దాతయు సదాపార్థుడైనఁ గాని
తగఁడు తగఁడు మహాభారతరణమునకు
నగు నశాంతనవహితుఁ డయ్యధిపు వైరి
భీష్మకుఁడయ్యును మతి చెడి బింకమెడలి॥ 22

గీ॥ మిత్రు నుదయంపు హేతువై మేలిమిజిగి
మీఱి యచలాధికశ్రీ సుమేరువైన
యతని పగఁగొని గోత్రభూషితుఁడు గాడు
సానుచరుఁడైన నెన్నఁడు శాత్రవుండు॥ 23

కం॥ అవధూతాఖిలకాంతా
రవిస్మృతి సుమనోహరుండు ప్రభుత నభోగో
త్సవపావకాగ్రసుఁ డా
ధవమణి పావడొందెఁ పటుసదాగతి యనఁగా॥ 24

కం॥ కటకచరద్గంధర్వో
త్కటసుఖదుఁడు ప్రకటితాత్మఘనశృంగభరో
ద్భటు డా నృపావతంసుఁడు
పటుసామర్థ్యమునఁ దనరుఁ బర్వతనిభుఁడై॥ 25

క॥ "స హిమానీగిరి సంస్థ
స్సుహితో వృష కేతు" వనుచు సూరులు తన్నుఁ
బహుభంగులఁ గీర్తింపఁగ
మహినీశుఁడతండు తనరు మహిమోన్నతుఁడై 26

సీ॥ గోత్రోద్ధరణమయ్యు గోత్రోద్దళన మూనఁ
ప్రథమవరాహంబు ప్రథితమానె?
జనకభూచ్యుతుఁడయ్యు జనకభూసహితుఁడై
యడవిఁ బట్టిన రాముఁ దడవ నగునె ?
రామభక్తుండయ్యు రాజ్యవిరామంబుఁ
గొనినట్టి భరతుని గొడవ యేల?
దమయంతి నొందియుఁ దాఁ బునర్భూపతి
గ్రాహి యైన నలుండు గ్రాహ్యుఁ డెట్లు?

గీ॥ పృథువు గోత్రోత్సరణమునఁ బృథివిఁ బెంచె
గాన సరిరాఁడు లోపముల్ గలుగు నిట్టి
వెనుకటి నృపాళితో లోప మణువు లేని
పూజ్యుఁ జింతామణీశునిఁ బోల్పఁ దగునె 27

గీ॥ తగు జరాసంధు డటుల నాతండు ఘటిత
సంధివిగ్రహ కలిత ప్రచారుడగుచు
వెలయు నతఁడు సుదక్షిణాన్వితుఁడు గోవ
నమున చణుడై దిలీపభూరమణు నెనసి 28

క॥ ఆయన సదానభోగుం
డై యొప్పును భార్గవునకు ననుగలముగ నా
రాయఁడు సృగాలవధమున్
జేయని చక్రధరుఁడనఁగఁ జెన్నలరారున్ 29

గీ॥ అతఁడు ముక్తామయత నున్న నతరళంపు
మధ్య మూనును రామేష్టమతి యయిన సు
బాహు వాతఁడు సమదృష్టిఁ బరఁగియును మ
హేశ్వరుం డన నెగడు నా నృపవరుండు॥ 30

సీ॥ మొనసె కరచ్ఛిద ననలుఁ గోయుట యందె
కరపత్రముల కోత కంజమందె
కమిచె నేత్రోత్పాటనము తపస్వులయందె
యనలతులాశుద్ధి కనకమందె
ఖలసంప్రయోగంబు వెలయు ధాన్యమునందె
పఱఁగు నాస్తికత చార్వాకులందె
కంటకయోగంబు కలదు యోగమునందె
తగు రాజవైరమ్ము తమ్మియందె

గీ॥ సూచిభేదంబు మణులందె చూడఁగలము
సార్వభౌమత దిగ్గజస్థంబె యయ్యె
నిలిచె పరివాద మెల్ల వీణియల యందె
నా మహారాజు పాలించు నవధియందు॥ 31

సీ॥ భారతంబందు కన్పడును దుశ్శాసన
వర్తనం బెవ్వారివలన లేదు
రెండునాల్కల వాని జేచుట పాముల
వాండ్రలోఁ దక్క నెవ్వరికిఁ గాదు
నారయ ఫలనిగ్రహప్రయోగము తర్క
సమయమ్ములనె దక్క జరుగ దెందు
భామినీ నూతనప్రసవ వేళల యందె
గా కెందు శూలభంగమ్ము సున్న

గీ॥ దహన హీనుఁడ కృష్ణవర్త్మయు ననాశ
యాశుఁ డగు పావకుండు విషాది కాని
శంకరుండు ననాశ్రుసరణి గళితుఁ
డగు త్రిశంకుఁ డతండు రాజ్యంబుసేయ॥ 32

సీ॥ రతనములగని యనతిమయుండును సదా
హిమకరాశయుఁ డమృతమయుఁడనుచు
మర్యాదఁ గలఁడు విస్మయుఁడు సత్త్వోపేతుండు
నోద్రేకుఁడౌ కడు యోగ్యుఁ డనుచు
"తస్య మహోనదీన స్యాచలోపి న
క్షోభ్యః" యటంచు నగాధుఁ డనుచు
బొగడుదు రతని సముద్రునిఁగాఁ గొంద
ఱెల్ల కళల పుట్టినిల్లటంచు

గీ॥ ధనుపు ఘణదోర్జ్వలతఁ గుముదవనముఖ్య
బంధు వనుచు నతారాతిబలుఁ డటంచుఁ
గొందరా తేనిఁ జంద్రుఁగాఁ గొని నుతింత్రు
శ్లేషభాషలఁ జతురిమ శేఖరింప॥ 33

గీ॥ అతఁ డకస్మాత్తుగా జీవనాపహృతుల
మెలఁగ డంతకు చాడ్పున మిత్రమండ
లగ్రహణమతి గాడు రాహుగ్రహాగతిఁ
గలివిజితవిగ్రహుఁడు కాడు నలుని మాడ్కి॥ 34

గీ॥ అట్టి నృపునకుఁ గలఁ డొకఁ డాత్మజుండు
పేరు "కందర్పకేతు" వ వ్వీరుఁడు శ్రిత
నందనుఁడు కల్పవృక్షంబు చందమున హి
మాద్రి వలెఁ జనితశివుండునై యెలర్చు॥ 35

కం॥ నానారామానందము
గా నామని వలెఁ జెలంగుఁ గంతుఁడు బలె స
మ్మానితరతి యతఁడు నరు వి
ధాన సమరసాహసోచితప్రజ్ఞుండున్॥ 36

గీ॥ ఒప్పు నా భూపతి మహేశ్వరోపభుక్త
కోటి కైలాసతుల్యకై కొఱలు నతఁడు
విష్ణుపదయుక్తి నవదాతవిపులహృదయు
డౌట వెన్నెలకార్కొయిల్ దీటుఁగాంచి। 37

గీ॥ విమలతరవారిధారాపరిభీతరాజ
హంసమండలి యతఁడు వారనధి విధగ
నతఁడు క్రోడీకృతసుతను వచ్యుతుండు
బలె సుముఖనందనుండు సుపర్ణు నోజ॥ 38

కలితసుశర్మతన్ దనరుఁ గౌరవసేనల మొగ్గరంబునన్
బలెఁ గడలిన్ మథించు తఱి మందర మట్టుల భోగిభోగచి
హ్నలలితుఁడై బలాప్తభువనధ్వని యాతఁడు కాలధర్మమున్
జెలుచ నధీనమందుఁగాని భీష్ముఁడు నా నతఁ డుల్లసిల్లెడిన్॥39

గీ॥ కువలయాపీడభూషణుం డవ్వుట వలనఁ
గంసుఁ బురుడించు నీశానఘనవిభూతిఁ
దొరయుఁ సంధ్యోచ్చ్వలన మూని నరవరాత్మ
జన్ము డన్నింటఁ గడిదేరి జాణ యగుచు 40

సీ॥ సొగసొల్కువాని ననుగతదక్షిణసదా
గతిని కోమల కలకంఠకంఠుఁ
గనుపీనులకు హాయిఁ బెనుచు వానిని నతి
క్రాంతదమనకు వసంతసముని
సుఖ మిడెడు సురభిసుమనోమనోజ్ఞ భా
సురపల్లవుని సర్వసులభపద్మ
కనకంపువిరివిఁ గల్గిన యతనిఁ గృతకాం
తారతరంగు నుత్సాహభరితు

గీ॥ భ్రమరసంగతలైన ప్రవాళహారి
ణులును వే లుత్కలికలు సంకులతఁ గొన్న
విలసితవయస్కలు నగు భామ లుపవనల
తాసముల్ పొందఁ గోరుదు రాసజేసి! 41

అతఁ డొక వంశదీపముగ నయ్యెను మిక్కిలి వెల్గుచుండు న
క్షతదశ నెల్లవేళ రతికాంక్షితుఁడై యనిరుద్ధలీల ను
ద్ధతి విలసిల్లు నాతని లతాంతశరాసనుఁ గాంచి కామినీ
ప్రతతి సుఖించుఁ బొంగి వలరాయఁడు కన్నులఁ గట్టినట్లుగా. 42

భరితకలుండు కైరవవిబంధువు నాతఁడు శర్వరీతిమి
రి రహిఁ బ్రసాధితాశుఁడు నెటన్నఁగ నఁ జందురుఁడట్టుల్ పరిజన్ సుఖం
తురటఁ బ్రసన్నసత్వముల దూరవివర్ధితజీవ నమ్ముకల్
సురుచిరగోత్రయుక్తి మనుచున్ జలధిప్రకరమ్ము పోలికన్ 43

సీ॥ ఉర్వోత్తుగాఁ బోర నెవ్వాని కేల విల్
వింట ముల్కియు ముల్కివిడుపున నరి
శిరము తచ్ఛిరమునఁ ధరయు నా ధరణితో
ననుభూతపూర్వనాయకునిఁ దలఁచు
టా తలంపునఁ గీర్తి యా కీర్తి నేఁడు వా
రిధులు వారినిధులఁ గృతయుగాది
ధరణీపతిస్మృతి దానఁ తేఁకువ తేఁకు
వఁ బ్రతిక్షణముఁ డబ్బాటు, తోఁచు

ఆ॥వె॥ దత్ప్రతాపవహ్ని దగ్ధకాంత లయిన
పగరకాంత లెడఁదఁ బాఁదుకొనఁగ
నలఁగు భీతి నేమొ! తలఁగె ముక్తాహార
ములు పయోధరముల కలిమిఁ బాసి॥ 44

సీ॥ కఱకునారాచముల్ గాఁడి చీల్చిన మదే
భముల కుంభముల సుప్పాణు లురలి
పరిసరంబులఁ బర్వఁ గరిపాదకచ్ఛపం
బులు రక్తవారిలోపలఁ జలింపఁ
దరియించు పత్రరథమ్ములు మిట్టు క
బంధమ్ము లగణితవాహినులును ఁ
గలిగి కలంగి యుజ్జ్వలసురనారీస
మాగమోత్సుకచరదఖిలభటులు

గీ॥ హుంకృతుల నార్వ బెడిదమై యుదధిఁబోలు
కదనముఖమున నతని ఖడ్గము పదాతి
గజతురగరుధిరార్ద్రమై విజయలక్ష్మి
యడుఁగులత్తుక నెఱ్ఱనై నట్లు మెఱయు॥ 45

గీ॥ అట్టి వీరాతివీరుఁడు నందగాడు
నైన యా రాట్తనూజుఁ డహర్నిశోచి
తసకలోదాత్తసుఖభోగి తనిసి నిదురఁ
గూరెఁ బున్నమజాబిలి కూఁకుచుండె 46

గీ॥ కాలమను జైనసన్న్యాసికై ఫలార్థి
పెరుగుతో నిడ్డ తెల్లని పిండ మనఁగ
రాత్రియమునానదీఫేనరాశి యనఁగ
చంద్రబింబంబు తగెఁ దదస్తమయవేళ 47

గీ॥ తేనె తెట్టె మెఱుంగు లోనూని చంద్ర
బింబ మప్పు డొప్పె నఖమార్జనంబుకొఱకు
మేనక విలాసవతులలో మేటి యిడిన
క్రమమగు పటికపు రాతి ఖండ మనఁగ॥ 48

వెనుకటికొండదిండుపయి బిత్తరి శీర్షము నుంచిహాయిమైఁ
దనరెడి శ్యామ కున్న రజతశ్రవణాభరణం బనంగ రే
వనిత మిగిల్చినట్టి మధుభాగము నిల్చిన పాత్రమో! యనం
గ నపరవార్ధి శంఖరుచికాముకుఁడో! యనఁ చందు మున్గినన్॥ 49

ఆ॥వె॥ తనువుమంచుబొట్లతడి కదంబించుటఁ
బురద యయిన మెత్తపుప్పొడుల న
డుంగు లారఁ గూరి భృంగంబు లయ్యెడఁ
దావఁ జిక్కి యొదిగె నెవురలేక॥ 50

గీ॥ వేగ నడచుచు రాగంబు విస్తరింపఁ
గావ్యకథ్యల రథ్యలఁ గ్రమఘణితి
ముఖరులై యాలపించుచుం బోవఁదొడఁగి
రత్తఱిన్ నిత్యయాత్రికు లైన జనము॥ 51

గీ॥ పటుకళాప్రలాపపరిబోధితాభిసా
రికలు శారికలు చరించి కెరలె
మఠములునుఁ బ్రబుద్ధమానితాధ్యయన క
ర్మరతము లయ్యె నుదయరాగ మొదవ॥ 52

రాతిరియందు నెల్ల తిమిరమ్మును మిక్కిలిగా గ్రసించి యే
రీతిగనేనిఁ జీర్ణ మొనరించుకొనంగ నశక్యమై మహీ
వ్రాతమిషమ్మునన్ వెడలఁగ్రక్కెను దానినిఁ దీపముల్ దురా
శాతిసమార్జితంబయిన యర్థముఁ గక్కు నశక్తు లట్లుగా॥ 53

సీ॥ తమకిక్రింద శరణాగతంబౌ! నాఁబడియున్న
యంధకారము నల్ల నాపి నిలిపి
స్నేహంబు దగ్ధమై నీచు మాటలు వోలె
తరతరంబుగను మాంద్యంబు నొంది
కామినీరతిలీలఁ గాంచుటకో! యనన్
దల లెత్తియెత్తి యున్నత ముడింగి
వివిధవిలాసచిత్రవిచిత్రసురతకే
ళుల సాక్షులై నిట్ట నిలిచి యలసి

గీ॥ యెంతో ముదుసళ్ళ పగిది దశాంత మొంది
దనువుసంతతి యన నిశాంతమున దలఁగి
యస్తగిరిశిఖరావళి యటుఁ బతత్ప
తంగమై దీపజాల మడంగుచుండె 54

గీ॥ మేటిరాజులు నాపద వాటిలంగ
పాత్రమాత్రావశేషతఁ బఱఁగుచుండు
మాయటు లటంచుఁ జాటెడినో! యనంగఁ
గానుపించెను దీపముల్ కాంతి వోయి॥ 55

అత్తఱిఁ గేళికాగృహములం దెడలేక తొలంగు తేనెబొ
ట్లొత్తుగఁ దావి జుమ్మని మదోద్ధతి ముగ్ధములై ధ్వనించు తేం
ట్లత్తిన పూవుసెత్తులును నట్టివె గుత్తులు వాడువాటె లో
నుత్తలమంద రన్నలు ప్రియుల్ బెడఁబాసెడు వేళ యాటచే॥ 56

కం॥ ప్రియతమవియోగదుఃఖము
పయికొనఁ బడు బాష్పజలలవంబులొ నాగాఁ
బ్రియులకు భ్రమరకములనుం
డి యురలుచుండెను వరుసబడిఁ గుండమ్ముల్॥ 57

కం॥ ప్రియతములఁ బాయ వలదని
నియమించుచునుండె ననఁగ నెలఁతల పాద
ద్వయవాచాలితనూపుర
చయము మొరయఁదొడఁగె నపుడు సకలస్వనమై 58

కడపటిరేయి కూటముల గాఢపరిశ్రమమందు శైత్యముల్
విడివడి పై సరాల నరవిచ్చిన మాలతిపూల మాధురిన్
బడయ భ్రమించు తుమ్మెదల పక్షములఁ జిరుగాలి కల్గి పై
బొడమిన చల్లఁజెమటబొట్లనుఁ ద్రోవ సుఖించి రంగనల్ 59

కరయుగ్మమ్మున నొత్తి కంకణఝణత్కారమ్ము తోరమ్ముగా
నెఱులఁ విచ్చి విదిర్చి గోటికొనలన్ జిక్కుడ్చుచో నొచ్చి సీ
త్కరణంబై ధవళించి రంగనలు తత్కాలాపతద్దుగ్గము
గరదాభాకిరణమ్ము లొల్కి శయనాగారంబు నప్పట్టునన్ 60

పునరాలోకనసపృచ్ఛల న్విధురలై పూర్ణానురక్తిన్ క్షణ
క్షణమున్ జూచుచు వీడలేక ప్రియులన్ గాగిళ్ళ బంధించు వే
ళ నఖాలంకృతులం బయోధరములన్ లాలించువారై శర
ద్దినలక్ష్మీనికురంబమో! యనఁగ సందీపించి రబ్జాననల్ ! 61

క్షణదాయాతరతిప్రసక్తమగు ధార్ష్ట్యంబా నుడి న్నేర్చి పెం
చిన రాచిల్కలు పల్కఁ జాటువును దానిన్ వింటచే సిగ్గు తత్
క్షణసంభూతము నొంది యొందిరి వసంతంబందు శోభిల్లు మే
ల్వనుల ట్లుత్కలికావికాసముల లీలన్ ప్రౌఢయోషామణుల్!

ఆ॥ చివురుఁబోడు లపుడు జీవితేశపురాభి
ముఖులుగా మెలంగి సఖుల విడువ
లేక విడువలేక వీఁకమై విడుచుచుం
డిరి మృతిని దరిసిన తెఱవ లట్లు 63

ఆ॥ రతిరణితనూపురమణుల రమణుల నెఱి
విరివిబుక్కా విదిల్చి మాసరములఁ బువు
సరములనుఁ గదలించుచు సఖుల యలపు
తెరలఁ దెరలగు సన్నతెమ్మెరలు వీచె 64

గీ॥ కలువపుష్పాడి మన్మథోగ్రశరవహ్ని
మురుమ్మరము కాగ విరహిణీమూర్తి నింపి
హారికముదాకరంబు ముదాకరంబు
కమ్మగాఁ గమ్మగాలి మందమ్ము వీచె 65

కం॥ రమణుల విరహాపు నలి క
ద్దమునం దోడార్చు ననుఁగు దూరస్థవిహం
గమవిశ్రుతకోకప్రియ
తమారుతము మారుతము మెదలె నవ్వేళన్ 66

గీ॥ అట్టి యామవతీసమాప్త్యంతరమునఁ
బదునెనిమిదేండ్ల పరువంబు వఱలు నొక్క-
కన్య కాన్పించె సుస్వప్నకలన మకర
కేతువును బోలు కందర్ప కేతువునకు! 67



శ్రీముదిగొండవంశపు కరీరము సత్కవి మల్లికార్జున
స్వామికి నాగమాంబకుఁ బొసంగిన సంతు మనస్వికోకిలా
రామము వీరభద్రుడిల వ్రాసిన వాసవదత్త యన్న మా
ధ్వీమధురప్రవంతి తొలి వెల్చె రసోల్బణముల్ దరంగముల్॥

# ద్వితీయ తరంగము

సీ॥ ఘన మన్మథనిధి జఘన కోశమందిరా
వరణమ్మునకుఁ బైడి ప్రహరి యనఁగ
బందీకృతాఖిలభావ కారాగార
వలమాన దీర్ఘ కావలయ మనఁగ
పాఠీన కేతు భువన జయాంక సంశోభి
బంగారు శాసనపత్ర మనఁగ
జనలోచన శకుంతగణ పంజరాబద్ధ
కనకశలాకికాగుణ మనంగ

గీ॥ మనసిజాస్థానమునకుఁ దోరణ యనంగ
నారుతీవియపాదుచుట్టా పనంగ
బంధురకటీర విధుబింబ పరిధి యనఁగ
మెఱయు నొడ్డాణ మూనె నా మించుబోణి 1

సీ॥ అల ధాత సృష్టిలో హస్తబంధమ్మునఁ
గట్టిగా పీడించు కతన నేమొ!
చనుమిట్ట లడ్డమై కనసీయకునికి ము
ఖేందుఁ గాంచఁగ లేక కుంది యేమొ!
పృథులనితంబంబుఁ బృథుపయోధరము లి
ద్దెసలందు నొత్తి బాధింప నేమొ!
యంతంతచనుగిం డ్లమాంతంబుఁ దలపైనఁ
బడునేమొ యని భయంపడుట నేమొ!

గీ॥ గురుకళత్రముతోఁ దాను గూడి యున్న
పాప మెటుఁ దీఱు నను ననుతాపముననొ!
మిగులఁ గృశియించియున్న దా మెలఁత కౌను
సన్నగిల్లరె మదిఁ దిగు లున్నవారు 2

సీ॥ త్రిభువన విజయపరిశ్రమ శ్రమిత మ
న్మథవిశ్రమైకాంతమందిరములో !
కందర్ప దర్పక కఠినశిలాచూర్ణ
పూర్ణమ్ములైనట్టి పానుపనంట్లో!
హారరోమాళి భాగీరథీయమునల
కలయిక యను ప్రయాగంపు దరులో !
హారమృణాలమ్ములందు జక్కవలో! హృ
న్నీరజాకర పద్మకోరకములో !

గీ॥ మరుని మైపూత నించు చాతురికయుగమొ !
యారుఁదీవియపండ్లో ! సర్వావయవవి
నిర్మితిఁ మిగిలిన చెన్నునిగ్గు వోసి
చేసిన కుచమ్ములా విలాసినికిఁ దనరు 3

నలువ భరమ్ము లూడిపడినన్ బడవచ్చునటంచు చూచుక
చ్ఛలమునఁ జీలతాపడము సల్పె ననంగఁ దదగ్రమ్ముదలన్
బొలిచెను రాగరత్నములు వోసిన హారాంబరిణెల్ పొలంతిచ
న్నులు సకలాత్మపాతముననో! యన సంభృతగౌరవమ్ములున్ 4

ఆననచంద్రమండలనిరంతరసన్నిహితంబుగాగ సం
ధ్యానిభృతప్రరాగమొకో! యాంతరరాగము పొంగువాఱునో
నా! నెగడొందు రంజిలిన నాతుకలేఁజిగురాకుమోవి తుం
పైనది రాగసాగరమునందలి మేల్పవడంబిదే యనన్ 5

కం॥ భాసురతద్ద్విజమణిర
తూసింధూరాభిముద్ర కాంబోలు! హారం
బై సుదతీమణి మృదురద
వాసఃకిసలయము మధురభావముఁ గొలుపున్ 6

కం॥ మదనుఁ డను మృదువిలాసుని
యెద యనియెడి పడకటింటి కివి కిటికీలం
చుఁ దలఁపవచ్చును రెప్పల
కదలిక నలసమ్ములైన కామినికనులన్ 7

సీ॥ పాలమున్నీర్లు వేవేలొల్క జగమెల్ల
తెలుపార్చుచున్నట్లుఁ దేజరిల్లి
శ్రుతులు పోనీక నిరోధించెనను కోప
మునరో! యెఱ్ఱ నపాంగమున ధరించి
కేతకీదళముల రీతిఁ బొడుఁగువాటి
రాగ మూనియును నిర్వాణమిచ్చి
విరిసిన క్రొందమ్మివిరుల కారడవిఁ బై
సృష్టించుచున్నట్లు దృష్టిఁ బఱపి

గీ॥ కుందకుసుమవిలీనమై యందగించు
నుత్పలమ్ముల మాలిక నుల్లసమునఁ
బరిహసించెడి యా శతపత్రనేత్ర
నేత్రములఁ బోల వెవ్వారి నేత్రములును 8

గీ॥ దశనమాణిక్యముల తులాదండమనఁగ
నయనదుగ్ధాబ్ధిసేతుబంధన మనంగ
యౌవనమను మదను మదహస్తులకుఁ బ
రండక మనంగ నొప్పు నా రమణినాస 9

కన్నులకల్వదోయి పయిఁ గ్రాలెడి తుమ్మెదబారులో! ముఖం
బన్ననవిల్తుసౌధమున కందఁపుఁ దోరణాలో! వయోనటుం
డెన్నికొనంగఁ దోఁడు నటియించు నటీమణులో! సదానురా
గోన్నతిసింధువేణికలొ! యొప్పులకుప్పకు నొప్పుకన్బొమల్ 10

సీ॥ శచి వోలె నందనేక్షణరుచి యుష వోలె
ననిరుద్ధదర్శనజనితసౌఖ్య
వృశ్చికరాశిరవిస్థితి వలె నతి
క్రాంతకన్యాతుల కౌతుకనిధి
ఘనసమయోజ్జ్వలాకాశలక్ష్మినిఁ బోలి
యుల్లసద్ధారపయోధరాంత
ధృతరాష్ట్రతనయుని ధృతి వోలె కర్ణవి
శ్రాంతలోచన కామజయపతాక

గీ॥ వింధ్యపర్వతాటవి వలె తుంగశ్యామ
లకుచ తుంటవింటిసొగసుకాని
యింద్రజాలవిద్య కిరవౌ మహౌషధీ
మూలికయొ! యనంగ ముగుద యొప్పు 11

సితహారంబు శనైశ్చరాంఘ్రి తెలిడాల్చిర్నవ్వు భాస్వత్ప్రకృతి
ప్రకృతిసౌమ్యత్వములోహితాధరము భాసించెఁ గురుశ్రోణినా
నతనాభిఁ గమలాక్షినిన్ గ్రహమయింగా నంగసమ్మోహ
దీప్తినిగా నా మకరాంకుమోహనపుశక్తిఁ గాఁదలంపన్ దగున్ 12

గీ॥ యౌవనరసాయనఁపు సిద్ధి యనఁగ వెల్లి
విరియు శృంగారసంకల్పవృత్తి యనఁగ
భూరిలావణ్యసంకేతభూమియనఁగ
బఱఁగు నా భామ సర్వసౌభాగ్యసీమ 13

సీ॥ జయఘోషణము లొందు జనపతిమూర్తి భా
తిగఁ దులాకోటిప్రతిష్ఠఁ గలది
వామనలీల వోల్ ప్రకటితబలిభంగ
మనసిజాకర్షణమంత్రసిద్ధి
శూలితాండవలీల వోలె లసన్నేత్ర
కర్ణ కందర్పుని కదనభూమి
వానరానీకిని భంగి సుగ్రీవాంగ
దాలంకృత రుచివిహారధాత్రి

గీ॥ త్రిజగతీరంగ సంసారదీప్త భిత్తి
చిత్రితంబైన జగదేకచిత్రరేఖ
యా భృతసుగంధ త్రిభువనలోభనీయ
మధురపరమేష్ఠికృతి వేయిమాట లేల ? 14

గీ॥ అట్టి కన్నియ నరసి రాజాత్మజుండు
ప్రీతి విలసిల్లు కనుల నవ్వోలఁ దిచెలువుఁ
గ్రోలుచున్నటులుండె యూరువని నిమర
మిగులఁ దడవ్వూనినది వీడ మేలుకొనియె 15

అతఁడు ప్రబుద్ధుఁడయ్యు దురితాత్మవిబోధితుఁ డైనటుల్ విపా
వృతసరసి ముక్కనింగి నటు లెంతో కలంగిన తన్నుఁ దాన యే
వితముగ దిద్దుకోఁ దగఁడ వింటఁ దదంగన నిల్చినట్లుగా
మతివడి చాఁచు బాహువులు మాటికిఁ దత్పరిరంభణార్థియై 16

'ఎక్కడి కేగ కేగకు సఖీ! యిటురమ్మిటురమ్ము కౌఁగిటన్
జిక్కు' మటంచుఁ బల్కు నవనీధవసూనుఁడు లోఁదలంచు న
ల్దిక్కులలో విదిక్కులఁ దదీయము రూపు లిఖించుకొన్నటుల్
దృక్కులనుంచుకొన్నటుహృదిన్ జెలియన్నెలకొల్పుకొన్నటుల్

పరినిఁ జేరనీక యతఁ డేకతఁ దల్పుల మూసి పాన్పుటా
గారమునందు శయ్యపయిఁ గందిన డెందముతోఁ బరుండి యే
తీరగు భోగము ల్గానఁ డతృప్తి నెటో పవ లేగ బుచ్చె న
ట్లే రెయిఁగూడఁ గ్రమ్మఱఁ జెలిన్ గలలో దరిసించునాసతో 18

గీ॥ అంత మకరందుఁ డను తదీయాప్తహితుఁడు
తద్గృహాము నెట్లొ సొచ్చి కందర్పశరస
మర్పితాత్మీయదర్పుఁ గందర్పకేతుఁ
బలికె నెయ్యంబు తియ్యంబు దొలుక నిటుల 19

సకుఁడ! యసాంప్రతం బగు నసాధుజనోచితరీతి నిట్లు నీ
వొకఁడవె యుండి చింతిలుట యొప్పునె? నీ యిది విన్న సజ్జన
ప్రకృతి వితర్కడోలికలఁ బైకొని యూఁగదటయ్య! నిన్ను దు
ర్జను లపకీర్తిపాలుగఁ బ్రచారము సేయరటయ్య! హా కిసన్ 20

సీ॥ వృషభంబు వలె సురభిప్రాప్తివికలుండు
నఱకు భద్రశ్రీని పరశు వట్లు
గోత్రంబు మార్చి పెక్కు విధురత్వము నొందు
వామాధ్వమును మెచ్చుఁ గామి వోలె
వ్యాధి జీర్ణించిన వాఁడు బలె గళేబ
రవచనమాంద్యంబు నవదరించు
నిజవశాపరముతో నెమ్మోముతోఁ గ్రిందు
వడినదానంబా నిభంబు పోల్కిఁ

గీ॥ గటపల విభావరీరక్తిఁ గలిగి యుండు
వంచకము వోలెఁ బీనుఁగు భాతి బంధు
తాపదర్శనుఁడు ఖలుఁడు తత్స్వభావ
మే వ్యసనగతి యట పోరు మిమ్ము బోంట్లు 21

సీ॥ తెఱగంటి యొకిమీఁని తురగంబు వోలె ను
చ్చైశ్శ్రివంబు న దేశజప్రశంసి
యక్షుల కిడు బలి య ట్లాత్మఘోషర
వంబును మండలభ్రమరకంబు
బహుమత్సరం బెండపదనునఁబగలు వి
ధగ సుమనోతిసంతాపకారి
యాంపాతమధురంబు నయ్యునుఁ దాటిపం
డ్లరసంబు వలెఁ దిక్తవిరసము తుది

గీ॥ నంధకారంబు మాడ్కి దోషానుబంధ
మై పఱఁగు విశ్వకర్మాళవలోపనమున
రుద్రు తెఱఁగునఁ దోఁచు విరూపదృష్టి
కడఁగి యెంతెంతకునుఁ గాదు! ఖలుని మనము 22

సీ॥ విషతరుప్రసవంబు విధమున నెంతెంత
యనుభవింతురో మోహ మంత బెంచు
దళితగోత్రంబు గ్రుద్దలి పోలికఁ క్షమ
నెలయు ప్రాణులను హింసించుచుండు
నవధూతమయ్యును నడుఁగుదుమ్మటులఁ దాఁ
దలపైఁ గషాయత దండడించు
సర్షపస్నేహంబు చాయఁ జే లాలించి
తలదాల్చిననుఁ గటుత్వంబు విడదు

గీ॥ శౌరిసంకాశముగ నది చక్రధారి
భిన్నమైనను స్నేహంబు విడక కూర్చు
హృదయమును మీఁగడ పెరుంగు నెటు మథించుఁ
గవ్వ మటులఁ గలంచును ఖలుని మనము 23

సీ॰ ఇట్టి యసాధుల హృదయమ్ములో మొద
లిసుమంతయయ్యును నెసక మెసఁగి
వెసఁ గరాలంబౌను దొసఁగు నీబోంట్లు స
చ్చరితుల హృదయంబు జొర దదెట్లొ
జొరఁబడఁ దోఁడఁ బాదరసంబు వలె వెలి
కుఱుకును నిల్వదు నరవరేణ్య!
దుర్వాసనంబన దొడ్డచెట్టది విత్తు
లేకయే మొలకెత్తి వీఁకఁ బెరిఁగి

ఆ॥ కాండహీనమయ్యు ఘనతరశాఖోప
శాఖలౌను దాని జననమందె
పెఱుకవలయుఁ గాని తరువాత నలఁతులఁ
జావ దెంత నఱుకఁ జాలియున్న 24

గుణులు వినోదవిద్యావశగుల్ న్మృగతుల్యులు రాజ! యట్టివా
రొనరొనరించి దుర్దినపుటూర్త్ర హరింత్రు భవాదృశుల్ సుఖం
జనములు శారదర్తుదివసమ్ములు నూదిరి మిత్రచేతనా
వన మనుకూలమై వెలయ వర్ధిలఁ జేయరె! కార్యసంపదల్ 25

సీ॥ మైత్రిమాధుర్యంబు మనమెన్నఁగలమె య
చేతనమ్ములఁగూడఁ బాఁతుకొనియెఁ
దీపి చల్లనయు సంతాపశాంతియు శుచి
త్వము పయస్సనుపేరు తనవలె నది
కలదని నీటితోఁ జెలిమిఁ బాటించిన
పాలకున్నై నీరు క్వాథమందుఁ
దా మున్నె క్షీణించుఁ దనసంగతిఁ వర్ధి
లినదను నభిమానముననె కాదె

గీ॥ మరల నా పాడిమై నళ్లె మనుచుఁ బాలఁ
బోవనీయక నీ ర్సగపొంగు నుడిపి
కాన నీ కుందు మాన్పక నేను నీకు
మిత్ర మనఁ జెల్లునయ్య! భూమీపమిత్ర! 26

ఘోరపడ నుత్పథంబయిన బుద్ధి మరల్చి గుణాఢ్యు లీడ్యమా
సరణిఁ బ్రవర్తిలంగల రసాధులు వర్తిలఁజాల రెట్లు నో!
పురుషసుధానిధీ! ములుచ పోలిక నీవు నిటుల్ మనోవ్యథా
భరమున కగ్గమౌట తగవా? నడువంగదె! సత్పథమ్ములన్ 27

గీ॥ నీతిమకరంద మొలుక నీ రీతిఁ బ్రియ
సఖుఁడు మకరందుఁ డన విని స్మరశరప్ర
హారపరవశుఁడు పరిమితాక్షరముగ
నొడివె నిటుఁ బుడమియొడయని బెడఁగుకొడుకు 28

కం॥ దితి వలె మాదృశులకు మతి
శతమన్యుసమాకులంబు చా లుపదేశిం
చుతఱి యిది కాదు వెడలెడు
గతి నుడికెడువిధి మదసువు గాత్రముఁ బరఁగన్ 29

కరణమ్ముల్ తపియించునట్లును వివేకం బూడినట్లున్ స్మృతి
స్ఫురణం బాఱిన యట్లు నా కిపుడు తోఁచుం జెప్పలే నింతక
న్న రజఃక్రీడల బాల్య మాదిగ వెతల్ సౌఖ్యంబు నాతోడ నా
కరణిం గంటివొ నాబడి న్నడుమనుంగా! పోదమెం దేనియున్ 30

కం॥ అని పలికి యుపరిజనుఁడై
యనుగుంజెలికానితోడ నా రాకొమరుం
డు నగరమును విడచి యనే
కనల్వాశతమాత్రమార్గగతిమై యరిగెన్ 31

కం॥ అటులఁ జని వారు చేరిరి
కటకచరకరీంద్రకరనికరభగ్నమహా
ద్విటపిరససుగంధానిల
ఘటితశిలాశైత్య వింధ్యకాననభూమిన్ 32

కం॥ ద్రుహిణాండఖండగతనిజ
సహస్రశిఖరములఁ గుంభసంభవమోదా
వహముగ వింజం బణఁచుట
మహీజనుల మనుచుటయ్యె మ్రగ్గకయుండన్ 33

కం॥ జీవంజీవకపక్షులు
వావిరిఁ గవగూడి వివిధఫలరసపానం
గా వలచుఁ గమ్మగా న
త్త్రావిన్ సెలయేళ్ల కడల తావులు మలపై 34

గీ॥ కందరమ్ముల సుఖసుప్తిఁ గాంచి లేచి
ననిచి విద్యాధరుల మిథునములు గాన
మాలపింపఁగ నెత్తమ్ములందు సొగయు
చమరులట శబరులకుఁ జిక్కి చచ్చునకట ! 35

కం॥ మిగులఁ బయినుండి పడుటన్
బగిలిన తత్కుధరతాళఫలముల రసమున్
దెగఁ బులుముకొనిన చేతుల
నిగిలించుచు నాకి చప్పరించునుఁ గ్రోఁతుల్ 36

సీ॥ మల్లికార్జునయుక్తిమై శ్రీగిరినిఁ బోలు
వనమాలతో రమావరునిఁ బోలు
సప్తపత్రస్యందనాప్తి సూర్యునిఁ బోలు
ధాత్రీధృతిఁ శిశుత్వమునుఁ బోలుఁ
బత్రవనమ్ముల బంధురారుణకాంతి
యవఘుళింపంగ వేణువనుఁ బోలుఁ
బటుశిఖండివిముక్తిఁ బఱఁగిన యర్ధచం
ద్రములు పైఁగూర శాంతనవుఁ బోలుఁ

గీ॥ బనస కేసరి ఋక్ష గవయ శరభ కు
ముద నిషేవితపాదముల్ బొలుచు వింధ్య
భూభృదగ్రణి సుగ్రీవుఁ బోలు శంబ
రకులమునుఁ జేర్చి పోలు హిరణ్యకశిపు 37

సీ॥ దంతాంతరాలగతమ్ములౌ శాఖామృ
గమ్ములు కల కుంభకర్ణసముఁడు
శతకోటిదానముల్ జరుగఁ గర్ణసముండు
బహులతాభృతిఁ గృష్ణపక్షసముఁడు
లలిఁ బ్రియంగుశ్యామలాలిత్యమున నర
వాహనదత్తనృపాలసముఁడు
సన్నిహితగుహుండు సశివుండు నాగని
శ్వాసధూతవిభూతి భర్గసముఁడు

గీ॥ మరియు నా గట్లురతనమ్ము మల్లనాగ
ఘటితకాంతారసామోది కామసూత్ర
సముఁడు రవితేరు పైద్రోవ సాగఁగోరు
నరుణు చేపూజ రాల్ జాజు మెఱయువాఁడు 38

సీ॥ సానుగ్రహప్రచారానూనమహిమనుఁ
ప్రచురింపఁగా మంచివాఁడు కాదొ !
పెరిగిన గుల్మము పరఁగి ధాతువికార
కలితుఁడై రోగసంకలితుఁ డేమొ !
దర్శితాభయుఁడయ్యుఁ దా మృత్యుఫలదుండు
ప్రమితిశూన్యుండయ్యుఁ బ్రస్థయుతుఁడు
పిహితాంబరుండయ్యు విలసదంశుకుఁడు భీ
ముఁడునయ్యుఁ గీచకముగ్ధుఁ డతఁడు
గీ॥ నతఁడు నకులీనుఁడయ్యు వంశాభిరాముఁ
డాతఁడు సనాదుఁడయ్యు నపేతనాదుఁ
డతివిచిత్రచరిత్రుఁ డ య్యద్రినేత
వితతఫలదాత జంతుసంతతుల యాత 39

సీ॥ భద్రశకునినాగవద్దేవఘాతమ్ము
లనుపొంద సకరణ మనఁగ నొప్పు
మీననక్రకుళీరమిథునసంగతి రాసు
లకుఁ దావరంబైన లాగుఁ దనరుఁ
బుష్కరాక్షోత్పత్తిఁ బొంపొంది హరివంశ
భరితమౌ! యన సిరిఁ బరిఢవిల్లుఁ
బిహితదిగంబరవిపులదర్శనము మీ
మాంసకన్యాయంబు మాడ్కిఁ దోఁచుఁ
గీ॥ బుష్పితాగ్రలు శిఖరిణుల్ పొరిఁ బ్రహర్షి
ణులును సుకుమారలలితలును గుసుమవి
చిత్రలు నగు లతలు వంశపత్ర పతిత
లలర బహువృత్తలసితమై వెలయుఁ గొండ 40

కం॥ సరభసహరిసాహస్రసన
ఖరదళితమదేభకుంభగళితసముద్య
ద్భరముక్తాఫలశబలశి
ఖర మది తగఁ గొనలఁ దారకల నిండినదో! 41

కాంతారోపరసానుగమ్ము మదనాక్రాంతమ్ము నా కాముక
స్వాంతంబోజఁ బవిక్షతిక్షతబిలగ్రస్తమ్ములౌ పేర్వుల
క్లింతే జంపగు వృద్ధసర్పములఁ బాటించునన్నగేంద్రంబు కూ
టాంతస్థేనహిమాంశుదృగ్గురునిరీక్షాలోలమో! నా దగున్ 42

గీ॥ పంకిలాలక్తరసరక్తపాదసరణి
ప్రకటితవిహారలకు శచీవరు విలాసి
నులకు నప్సరసల కల మలనుఁ గలవు
మంజుసంకేత కేతకీమంటపములు 43

ఆ వింధ్యమ్మున నీట బెగ్గురులు రాయంచల్ మదాంచత్కలా
రావం బార్వఁగఁ దాఁక నుత్కటములుద్భ్రాంతమ్ములై తమ్మిపూ
లా వైసారిణకంజకచ్ఛహతిచే నల్లాడఁ దన్మాధవీ
స్రావామోదముతోఁ దొరంగుఁ దటినీరత్నమ్ము రేవాఖ్యమై 44

దరులన్ బట్టి చరించు నేనుఁగుల మందన్ జెక్కులందుండి ని
ర్భరమై కాఱు మదాంబుపూరమునఁ బల్ వర్ణమ్ములై జిడ్డుకొ
న్నరసమ్ముల్ నది నించు సంజతఱిఁ దానంబాడు పౌళిందరా
ట్తరుణీపంక్తికి లోఁతుబొడ్డుసుడిగుండాలందు నిండారగా 45

తత్తటినిన్ దటావటగతల్ జలదేవత లుంద్రు తోఁగువా
రెత్తుగ నబహుండములు నేర్పఱుపంబడు మంటపమ్ములన్
ఘూర్తని క్షితిఁ గొ[illegible] సనుకూలజకంజనికుంజసీమలన్
ముత్తెములాచు మత్తిలుచు మూర్ఖులపోలికఁ గానకోళ్ళటన్ 46

సీ॥ కెలఁకుల మొగలిమ్రాఁకుల పూరజము నిండి
యాతపసేవాసమాగతాంబు
మానుషీమృదితకోమలమైన య య్యేటి
కెలని సైకతమందు మెలిచి గుబురు
గొనిన ప్రబ్బలివనిఁ గూడి దాత్యూహాస
మూహా ముత్కట కేళిమోహజనిత
కుహాకుహారావమై కొసరుట విబుధుల
మిథునముల్ గని వేడ్క మెచ్చుకొనుచుఁ

గీ॥ దాము నటులె క్రీడింతురు దత్సుగంధ
సాక్షి యుపవనపవనమ్ము సాఁగఁగొలుపఁ
దరళతరములు తఱగలు తళుకులొలుకఁ
గదలు నర్మద య వ్వింధ్యకటకసీమ 47

సీ॥ ముఖభంగములనుఁ జూపునుఁ గోపమున వోలె
సమద వోలిక గతిస్ఖలన మొందు
భూభృత్తు నంటెఁ గాముకి వలెఁ బాతిసస్న
మయలక్ష్మి వలె వర్ధమానవేల
భారతసమరభూభాగంబు శేవ నృ
త్యత్కబంధమ్ములు నడరుచుండు
శతపత్రనికురంబసంఛన్నవిషధర
మై వర్షఋతువున కనుగలంబుఁ

గీ॥ ప్రియతముని నల వింధ్యగిరిప్రకాండు
కడలుచేతులఁ దెగజాచి కౌఁగిలించు
మేఖలాత్మజ జక్కరమిన్న నర్మ
దాతరంగిణి సోముని బ్రాతిబిడ్డ 48

గీ॥ తమ్మితీవియపొదల వేతసములందు
గొంగుగనక మొదలనున్న కొంగజతల
మత్స్యబుద్ధుల గనిపెట్టి మసలుచుండుఁ
బెద్దబేడిస లన్నదీవీచులందు 49

కలసెడివేళ వాటమని కాటుకపిట్టలఁ బట్టఁగోరి లు
బ్ధులు తగినట్లుఁ ద్రవ్వ నడిబొడ్డునఁ బల్లముఁ బ్రక్క మిట్టునై
పొలుచును దత్తటంబు ఘనపుచ్ఛభయంకరమీనదర్శనో
చ్ఛలదురువేగరాజిలప్రచారచలజ్జలఘట్టనమ్ములన్ 50

క॥ ఆ కమనీయధునీతటి
రాకొమరుడు హితుఁడు శ్రమమున్ విశ్రాంతిన్
గైకొని సుఖోపవిష్టతఁ
బ్రాకటగిరివైభవంబుఁ బరికించునెడన్ 51

గీ॥ అనియె మకరందుఁ డో! మిత్రమా! మృగేంద్ర
హన్యమానగజారావ మనెడు కేకఁ
దాళబాహులఁ బైకెత్తి తగ నగస్త్యు
బిల్చుచున్నట్టులున్న దీ వింధ్యనగము 52

సీ॥ ఒడలఁ బూర్వార్ధము నొగి నిగుడించి ప
శ్చార్ధము వంచి యొయ్యనఁ గుదించి
తలగకె టుత్తానితమ్మగు వెన్నునఁ
గల వాలమునఁ గొన నలఁతి వంచి
జూలు బిట్టు విదుర్చుచుఁ గొనదేరిన
కోఱల వితతాస్యగుహనుఁ దెఱచి
మృగపతి గజపతిమీఁద లంఘించెడి
నుగ్రాకృతిఁ బూని యుత్సహించి

గీ॥ యెటులఁ జిత్రింపరానటు లెల్లయొడలి
ముడుపు చెవినిక్కఁ గదలమి బెడిదపుమొక
మొనఁగఁ గుంభస్థమై తోఁకనెత్తి ఫీట్కృ
తిన్ సలుపుచున్న దదె కాంచితే! వయస్య! 53

కం॥ మఱి యదె యకాండచండిమ
భరభాసుర కేసరంబు పారీంద్రము కుం
జరటత్కుంజర కుంభము
నఱవఱలుఁగఁ జెక్కుచున్నయది కనుగొంటే! 54

కం॥ అని యిటులుగ నవరసముల
కును ననువగు దృశ్యములనుఁ గొని చూపెడు న
య్యనుగుంజెలితో న వ్వనిఁ
జనఁదొడఁగె నృపుండు గహనచారిమఁ గనుచున్ 55

సీ॥ కురుదేశకుల్యతోఁ సరిఁదూగి ఘనసార
సార్థవాహినిగా నెసంగునదియు
నిమ్నదేశప్రసవన్నిమ్నగ పోలె న్య
గ్రోధమ్ములనుఁ గల్గి కొఱలునదియు
నుత్తరగోగ్రహణోర్వి తరమ్ముగ
హారిబృహన్నలంబైనయదియు
నాయ్యార్ణ మధుగోష్ఠి యోజ నానావిట
పీఠాసనమ్మునఁ బేర్చునదియు

గీ॥ నైన యవ్వని నలకూబరాత్మ పోలె
విధృతరంభ విరాటుని పెంపు కరణి
ముదితకీచకశత బోలి మదకలగతిఁ
దనరు ఘంటారవావేదితస్వమార్గ 56

సీ॥ మదనశలాకాప్తి ననుఁ గాముకుని భాతి
దినమణి బలె చాయతన్నుగలది
యాత్రోద్యతప్రభు వట్లు మహోపత్ర
లలితంబు హరి వలె లక్ష్మి కిరవు
గాణిక్యవిధమునఁ గ్రమపల్లవశోభి
యామ్నాయసమము శాఖాంచితంబు
రారాజుజూదంపురచ్చ పురుడు కాగ
శకునిసల్లాపాతిశయముఁ గలది

గీ॥ యైన నేరెడుచెట్టొక్కటా సదీశ
భజనసమవిస్తరితబహుఫలవరేణ్య
మైన కాంతారమున నొప్ప నా నృపాలుఁ
డటుల నేగుచు నిల్చె న వ్విటపినీడ 57

గీ॥ ఆతపక్లాంతమైన య య్యడవిమున్న
కన్ను వలె జొత్తిలి వెలింగె మిన్నుమాని
కంపుబిల్లిక చరమశిఖరిశిఖరము
నం దడఁగుచుండె నంత సంధ్యాంత మగుడు 58

కం॥ ఫలమూలమ్ముల నెట్లో
వలదన్న నొడంబరచి నృపాలునిఁ దినిపిం
చి లలితమగు చిగురాకుల
తలిమమునఁ బరుండఁ జేసి తానునుఁ దోడ్తో 59

కం॥ ఇనభుక్తశేషములఁ బం
డ్లనుఁ గొని మకరందుఁ డతని డగ్గరగాఁ బం
డెనుఁ దత్కుటజము క్రింద జ
నెను యామము తన్నిశీథినీసమయమునన్ 60



శ్రీముదిగొండవంశపుకరీరము సత్కవిమల్లికార్జున
స్వామికి నాగమాంబకుఁ బొసంగిన సంతు మనస్వికోకిలా
రాముఁడు వీరభద్రుఁ డిల వ్రాసిన నాపవదత్త చున్న మా
ధ్వీమధురస్రవంతి మలి వెల్చె రసోద్ధతముల్ దరంగముల్ 61

# వాసవదత్త

## తృతీయ తరంగము

ఊహాతూలికచే మనఃఫలకమం దొప్పారఁ జిత్రించి తా
నూహించెం బ్రియురాలిలోఁ గనుచు న య్యుర్వీధవుం డింద్రియ
వ్యూహాచంచలతా స్థి నిద్రిలెనో లేదో! యంతలో వారి ని
ద్రాహాని న్గలిగించెఁ బైఁ జిలుకగోరంకల్ వివాదమ్మునన్ 1

శారికయు న్శుకమ్మ నవి జంటపులుంగులు వాదులాడుటన్
వారు తదర్థవేత్తలు వినంగఁ దొడంగిరి వేడ్క నొందుచున్
జీరుచు న క్కజంపుకొమజీబునఁ జేరిన య య్యుగమ్ములో
శారిక యత్తఱిన్ గసరసాఁగి శుకమ్మునుఁ బల్కె నిట్లుగా 2

“కొండొక శారికన్ దవిలి కుల్కుచు నో శఠ! నన్నెఱుంగు ధూ
ర్తుండవు కాసిచోఁ దడయుదో! యిలుజేరగ నింతరాత్రియూ
చుండ” నన న్శుక మ్మనియె “నో శుభశీల! కలంగనేల! నే
నొండు విచిత్రగాథ మొయి నుండుట రాకట నాలసించితిన్” 3

కం॥ ప్రియ! యది భృహత్కథయు నెం
తో యపూర్వము నీకు వినుతునో! నా నది యే
మియనక శ్రవణకుతూహల
యయిన శుకము చెప్పఁబూనె నా కథ నిటులన్ 4

గీ॥ చెలియ ! "కుసుమపురం" బనఁ గల యొక పుర
మది మహావిభవోజ్జ్వల మందు మేడ
గులు సుధాధవళమ్ములు కు స్తరించుఁ
గోపు మందరకుత్కీలకూటములకు 5

గీ॥ పోలుచును బృహత్కథాలంబములను సరిగ
సాలభంజిక లొప్పు వృత్తాలి వోలెఁ
దగును మాణవకక్రీడితములఁ గలిగి
య ప్పురీతల్లజమ్మున నుప్పరిగలు 6

గీ॥ ఘటలఁ కెన మత్తవారణకలన సుతల
సన్నివేశము బలిరాజసౌధసమము
చితగవాక్షము సుగ్రీవుసేన నొఱయు
నొఱపులాడి ! యుప్పరిగ ల ప్పురమునందు 7

గీ॥ తగు నచటి పంచజనుఁ డజాతమదుఁడయ్యు
సుప్రతీకత్వమునుఁ గాంచి సొగసులాఁడి !
కల దచటివారిలో నచక్రిత సుదర్శ
నతయుఁ దద్వైభవము సమున్నతము శారి ! 8

గీ॥ చంద్రధారణమున శివు సత్ప్రథగమ
నమున గాలిఁ దపస్యోదయమున మాఘ
చరమదినమును వృషవర్ధితరుచియగుచు
వేసవింబవ లుద్దించు వీడుజనము 9

సీ॥ నానాసనాసక్తులైన నపతితులు
సద్గ్రంథులైన వంశాంకురములు
పక్షపాతము లేని పటుహంసము లమర్త్య
భేదులు నోఁగాక వీరతరులు
నవిదితస్నేహాక్షయంబైననుఁ గులప్ర
దీపముల్ తిథ్యతిథిప్రవణులు
వారలు కావ్యజీవజ్ఞులునయ్యు న
గ్రహులు లసంఖ్యులునయ్యుఁ గలరుసంఖ్య

గీ॥ నచటిప్రజలందు గోపాలుఁడయ్యు రాముఁ
డై, భరతుఁడయ్యు శత్రుఘ్నుఁడై, ప్రియంవ
దుండునుం బుష్పకేతువై, యుండుఁ బ్రతిజ
ముండు ధనదుండునుఁ బ్రచేతసుండు నగుచు 10

సీ॥ ఖండాభ్రములనుఁ బైఁగల్గి శరదలకుఁ
బరపుష్టిచేఁ బికప్రకరములకుఁ
బరిచితేంద్రాణులై సురనారులకుఁ బల్ల
వానీతరుచులఁ గరేణువులకుఁ
గలితరక్తాకృష్టి జలగలకు సుమేషు
సమ్మదమ్మున నాడుతుమ్మెదలకు
సుప్రవాళములఁ దాల్చుచు వేలలకు సుర
తోరుకాంతుల యుజ్వకోరికలకుఁ

గీ॥ గనఁబడి బిలాసిసంతాపకారిణులుగ
గరుడిసంతతికి భుజంగవరులు చుట్టు
కొన మహానటపటుబాహువనమునకును
సవతువచ్చెద రచటివేశ్యలు సుమాంగి! 11

కం॥ అమరానమరశిరస్సర
సముదయలాలితపదాంబుజాత వసించున్
హిమగిరితనయ మహిషదను
జమహీధరవజ్రధార చండాఖ్య నటన్ 12

గీ॥ ప్రణయకలహప్రణతుఁడైన భర్గు జడల
దోఁణఁకి మిన్నేటి ధార కాల్గొఁకయ నొప్పు
న య్యపర్ణ నిశుంభశుంభాతిబలవ
నీదవదహనకీల వర్ణింపఁ దరమె 13

ఆ నగరోపకంఠమున నారభటిన్ బ్రవహించుఁ బూజ్య గం
గానది దేవదానవుల నైశ్యమునుండి మునుంగ రాలు పూ
లీను పరాగముల్ పరిమళింప రహించు దివిన్ జనంగ భూ
స్థానమునుండి యా సగరసంతతి యెక్కిన త్రాటినిచ్చెనో! 14

గీ॥ జలకమాడఁగ సప్తర్షిజటల వలపుఁ
గలది పుణ్యప్రవాహిని కమలజుని క
మండలువునుండి ధర్మ మీ మాడ్కి ధార
గా ద్రవించిన దనఁ బేరుఁగన్న యేఱు 15

సితకరిగండఘర్షణముచే దరిపై హరిచందనమ్ము లూఁ
గి తొరఁగు తేనెకల్కిఁ గడుఁ గేరు సుగంధముతో సలీలదై
వతరమణీనితంబహతిఁ బంబి తరంగము లూఁగియాడ నిం
శితమగుతో యమున్ గలిగి వెల్లుగ జాహ్నవి పాఱు నయ్యెడన్ 16

సీ॥ మహి వోలె సార్వభౌమకరంబు తాఁకఁగా
నుపభోగమునకు బిట్టోర్చునదియు
ఛందంపుకూర్పుతో సరిఁదూగి నెఱి సాగి
మాలినిన్ లోఁగొని మలయునదియు
నిద్ధకోకనదప్రబుద్ధాంబుజాక్షియై
శారదదినలక్ష్మిఁ గేరునదియు
రాజహంసవిభాకరతనయోపేతయై
గాములఁ గనినట్లుఁ గ్రాలునదియు

గీ॥ నైన నది పెనుకోలఁకటు లబ్ధవేలఁ
దావి బసిబట్టి యలులు పైఁ దార ననుమి
తమ్ములై జలమూలలగ్నమ్ములైన
పుండరీకకుముదమ్ములఁ బూని తనరు 17

కం॥ ఏచిన యంధతమసమును
రాచియుఁ దమసాన్వితముగఁ బ్రబలు నరుదుగా
వీచీకలిలయునయ్యు న
వీచీదుర్గమమునైన విష్ణుపది చెలీ ! 18

కం॥ ఏణాంకజటాభరణుఁడు
బూన వికటజూటకుహరమున ము న్నలవా
టైన ఎగుడుఁదిగుడు నిపుడు
నా నది వర్తించు సకుటిలావర్తంబై 19

సీ॥ సింధురకుంభవిచ్ఛేదనోత్సుకములౌ
కేసరు లటు ఫుల్లకేసరములు
పెనుబంట్లు పఱలతోఁడ నెనవచ్చి పరికాసి
లెడివగు నారికేళీధరములు
నతిదూరగపరిశ్రియముల నక్షమ్ములన్
గల యసంస్కృత యువకసదృశములు
మునివజ్రపాసక్తములు సదారామాశ్రి
తములు భరతచరిత్రతులితములు

గీ॥ తరులయందునఁ బడియున్న సురమహీజ
సూనము లనంగఁ జిక్కిన చుక్కలనఁగఁ
గొమ్మచివరల విరులొప్పఁ గులకరించుఁ
దుటుములై యవ్వటారంపుతోఁటలు చెలి! 20

గీ॥ మునియుతములయ్యు మదనసంభూతిఁ గలిగి
యలరు నుత్తంభితాంబుదంబులు నలంకృ
తులునుఁ బలెఁ గృతమాలాంతములు నరిష్ట
యుతములయ్యుఁ జిరంజీవు లోయి! తరులు 21

చందురు లేడికాలిబడిఁ జాఱు సుధన్ దడుపొందకున్నచో
సందె నకాలమున్ గొలుపఁజాలిన క్రొన్నవకంపుఁబూజిగు
ళ్ళందము నంత జిందగలవౌనొకొ! య య్యెలదోఁటమ్రాఁకులో
సుందరి! వాసిదీటు నెట చూడ మహీరుహవాటి నెన్నఁదున్ 22

గీ॥ నూరు తేరి హయమ్ము లనూరు చేతి
కక్కసపుఁదెబ్బలకుఁ జొక్కి కముచకున్న
నల కుటాల చిటారుకొమ్మలఁ జివుళ్లు
పెచ్చుఁదగ్గులుగా నుండు టేల ? కలికి ! 23

పాతాళం బెనగా భుజంగయుతముం బల్యాప్తమా ప్రోలు సౌ
ఖ్యాతంకం బట లేదు భోగులకుఁ దావైనన్ బవిత్రత్వ మే
పై తోఁచున్ సనురాలయంబయిన నం దవ్వీడు నానావిధ
స్ఫీతిః దేవకులప్రకాశ మదితి(శ్రీ)గర్భసంకాశమై 24

సీ॥ పార్థుండు వోలె సుభద్రాన్వితుండు స
భీమసేనుండైన బిరుదు మగఁడు
సబలుఁడై కృష్ణుండు సవతుగ సత్యభా
మానురక్తుండైన మానితుండు
పండినవరిమడి పాటిగా బహుధాన్య
కార్యసంపాదనకర్మఠుండు
పరశూరలక్ష్మీచికురభారసుమసరా
మోదవాసితకరాంభోజయుగుఁడు

ఆ॥ సురతరభసఖిన్నసుప్తసీమంతినీ
మంజుకర్ణరత్నమండనాంకి
తోరుబాహుదండధారి 'శృంగారశే
ఖరనృపాలుఁ' డల్ల కటకభర్త 25

సీ॥ అని వింట నతఁడు జీవాకృష్టిఁ బచరింపఁ
దోడఁ బ్రాణములు శత్రులకుఁ దొలఁగు
మార్గణాలతో ప్రీతిమై నైరులు చనంగ
నాతఁడు సద్యశం బధిగమించు
నాతఁడు క్షమవీడినంతనే యరుల త
లల్ పంటవలఁతి నలంకరించుఁ
బగపౌజు పంచతఁ బ్రాపింప నాతఁడే
సంఖ్యాంతరము లేక శాంతి నలరు

గీ॥ ధనదుఁడుఁ బ్రచేతసుండును ధర్మరాజు
బలవిభేది సదాగతి పావకుండు
నిరృతియు శంకరుండు నా నేత యిటుల
నష్టమూర్తిగ నయ్యు ననష్టమూర్తి 26

సీ॥ చెలఁగుఁ గైతలయందె శృంఖలాబంధంబు
కోశసంకోచంబు కొలనులందె
యమరు శృంగారహాని ముదియేనికలందె
జాతివిహీనత సగులయందె
కడలఁ దెల్పుటయందె కలదు దక్షిణవామ
కరణంబు శరభిద పెరుఁగునందె
వృషమును విడుచుట పితృకార్యములయందె
తగు ద్విజక్షతి గ్రామ్యధర్మమందె

గీ॥ నెగడు మూర్చాధిగమము సంగీతమందె
జరుగుఁ గ్విప్ప్రత్యయములందె సర్వలోప
మంతెకాని ప్రజాసంఘమందు లేదు
రాజనీతిజ్ఞుఁ డా తేని రాజ్యమందు 27

సీ॥ కలదు యోధులయందె కరవాలనాశంబు
నిస్త్రింశతయు ఖడ్గనిచయమందె
బాణమ్ములందె చొప్పడు లక్షదానచ్యు
తి యనంగతయుఁ గామదేవునందె
వెలయు గాత్రములందె మలినాంబరత్వంబు
భంగురత్వము రాగభంగులందె
యౌవనావిర్భావమందె మారాగమం
బధరరాగము నెలయన్నులందె

గీ॥ తగును జనులకు లేదు విదగ్ధులందుఁ
గనము చలరాగమును గీతముననె కాని
నీచసేవకులందె కాని పరిధాన
వారమున ఖర్మలోపంబు పఱఁగ దెచట 28

కం॥ రమణుల కుండదు గాంధా
రము తెగడెం పుండుఁ గొన్ని రాగమ్ములకే
యిముడదు దుర్వర్ణపుయో
గము చెలులన్ గర్ణికాదికమ్ములఁదక్కన్ 29

కం॥ రసనాబంధము కూటమి
యొసపోరులఁ దక్క నీయనియకొనఁ బజకున్
బొసఁగదు కృంతనము సకులె
కెసఁగదు కూఁకటులఁ దక్క నెట బ్రియురాలా! 30

క॥ ఆలంకారికమతమున
నోలిఁ జనుఁ గాక యెవరి కు్రత్ప్రేక్షా క్షే
పాలాపమ్ములు లేవు నృ
పాలుం డా ధర్మపరుఁడు పాలింపఁ జెలీ! 31

తా నతిపుణ్యమూర్తి యల దైవతభర్త సురాతిపాత తా
దాన మొసంగు నంతయు నతండొ చెయి న్నతకోటి నాసమ్మైఁ
బూనును దానొ యాచితిక్షిఁ బుట్టినయి ల్లిక నాతఁడో నిజా
స్థానగురు్రగహుం డగుట శ్రకుఁ గనుం బతి గడ్డిపోచఁగా 32

సీ॥ చంద్రలేఖారత్నసమలంకృతయు సుకు
మారయా గౌరీసమాన సుగుణ
దిగ్గజమదరేఖ దీటుగా నానంది
తాళియా మందయానాభిరామ
నవమాలికల సుగంధముతో సచిత్రక
మైై వనాలికి సమయగు సుమాంగి
యప్సరస్సంహతి యనువున మంజుఘో
షావృతమైన సంహతసుకేశి

గీ॥ అంతిపురిఁ గాంతలందెల్ల యనుఁగు సతి "య
నంగవతి" యను పేర నెసంగు రాణి
తనకు దేవేరి కాగ నా ధవుఁడు మరియు
చుండు సుఖముగఁ బ్రజ నేఁచుండు నెపుడు 33

గీ॥ అట్టి యా దంపతులకుఁ బ్రాయమ్ము నడుమఁ
దనయ జనియించె "వాసవదత్త" యనఁగ
నిండుజవ్వని యిప్పు డా నెలఁతమిన్న
త్రిభువనవిలోభనీయాంగదీప్తిభరిత 34

సీ॥ పంటకారు వలె భాస్వత్తారకయు సదా
స్థ వలె నచ్ఛిద్రదర్వీజప్రసిద్ధ
రక్షఃకుల శ్రీకి సాటి ద్విరుక్తినా
నది మాల్యవత్సుకేశాభిరామ
మేరుమేఖల వోలె మెలఁత సుజాతరూ
పాంచిత సుగుణలతాలవాల
యల పులోముని కూఁతు రటుల న మ్ముదిత స
మ్ముదితసహస్రాక్ష ముగ్ధనయన

గీ॥ యుల్లసితగోత్రమై దశాస్య భుజవనము
వోలె సుమనోహరంబాటఁ గాలి వోలె
జనితలావణ్యమాటచే వనధి వోలె
నెలయు నెలయీడుఁ గలది య న్నెలతమిన్న 35

గీ॥ ఖచరుల వనమ్ము వలె సదాకల్పశోభి
తమును వింజము వలె మదనమహితమును
నైన పరిణామమొందిన యౌవనమున
మెఱయుచును నామె తలపదు బరిణయమును 36

ఆ॥ ఇటులఁ జరుగుచుండ ఘటియించె నొకపుడా
మని ప్రఫుల్లనళినవనవిహారి
మదమరాళరసితమధురకోలాహల
ములఁ సరోవరములు మూరివోవ 37

సీ॥ ఆపీతరక్తపలాశిసేవలుఁ గొనఁ
దగియుంటఁ బంక్తికంధరుఁడు వోలె
దోషానుబంధమ్ముఁ దొఱఁగి గుణియు వోలె
జాతి లేకునికి దుర్జాతి వోలె
దమనకాళి నడంచి దండియు బోలె నిం
ద్రాణి కల్గుట సురతాణి వోలెఁ
బఱఁగు సుఖాశల వాస్తుకుఁడటుల "స
తామరస" యనంగ ద్రాబ వోలె

గీ॥ మలసెను వసంతుఁ డంత మన్మథరసాతి
పరవశవిలాసినీపదాభరణవికట
తరళచరణారవిందమందప్రహార
కేళి నలరొందెఁ గాంతకంకేళితరులు 38

సీ॥ అమ్లానసౌభాగ్య మడర సుగంధవా
హమ్మునై శృంగారి యన రహించి
సాలరాజీవోత్పలాలిప్రియు క్తమై
ధీవరత్వమ్ము నుద్దించి యుంచి
సత్కవికావ్యమ్ము సమముగా నవబ
ద్ధతుహీనిపాతమై హితముఁ బెంచి
మరువకములకు పెంపఱి సమృద్ధసరశ్శ
కుంతసార్థముతోడ వంతుఁ గాంచి

గీ॥ కువలయసమృద్ధి యోగ్యు భూధవునిఁ బోలి
మధురమధుఋతు వరుదెంచె మధుమదమున
ముదితలగు గుబ్బెతలు సురఁ బుక్కిలించి
యుమియ వకుళములకు ముకుళములు వొడమె 39

గీ॥ పొదలు సహకారకోరకమ్ములకు వ్రాలి
తేనెఁ ద్రావి మదించి యిందిందిరములు
నిరతఝుంకారహుంకారనినదకలన
తెరువరికి సంజ్వరమ్ము సంధించుచుండె 40

సీ॥ మలయు కోమలమైన మలయానిలమ్మున
మసలి మామిడిపూల రసము మెసవి
యా రసమ్మునఁ గషాయంబైన గొంతెత్తి
కుహూకుహూయని వెసఁ గొసరి క్రోల్చి
యలసి క్రమ్మఱఁ గోవెలలు మొక్కపున్ జెట్ల
మొగడలఁ జీల్చ నా మొగ్గలూపి
యందు వెల్వడిన మరందధారాసార
శీకరమ్ములనుఁ బైఁ జిమ్ముకొనుచు

గీ॥ దక్షిణసమీరణంబను దండిమార
వారణము తాఁకి యెద గాయపడినవారు
భర్తలందందుఁ బో నిండ్లఁ బడినవారు
స్రుక్కి రవ్వోళఁ బాంథుల జోటిబారు 41

కం॥ అతిముక్తకమునులకు నా
యతవిలసన మొదవె నౌర! యతిదూరవివ
ర్ధితమగు మధువున విక్రియ
గతికిన్ విక్రీత మీ జగంబెల్ల చెలీ! 42

గీ॥ గ్రామ్యగీతుల వైహాసికప్రవీణు
లాలపింపంగ వేడుక నాలకించి
వాని పిద్గులు చర్చరీప్రగతిఁ బాడ
విన్న పథికులు మోహాన వివశులైరి 43

మకరాంకుండను మీనలుబ్ధమతి యామై పాంథహృన్మీనపా
ళికిన్ పన్నిన గాలమో! యనఁగఁ బొల్చె నొక్కకఱపుంబువ్వు చర
పకపుష్పంబు వియోగిమానమథనప్రారంభుఁడౌ పుష్పబా
ణు కనత్కాఱనకశాణచక్రమనఁగా నున్నారి సంభాసిలెన్ 44

భ్రమరము లున్న మల్లెవిరిబారు వనేందిర తాల్చె నింద్రనీ
లముల సుపాణి పేరనఁ జెలంగెఁ బ్రియా! యట మధ్యమధ్యఁ దేం
ట్లు ముసరి రెండురంగుల వెలుంగు నశోకపుగుచ్ఛ మర్ధద
గ్ధము మరుకాటినిన్ జెనసికాల్చెను పాంథులమానసమ్ములన్ 45

విలిఖితమా ప్రసూనశరు పేరున నక్షరపంక్తి నాగ బి
ట్టలరెను చూతనూతనసుమాశుగమూలమధువ్రతాళి వృం
తలులితమైన మల్లెపువు తద్గతభృంగరవమ్ముతోఁ బ్రకా
సిలెఁ ద్రిజగమ్ములన్ గెలిచిచిత్తజుఁడొత్తినశంఖమో! యనన్ 46

నవలాక్షౌరసపంకపల్లవితమై నాకెంపుటందెల్ రణిం
ప విలాసమ్మను తీవపాదు తరుణీపాదమ్మునన్ దన్నుఁది
న్నవికాస మ్మనురాగముల్ దెలిపె నోనాతీ! యశోకమ్ము కొ్రం
జివురాకుల్ జిగిపేరి రాగమున నా శృంగారకాలమ్మునన్ 47

గీ॥ మధురమధుపూర్ణకామినీమంజువదన
కమలగండూషసంగసంఘటితసుమము
వకుళవృక్షమ్ము తన్మధుపరిమళంబె
తన సుమమ్ముల వెలయించెఁ దరుణి! యపుడు 48

సీ॥ రతిలోలలాటీలలితలలాటగతాల
కసుమసౌరభమధుగ్రాసి యగుచుఁ
గామవిద్యోత్తీర్ణకర్ణాట సుందరీ
స్తనఘుసృణామోదధారి యగుచు
యౌవనోద్ధతకేరళీవరగండప
త్రావళీపరిచయాధ్యక్షుఁ డగుచు
సకలకలాప్రౌఢచతురవాఙ్మాళవీ
వరకటిబింబసంవాహి యగుచు

గీ॥ నిరతసురతపరిశ్రమపరవశాంధ్ర
కామినీపీనవక్షోజఘర్మబిందు
శీతలుండౌచు విహరించెఁ జెలియ! యపుడు
గంధగిరిగంధవహుఁడు శృంగారి యనఁగ 49

రణరణకమ్ముతోడఁ గలరావముతో నపరాంతవాసినీ
జనము చరింపఁ దచ్చికురసంభృతసౌరభలుబ్ధ బంభర
స్వనముల ఝుంకృతి న్మధురభావము నాసలఁ దొట్టి యాడె ద
క్షిణశిశుగంధవాహము సఖీ! సుఖ మెంతని చెప్ప నామనిన్ 50

కం॥ ఆ సమయమున ధరాపతి
వాసవదత్తను నిజాత్మభవకుఁ బరిణయం
బాసించి తదిచ్ఛనుఁ ద
ద్దాసీముఖ్య లెఱిఁగింపఁ దాఁ దెలిసికొనెన్ 51

గీ॥ తెలిసికొని యట్లు కొమరిత తివిరినట్లుఁ
దత్స్వయంవరమునుఁ దీర్పఁ దలఁచి యతఁడు
సకలదేశాధిపతులకుఁ జాటఁబంప
వచ్చి రెందఱో యా స్వయంవరముఁ గోరి 52

గీ॥ రాజులందఱుఁ దన్నగరమ్ముఁ జేరి
గువ్వాకోల్గొని యందందుఁ గూరుచుండి
రుచితపీఠమ్ములం దల యుర్వీపతిస
భాంతరమ్మున నాఁడు స్వయంవరమ్ము 53

సీ॥ జైమినిమతమునఁ జరియించి రనఁగఁ గొం
ద ఱట తథాగతధ్వంసమతులు
కుముదాకరఖ్యాతిఁ గొనిరి భాస్వద్దర్శ
ననిమీలనమునఁ గొంద ఱట కవులు
కౌంతేయు లటుల నక్షపాదయాజ్ఞానహృ
త్తక్షములైరి కొంద ఱధికార్లు
స్వర్ణపర్వతపరిసరరీతిఁ గలరు కా
ర్తస్వరమయులు కొంద ఱధిపతులు
గీ॥ కొందఱో శకునశ్రావకులుగ బోయ
లటులనుఁ గొంతమంది రూపానుసార
వర్తనమ్ముల వేఁటాడువారివలెను
గల రల స్వయంవరార్థిభూకాంతులందు 54

సీ॥ సాంవత్సరికఫలసందర్శనమునఁ గొం
దఱు కానఁబడిరి ఖంజనము లట్లు
కొందఱు దివ్యచక్షుర్యుక్తిఁ గృష్ణాగు
రులతోడఁ బాండవతులితు లైరి
కొట్టవచ్చినవారిపట్టునఁ గొందఱు
స్వబలార్థు లైరి ధరాధిపతులు
కొందఱు నెలకారునందలి దివసమ్ము
లట్లు దూరప్రవృద్ధాశఁ గలిగి
గీ॥ రచటఁ గొందఱు పాణిగ్రహమ్ముఁ గోరి
యును నసుకరమ్ముగా నెంచుచుండ సుస్థి
రాత్ము లై రథరీకృతులయ్యుఁ గొంద
ఱటుల వివిధాత్ము లుండి రా నృపులయందు 55

కం॥ కొందఱు తిర్యగ్గతు లటు
గందముఁ గొన ద్రోణశాస్త్రగతిసూచకులై
రందుఁ గురుసైనికులుఁ బలెఁ
గొందఱు చెలిఁ బెండ్లియాడఁ గూడినవారల్ 56

గీ॥ అందుఁ గొందఱు కలరు బృహత్కథాను
సారులనఁగ గుణాఢ్యు లా జాడ నున్న
రాజకము రాజసత్కారరాజితము స్వ
యంవరాదర్శనోత్సుకమయ్యె నపుడు 57

సీ॥ పార్థుని యని వోలె వందిఘోషము మ్రోయ
తబిసిచోట వలె వితాన మొప్ప
రాట్సభకుం బోలె రాజోపహారమై
దివి నోజ సుమనఃప్రదీప్తి వెలయఁ
బరిహాసగాథలఁ బలుకు ప్రోడలు సఖుల్
శృంగారరస మొలుకఁ జేరి నిలువ
దగ్ధకృష్ణాగరూద్యద్ధూపవాసనక్
భ్రమరముల్ బరిఁదిర్చి పాడుచుండ

గీ॥ నతిరభసహాససౌరభ మాశ్రయింప
గమగమల తావు లీను సుగంధవస్తు
చయ మవఘళింప నొప్పు మంచమ్ములందు
మత్తకాశిని వాసవదత్త కలదు 58

గీ॥ అవ్వరారోహ యారోహణాంతమందె
కలయఁగనుఁగొనె రాజన్యకంబునెల్ల
మరలఁ గని విని యొక్కరొక్కరిని మఱలెఁ
గాని యేరిని వరియింపఁ బూనదయ్యె 59

గీ॥ దాన విఫలమయ్యెఁ దత్స్వయంవర మంత
రాజు లెల్లఁ దోసిరాజు లగుచు
నింటిమొగముపట్టె రింతి వాసవదత్త
రేయివడుట నిద్దురించె నంత ! 60

కం॥ నిదురించి యామె రేకడ
పదనునఁ గలలోనఁ గాంచెఁ బగువపునెఱిచ
క్కఁదనమను దనము మిక్కిలి
యదిమిన గది యనఁగ నొప్పు నధిపతి నొకనిన్ 61

సీ॥ అల లేడి కీడు రామాకర్షణప్రౌఢి
నఖిలవిద్యాలతాద్యాలవాల
మంగదసంశోభి యతఁడు వాలికి జోడు
కలకంఠగతిహారికంఠవహుఁడు
శరధి మాదిరి మహాసత్త్వతేజోనిధి
ఘనఘనాఘనకనత్కరకధారి
వృద్ధశ్రీవామోదవిధి జయంతుని వంతు
గుణమణీగణపు రోహణనగమ్ము

గీ॥ వాఁడు శృంగార మను మాత్రిని ప్రథమకంద
మలరువిలుకాని కథ లనునట్టి నదులు
పుట్టు మెట్ట సుశీలంపు మూలగృహము
త్రిజగదభిరామమూర్తి భూభుజుఁడు చెలియ ! 62

గోదఁ జేయినిఁ దుంగభద్ర యగు ముక్కు-
న్నర్మదోక్తి న్మృదా
పాదిన్ శోణపు మోవి మాలిని సిగఁ స్వ
ర్వాహినిఁ గీర్తి నా
వైదగ్ధీసహకారమాధవుఁడు సంప్రాపించెఁ
బుణ్యాపగా
మైదుర్యాన్వితమూర్తియో! యనఁగ సం
భాసించెఁ బ్రాణప్రియా! 63

కం॥ మాటలబోఁటికి మాటల
జోఁటికి స్పర్ధాగృహమ్ము సుజనత ముఖమై
పాటించిన యాదర్శము
కోటీరం బతఁడు రాజకులమునఁ గలికీ! 64

అలఘుయశఃపురంధ్రికి స్వయంవరభర్తగ నైన యట్టి రా
కొలపునెల న్నెలంత కలకోరిక లీరిక లెత్తఁ గాంచి య
క్కలల విడ లేచి వానిఁ దన కాంతునిఁగా మది నిశ్చయించి తా
వలచి తదీయరూపవిభవమ్మున కచ్చెరువొందెఁ గామినీ! 65

గీ॥ అతఁడు "చింతామణీ"శున కాత్మజన్ముఁ
డైన "కందర్పకేతు"నిఁగా నెఱింగె
వనిత యా స్వప్నమందె కావునఁ దదీయ
సంజ్ఞ మానసముద్రిగా సవదరించె 66

గీ॥ వలపు ముప్పిరిఁగొన వాని పలుకుతీరు
వాని మోమునుఁ గోమును వాని సౌరు
నద్దమున యట్లు బింబింప నాత్మయందు
నిటుల వర్ణింపఁ జొచ్చె న చ్చటులనయన 67

తన నిర్మాణచణత్వ మంతయును సందర్శించి "యీ సృష్టిఁ జే
సిన నెట్లుండునో! చూత" మన్న కుతుకశ్రీ హెచ్చ లోకత్రయిఁ గా
గొనబౌ నే సమవాయరూపపరమాణుల్ వానిఁ బూరించి వీ
నిని నిర్మించెనుఁ బో! విధాతృఁ డెటులన్నిర్మిన్నం దనే! యందముల్ 68

కం॥ ఆ రీతిఁ గానిచో న
య్యారే! యిటువంటిదానె! యందముచందం
బౌరయనె! నేను నిల నె
వ్వారికి నెన్నఁడును నిట్టి భాసము కలదే! 69

సీ॥ ఖగు లెల్ల వలదన్న మగఁడు యముఁడు కాగ
ధూమోర్ణమను వెంత తుఱగలించె?
నళయోగమున నడవులఁ బట్టి వలపోసె
దమయంతిబ్రతుకు సార్థకతఁ గలదె?
దూర్వాసుఁడు శపింప దుష్యంతు వలచి శ
కుంతల కేమంత కుశల మయ్యె?
మహిషియై యజ కేళి మరగిన యిందుమ
తీదేవిమనుగడ తృప్తిఁ గలదె?

గీ॥ ఊరుజితరంభ రంభ యు మ్మేరుగిరిని
తంబమున నలకూబరు దనివువలనఁ
దనియునే! వీనిఁ గవగూడి తనియుఁ గాక
యితనిఁ దలఁపని సుఖ మెంత యతివ యెంత! 70

గీ॥ యక్షగంధర్వులందు నేకాక్షి యగు కు
బేరు ధనవంతుఁడౌనని పెండ్లియాడె
బుద్ధి దుర్బుద్ధి కాదొకో! యిద్ధపురుష
సౌఖ్య మొదవని సతికి సంసార మేల? 71

కం॥ ఇ ట్లెలుఁగున న వ్వాసవ
దత్త కలనుఁ గన్నవానిఁ దలఁచుచు మోహం
బెత్తి యిటులఁ బలువిధముల
న త్తరుణుం గూడు టెన్నడని తలడిల్లున్. 72

గీ॥ తద్వియోగభరార్తి దుర్దాంతమూర్మ
రాగ్నికాగ మనోజదావాగ్ని కాగ
నట్టి మంటల నడుమ నల్లాడె మిగుల
నా తలిరుబోణి విలపించు నగ్గలముగ 73

సురభియుగాంతపావకము చూఁడినటుల్ మలయానిలచ్ఛల
స్ఫురితహరాగ్నికీలికలఁ జొచ్చినటుల్ వెడగుల్ వసించు దు
ర్భరబలిసద్మమందుఁ దమిబంధము దూఱినటుల్ ప్రశూన్యమై
కరణసమూహ మున్నటులుఁగాసిలు నామె వియోగవేదనన్ 74

సీ॥ చీలతాపడముచేఁ జేతఃఫలకమందు
బిగియింపఁబడినట్లు నిగళితునిఁగ
నాత్మఁ జిత్రితుఁడు నైనట్లు విభక్తుగా
నంతరారోపితుం డైనయటుల
నెద వజ్రసారంపుపదనున నతికింప
బడినట్లు నసువులఁ బట్టినటుల
నస్థిపంజరమున నధివసించిన భాతి
మజ్జారసమున నిమజ్జితునిఁగ

గీ॥ నంతరాత్మ నధిష్ఠించి నటుల మర్మ
కీలితునిఁగాఁగ పలలసంకీర్ణ రుధిర
మిళితునిఁగ నెంచు వాని న మ్మెలఁత స్వాంగ
మంత కందర్ప కేతుమయంబు కాఁగ 75

సీ॥ చెవిటి మూఁగయునుఁ బిచ్చిదియొ! యనంగ దో
చును రిత్తచూపులఁ జూచు బయలు
నంధురాలన నింద్రియజ్ఞానశూన్య నా
మూర్ఛిల్లెనో యన ముచ్చముణుఁగు.
జవ్వనంపుకడలి జవ్వాడు తఱఁగల
కగ్గమైనదన నట్టిట్టుఁ దూఁగుఁ
దమకంపుఁదాళ్ళచేఁ దాఁ గట్టఁబడియెనా
దగర పట్టె ననంగ నగడువడును.

గీ॥ నతను పుపుటమ్ము లదరంటె ననఁగ రూప
భావనాశల్యకీలితనా వెలంది
మలయపవనహతిఁ జీవములనుఁ బాయు
నో! యనఁ దపించు నెడబాటు నోర్వలేక 76

సకి శుచిభావనావిషరసమ్మున ఘూర్ణిలునట్లుఁ దోఁచి యో
ర్వక మదనజ్వరమ్మునుఁ గుర గటి బోఁటుల నిట్లుఁ బల్కు- నో
సకియ!యనంగలేఖ! కరసారస ముంపవె! నా యెదన్ గటా!
సెక మెయి హెచ్చెఁజూచితె!యిసీ!భరియింపఁగనోపఁ దాపమున్

సీ॥ మదనమంజరి! ముగ్ధ మలయజోదకమునఁ
బడుపవే!నాదు గాత్రముల నెల్ల
తరళ! తరంగవతి! రుచిర కేతకీ
రజ మంగకమ్ముల రాల్పగదవె!
వామా!మదనమాలినీ! మంచి చల్లని
పెనునాఁచుపీచోపు విసరవేమొ!
సరళ! వసంతసేనరో! నాదు కేశపా
శమ్మును ముడువవె చక్క దిద్ది

గీ॥ చిత్రరేఖరో! చపల! యీ చిత్రపటము
నందు లిఖియింతమే మనోహరుని రూపు
భామిని! విలాసవతి! యద్దవే! మనోజ్ఞ
తారచూర్ణము మెదిపి నా తనువునందు 78

మొల్లసుగంధి! మొల్లలనుఁ బూంచిన మేలరటాకుపీవనల్
చల్లఁగ వీవవే! కనుల జాల్కొను బాష్పకణమ్ము లొత్తవే !
యల్ల సుకాంతి! కాంతిమతి! హాయిగఁ గప్పవె! తామరాకులన్
బెల్లుగ నీ యురోజములఁ బేరిచి రాగిణి! రాగలేఖరో! 79

కం॥ భగవతి ! నిద్రాదేవీ!
తగవే!ననుఁ బూనకుంట తాతను నిందిం
పగఁ వలసెఁ బ్రియుని లలిఁ దో
గగ నా కొడలెల్ల కనులుగాఁ జేయుముకై 80

కుసుమశరాసనా! మహితకూర్చము! ప్రమొక్కెదమాద్యశానురా
గసహితకామినీజనము కై యనువశ్యముగా నొఱంగు మం
తె సురతమర్మ మహోత్సవపుఁదీక్షకు నొజ్జవు దక్షిణానిలా
విసరు యథేచ్ఛ నా యుసురు వీగ వహింపు మి దేతొలంగెదన్

గీ॥ ఇటుల వివిధోక్తు లాడి యయ్యిందువదన
సొమ్మసిలె నంత వేఁ జెలుల్ చుట్టు మూగి
తనువుఁ జేసేత లుపచరించిన లతాంగి
తెలివిఁ గొని లేచి విహరించెఁ జలువయెడల 82

సీ॥ పద్మినీదళముల ప్రస్తరమ్ములయందుఁ
బ్రాలేయ మొలికిన రాలయందు
నలఁతిగాడ్పునఁ దూఁగు ననఁటితోఁటలయందుఁ
జివురుపుప్పమ్ముల సెజ్జలందుఁ
గొందమ్మికొలఁకుల కెలఁకుల జబరైన
చల్లని చందనచ్ఛాయలందుఁ
ఘనసారసారమ్ము క్రమ్మి గుబులొక్కన్న
తటినీతటీసైకతమ్ములందుఁ

గీ॥ జెలులు కొనిపోవ నందందు నిలిచె విశ్ర
మించె వాసవదత్త యొకించుకంత
తాప ముడుపుకొనంగ శైత్యమునఁ గాని
కొసరె నదియేమొ! బాధ తగ్గుటకుబదులు 83

గీ॥ ప్రళయకాలమందుఁ బన్నిద్ద ఱినుల లోక-
మొగినిఁ దీండ్రిలంగఁ బుట్టువెట్ట
సరిగఁ దీవ్రమైన విరహాగ్నిపరితాప
మున నలంగెఁ బుష్పఁబోఁడి మధుర! 84

గీ॥ అతని యాకృతి పొడగట్టినట్ల యుండఁ
దనివి తీరక మఱిమఱి తలఁచితలఁచి
ప్రియుని నీరీతి మరల వర్ణింపఁదొడఁగె
భర్తృదారిక భావవైభవము తనుక 85

పాలసముద్రమం దలఁతిపాటిగఁ దూఁగు కడళ్ళ కూటువన్
బోలిన వీని చిర్నగవు పొందికలో నిగురాకుమోవి కెం
డాలు తుఱంగలించె వదనంబు పయోజసమం బహో! శ్రుతి
శ్రీలకునై ద్విజద్వయమురీతిఁ బ్రియంపడె రెండుకన్నులున్ 86

గీ॥ సహజ పరిమళమైన యీ సభ్యముఖము
నందు నెత్తావి మూర్కొన ముందు దవ్వు
బఱచె ననఁ దగె నాసికావంశలక్ష్మి
యక్షరశ్రీలు వీని నామాక్షరములు. 87

మచ్చ యొకింత లేని విధుమండలమందుఁ గళామృతమ్ముతో
వచ్చెడి నెన్నెఱుంగులనఁ బాండురముల్ రదనమ్ము లొప్పు నీ
యచ్చున వీఁడు కన్పడి యనంగున కొచ్చెముఁ దెచ్చెరూపమం
దెచ్చటనుండు మెట్టు నిత డిద్ధము లచ్చొటు వెల్ల పుణ్యముల్ 88

కం॥ కన్నులఁ బ్రతిబింబించె న
న న్నభమున వ్రాయబడియె నాఁ జిత్తరువం
దున్నటుల నెదుటఁ దలఁచుచుఁ
గన్నియ వర్ణించె నెంతొ కందర్పవిభున్ 89

గీ॥ అటులఁ దలపోసి వలవంత నంగలార్చి
నామెతోఁ జెప్పి చెలికత్తె లనిపి రపుడు
శారికఁ దమాలికాఖ్య నీ భూరుహమ్ము
మొదట నది యున్న దధిపతి వెదుక వచ్చి 90

కం॥ ఇది కథ కలసి యిరువురముఁ
గదలుటఁ దడవయ్యె నని శుకం బన నదియున్
ముదమందె రాజు సఖుడును
ముదమందిరి విన్నవారు భూజము క్రిందన్ 91

*

శ్రీముదిగొండవంశపు కరీరము సత్క-విమల్లికారున
స్వామికి నాగమాంబకుఁ బొసంగిన సంతు మనస్వికోకిలా
రామము వీరభద్రుఁ డిల వ్రాసిన వాసవదత్త యన్న మా
ధ్వీమధురస్రవంతినిఁ దృతీయతరంగ ము రేఁ బ్రశస్తమై

# వాసవదత్త

## చతుర్థ తరంగము

*

విని రాట్పుత్రు డటుల్ ముదమ్ము విరియన్ స్వీయస్థలోపాంతమం
దునె యున్నట్టి తమాలికం బిలిచి తన్నున్ దెల్ప నా గోరువం
క నమస్కారమొనర్చి జాబొకటొసంగన్ వే మరందుండు దా
నిని రేయెండ వెలుంగునన్ జదివి వించెన్ దేని కీ రీతిగా 1

గీ॥ "అస్థిరమనస్కయగునుఁ బ్రత్యక్షముగను
నరసియున్ విని కామిని యౌవనవతి
స్వప్నమందునె యనుభూతభావయయిన
నే కరణిఁ బ్రత్యయమును దృఢీకరించు" 2

అని చదువంగ వీనుఁగవ నర్థరసమ్ములను గ్రోలి తా సుధా
వనధినిమగ్నుఁడై నటుల భవ్యసుఖమ్ముల నెల్ల యేలిన
ట్లు నృపతిచంద్రుఁ డుబ్బునదలంచి పులుంగును గారవించి మే
ని నిమిరి దానిఁ బెంచు రమణీమణిఁ గూర్చిన వింత లేమనన్

అది యజమానురాలివిరహార్తి ప్రవర్తన మాత్మవృత్తి చ
క్కఁదనము ప్రస్తుతస్థితియుఁ గాఁదగు కార్యము దండ్రిభావమున్
మొదలగు నెల్ల సంగతుల ముద్దుగఁ బూసలఁబోహణించిన
ట్లొదుగఁగ వాకొన న్వినుచు నుత్సుకతం బవ లేగఁబుచ్చుచున్

ఆ నరనాథుఁ డప్పలుగు నర్మిలిఁ జేఁగొని యేగె నంత దో
డైన మరందుతోడ నపు డా సముదంతముఁ జాటనోయనం
భానుడు పశ్చిమాద్రికొసపై నిలిచెన్ దివసంపుకోడి పైఁ
బూనిన గుండ్రజుట్టనఁగఁ బొల్చిన యెఱ్ఱని మండలమ్ముతో 5

సీ॥ చక్రవాకముల కష్టము లెంచి దీనాస్య
    డైనా డనంగ మందిమాన మొంది
యొక దరిద్రుండు పోలికఁ గల వసువులఁ
    గోలుపోయి విషాదజాల మంది
వారుణీ సంగతుండై రాగవశుఁడునై
    బలభద్ర దేవుతోఁ బాటిఁ గాంచి
సూరిపాళమున సంజ్ఞారక్తుఁడై శాక్య
    సముఁడు నా రక్తాంశుకము ధరించి

గీ॥ తరళతరళమ్ము లును భయంకరము లైన
యలఘువీచుల నూఁగిసలాడుచున్న
పవడముల కొమ్మ యన లోకబాంధవుండు
మునిఁగెఁ ద్రుటిలోనఁ బశ్చిమాంబునిధి నీట 6

గీ॥ గగన మనెడు కాపాలికు కరమునందు.
మధురమధుపూరితకపాలమా! ప్రతీచి
యను విలాసిని తలదువ్వునపుడు కనక
ముకురమా! సూర్యమండలము తుదిఁ దని కె 7

గీ॥ వింటియమ్లానతరువున విరుల గుత్తి
కూశుమల బాడిదపు ద్రమ్మని కుసుమరాశి
నింగికంగేలిపూల హారంగుగుబురు
వ్రాలి భగవానుఁడు మరీచిమాలి క్రుంకె 8

సీ॥ సిందూర మొత్తు బూసిన బాసవాలేన్గు
బటువుకుంభమ్ముతోఁ బాదరించి
వారుణీగణిక యొయ్యారి కీలించిన
రత్నకుండల మన రాగ మొలికి
తటిక త్రివేట నెత్తుటఁ గార్చి వెనుపవ
లెనుముకంద మ్మన నెఱ్ఱవారి
సంధ్యాపురంధ్రికి సరసయావకపత్ర
రేఖయో! యనఁ జేగుఱించి మెఱసి
గీ॥ చండతాండవచటులధూర్జటిజటాల
మకుటవికటనిబద్ధవాసుకిఫణాళి
శాలమాణిక్యకర్ణభూషణసనాభి
తపనబింబంబు మినికె నస్తమయవేళ 9

సీ॥ వినుకొలంకునఁ గల విడితామరల తీవ
చరమాబ్ధివిద్రుమభరితవల్లి
తారానురక్తవిస్తారరక్తాంబర
విభృతి నొప్పిన శ్రమణీమతల్లి
మిన్నుప్పరిగపైనఁ జెన్నొందె మాంజిష్ఠ
రాగమ్ముఁ గురియు నెఱ్ఱని పతాక
కామినీరత్నంబు కాలేయవిలసదా
తామ్రమపయోధర క్రమరూప
గీ॥ లక్ష్మి తన వరమున లబ్ధపీతాంబర
పల్లవానురక్త వారకాంత
కపిలతారకలనుఁ గల ముంగి మరు తేరి
పొనుసిడ మ్మనంగఁ బొలిచె సంధ్య 10

గీ॥ ఉచ్ఛకేసరముల కొన లొఱసి కస్తి
కలుగ నిఱుకున సంకుచజ్జలజగర్భ
కోటరకుటీరములయందుఁ గుటిలరీతి
నత్తమిలుచుండెఁ దేంట్లు పద్మాకరముల 11

గీ॥ "తమ రిటుల దయసేయుఁ బ్రార్థన" యటంచు
వరుణుఁ డా భగవాను భాస్వంతుఁ దోడు
కొని చనుట నొప్పు ఘనరత్నకుట్టిమంపుఁ
బట్టువలువల పథ మన వఱలె సంజ 12

సీ॥ సకల కథానివృత్త కథక గృహాగమ
నత్వర ములుసూపెఁ జత్వరముల
ధ్వాంక్షముల్ వసతిసాకాంక్షమ్ములయ్యె గృ
హస్థులు సాంధ్యవ్యవస్థులైరి
కలకలవికలబకము లయ్యె వనతరుల్
క్షుద్రలు కృతమారముద్రలైరి
నిద్రార్థ విద్రావితద్రోణకుల కలి
లకులాయ మయ్యె నూళ్ళ కుటజాళి

గీ॥ వాఁకదరి లేఁతపచ్చికబయలఁ జెలఁగు
జాణల పరిసంగములు విని సంతసమ్ము
చే రొదాళించు వారిపైఁ జిఱ్ఱుమనిరి
వృద్ధు లయ్యెడ వేదాంతబద్ధు లగుచు 13

సీ॥ మారుఁ డుద్ధురశరాసారంబుఁ గురిసి సాం
సారికక్షేమముషీచోరుఁ డయ్యె
గృహజాలవివరముల్ విహితకాలాగురు
ధూపగంధోద్గారధురము లయ్యె
శంభళీభాషానుసార కేళీవేష
భాజనం బయ్యె దాసీజనంబు
గంధకారికలు మేఖలలఁ బూంచు వధూజ
ఘనములు జల్పనాఘనము లయ్యె
ఆ॥ వెంటఁ దవిలియున్న విటుల నశ్లీలమ్ము
లాడు పదుపుఁజెలుల నాలకించి
సంధ్యవార్చఁ బోవు శాస్త్రు లసహ్యించు
చుండి రపుడు సంజ మెండుకొనఁగ 14

సీ॥ తిమిరతర్జననిర్గతమ్మైన దినమణి
దీప్తులో! యన వెల్గె దీపపంక్తి
జీర్ణించియున్న పెంజెట్ల తొఱ్ఱలనుండి
వెలిఁ బాఱఁజూచె గూబలకొలంబు
కపియూథకాపేయకలిలమ్ము లయ్యె నా
శ్రమములయందు వృక్షమ్ము లపుడుఁ
బ్రాప్తకుక్కుటమయ్యెఁ బాళిందనిష్కుటం
బెగిరెఁ గఱ్ఱలకుఁ బెంపుడు నెమళ్లు
గీ॥ నాలుకల నూపి ముదుసళ్లు జోలపాడి
యలఁతి కరతాడనమ్ముల సలిపి నిదుర
బుచ్చ సరనిద్దురల శిశువులును గన్ను
మోడ్చుచుండిరి సంధెజాము సుఖకరము 15

గీ॥ ఇంచె రోమంథమంథరమృగకుటుంబ
వేష్టితమ్మి దిష్టగోష్ఠినపృష్ఠ మడవి
ధూళిలుఠితోత్థము కులాయదోహలమునఁ
బాఱె నయ్యెడఁ గలవింకపక్షికులము 16

ఆ॥ కలహావికల మైన కలవింకకులమున
కలకలముల కలిమి కొలకొలమని
తాఁమె తివిరినటుల సోమించె సిగరముల్
కొండయందు సంజ మెండుకొనఁగ 17

కం॥ క్షణదానురాగచతురత
గణికల బలె సాంధ్యశిష్యగణ మన దీవెల్
దనరెఁ దులాధారుఁడు లే
ని నభం బపు డట్టి విపణినిం బురుడించెన్ 18

కం॥ పుటకినులు దళపుటమ్ముల
ఘటియించెఁ బరిభ్రమించెఁ గమలవనములో
నటునిటుఁ దేఁటులు రేజీఁ
కటిచే ప్రతిహతము లైన గతి నవ్వేళన్ 19

వనజిని భర్తృదేవత ప్రభాకరు భర్తనుఁ బాసి వేదనన్
గని కురరీరవచ్ఛలమున న్విలపించుచు సాంధ్యరాగబిం
బనిభృతవహ్నివర్ణ మగు వారిఁ బొసంగెను దుఃఖదుర్భర
మ్మునఁదనువున్ దొఱంగుటకుఁబూన్చినమంటనుజొచ్చెనో!యనన్

సీ॥ గట్టిగాఁ జదువని గణకుండు వలెఁ బ్రదో
షమున నక్షత్రసూచన మొనర్చె
బౌద్ధసిద్ధాంతంబు వంతునఁ బ్రత్యక్ష
వస్తుసంతతుల నపహ్నవించెఁ
దులువపెత్తనముతోఁ దులఁదూగి సకలాంత
రముల నూరకయ తిరస్కరించె
నర్కోదయారంభ మంగమ్ముగఁ గువల
యంబును సంకుచితం బొనర్చె
గీ॥ ఖచరులవనంబు వలెఁ గౌశికప్రచార
మగుచు వినిమీలదిందీవరాంజలిపుట
ఘటితరాజప్రణామసంగతి నెసంగ
భూనభోంతరపరిపూర్ణ మైన తమము 21

సీ॥ ఘనతరప్రస్తరకఠినతరములందు
గట్టుపట్టులయందు గండరించి
గవుల నిద్రించి మేల్కను సింగముల నేత్ర
కపిలచ్ఛవిచ్ఛటఁ గండ్లు తెఱచి
యీరెండపొడ రాని యిఱుకులందు మిణుంగు
రులు పెంచఁ బ్రాణము నిలిచి పొఱలి
జ్వలనధూమమున మాంసలితమై కామినీ
వాలసంస్కారధూపమునఁ బెరిఁగి
గీ॥ పృథులమధుకరముల నలుపెక్కి గంధ
సింధురఘటాకటమ్ములఁ జిప్పిలెడి మ
దాంబుధారల ముదిరెనో! యనఁగ జగముఁ
గ్రమ్ముకొని యంధకారమ్ము కావరించె 22

సీ॥ తరుణుల దీర్ఘకుంతలనిగన్నిగవిస్ఫు
రన్నీలరింఛోళి రాటుదేలి
యువటాంతరమ్ముల నడరి కండలు వెంచి
యింద్రరత్నజ్యోతి నేపుమీఱి
తఱచు గుబుర్కొన్న దళములఁ దెఱపీని
తాపింఛముల నీడఁ దాండవించి
తద్వనోత్కటబహుతరుసూనపుటపిహి
తపదషట్పదముల దండడించి
ఆ॥ ఘోరఘుస్మరోరు కుండలిభోగబాం
ధవము మత్తదంతిదంతకాంతి
తర్జనప్రకాండజర్జరితమ్ము నై
యిరులు ముంచియెత్తె నెల్లకడల 23

సీ॥ అల మహానటు తాండవాటోపమున జాఱి
గంగఁ జిందిన బిందుగణము లేమొ!
రవిగుఱాల్ దవు బాఱి దివిఁ గడు నలసి క్ర
క్కిన పెన్నుఱుంగుల కణము లేమొ!
ధవుఁడు ముజ్జగముపై దండెత్తు నెడ రతీ
దేవిలాజాంజలుల్ ప్రోవు లేమొ!
మను మోసిమోసి డీలిన దిగ్గజముల గం
డచ్యుతశ్రమజల లవము లేమొ!
గీ॥ యిరులమసి నలువార్చి యుప్పరపుచర్మ
మందు విధి విశ్వగణకుండు చందనుబల
పమున సంసార మెల్ల శూన్య మని తెలుపఁ
జుట్టినవి సున్న లేమొకో! చుక్క లౌదవె 24

సీ॥ చెదరిన దివ్యలక్ష్మీహారమణులో! మి
న్నేర్వామిలోని డిండీరతతులో!
రతిదేవి వియదంకణతలమ్మునందు స
మర్పింప నొప్పు నాతర్పణములో!
వలరాజు విసరిన గుళికాస్త్రగుళికలో!
గగనకాసారంపు కలువపూలో!
శిశిరాంశు వను కామచితినుండి సుడిగాలిఁ
జెదరిన యెముకల చిదురుపలులో!
గీ॥ యెగయు నిరులపొగల్ ధూమ్రమ మెసఁగు సంజ
మంట వేఁగుచుఁ జదలను వంటఁయింటి
మంగలమునుండి యంతటఁ బొంగి పెటిలి
చిందు పేలాలో! తారకల్ చెంగలించె 25

గీ॥ నింగి బొల్లుఁగల పడంతి యంగుఁ దాల్చెఁ
గడలు తమ నాయకుని దివాకరునిఁ గోలు
పోయి పురపురఁ బొక్కె నాఁ బూనె నపుడు
జుక్క లనియెడి కన్నీటి చుక్కగుముల 26

గీ॥ మిగుల నుచ్ఛ్వాసరచనముల్ నిగుడ వక్త్రి
లలితఘటనలు సంశ్లేషములునుఁ గడుఁ బొ
సంగ సత్కావ్యరత్నంబు చాయవాతె
జక్కవల జంట దుఃఖించె మిక్కుటముగ 27

గీ॥ ఇనవిరహావిధుర యగు పద్మినికి నెడఁద
సమగ రెండయ్యెఁ జక్రవాకముల జంట
"యదుగో! హిమకరుఁడు ప్రియుం" డటంచుఁ దెలుపు
దూతి యన నళి కుముదినితోడ మొరసె 28

తేనియ లానఁగాఁ దివిరి తీయని పాటలఁ బాడు తేంట్ల సంతానము తమ్మితీవియలఁ దారుచుఁ దమ్మనుఁ జుట్టియాడ నమ్మానునఁ జిత్రవర్ణ మగు మైఁ దగు గుండుబులుంగుజంట రెండైనది కాలపాశమున నయ్యో! యెటుల్ శపియించె రాముఁడున్

కం॥ దినమణిఁ బతి నెడయుట వా
రని ఘనశోకాగ్నిముర్మురము రగిలెను నూ
తనకింజల్కవ్యాజ
మ్మున నళినికి నళినకోశపుటహృదయమునన్ 30

సీ॥ మిహిరాంశుదావాగ్ని దహియించిన నభోవ
ని నెసంగు మసికుప్ప యనఁ బొసంగి
యపుడప్పుడే సిద్ధమై నిట్టఁగొన్న కృ
ష్ణాభ్రకద్రావకం బనఁగఁ బొదలి
కృష్ణమూర్తిగ నయ్యు నిల విశ్వరూపభా
వతిరస్కరణవృత్తిఁ బరిఢవిల్లి
తొలిమిన్కునుడువుతోఁ దులితమై కుపితది
గంబరదర్శనంబై చెలంగి

గీ॥ అంతకంతకు శార్వరం బతిశయించెఁ
జంద్రబింబంబు పొడిచె నా సమయమందు
గగనలక్ష్మి ధరించు బంగారుదిద్దు
దర్పకునకు చామీకర దర్పణంబు 31

సీ॥ ప్రకటితతారకంబు కనుక దైత్యబ
లసమంబు రజనికి సిసలుపట్టి
ద్రుపదజు విడి వోలె ద్రోణప్రభాజేత
ముదిసానితలనఱపునకు మందు
కృష్ణవర్త్మజ్వాల రీతిగ నఖిలకా
ష్ఠాపహారకముఁ గల్యవధిసఖము
నటదులూకశకునిగ్రామె భారతాజిసం
కాశంబు రేవిటగ త్రైముసుఁగు
గీ॥ కాటుకల నల్లత్రాచుల కళుకుఁ గలది
దుర్జనుల మానసమునకుఁ దోడఁబుట్టు
కాలకాలుని కంధరకాళిమమునఁ
జిమ్మచీఁకటి యంతటఁ గ్రమ్ముకొనియె 32

సీ॥ పొడుపుఁగుబ్బలిపైనఁ బూచిన బాలమం
దారసుందరసుమస్తబక మేమొ!
దిగ్వధూటీప్రసాధిక చేయిజాఱగా
విడి పడినది లక్కపిడుచ యేమొ!
ముల్లోకముల గెల్వ మొనకట్టు తీయవి
లాఁకని యాత్రాశుభకలశ మేమొ!
కనుపండువైన యాఖండలాశాంగనా
కుంకుమాంకితకుచకుంభ మేమొ!
గీ॥ స్వర్గసౌధమ్మునన్ గల శాతకుంభ
కుంభమో! తొలికడలింటి కొమ్మమిన్న
నొసటి ముంకెనపూబొట్టొ! నిసివజీరు
బిడ్డచెండేమొ! శీతాంశుబింబ మొదవె! 33

తూరుపుకొండమోరఁ బ్రియుతో నొక కిన్నరి విశ్రమించుచున్
జేరువ నుంచుకొన్న రమణీయవిపంచికి నెట్టు గాసెనన్
దీరుప లోని కాయయొకొ! తీయనివింటిమగండు పుంఖముల్
గూరిన భర్మతూణమునకున్ మొగయో! మృదుచంద్రబింబమో!

సీ॥ మంచి రాజన రక్తమండలుండును మృదు
కరసుందరుండు నై కొఱలువాఁడు
జాంబవత్సముఁడు ఋక్షపరీవృతుండు ల
క్ష్మణయుతుం డౌట రామతులితుండు
వానరేంద్రగతిఁ దారానురక్తుండు రో
హిణినిఁ బ్రేమించిన వృషభసముఁడు
నాకాశగామి విద్యాధరీహస్త లీ
లాకీర పంజరోల్లసితమూర్తి
గీ॥ చందురుఁడు రాల్చె వెన్నెలఁ జక్రవాకి
కనులఁ జెందొవగుమియుఁ గామినులు నాచి
కొని రసఁ దదీయరాగమ్ము కుంటువడి క్ర
మమ్ముగాఁ బోయెఁ దెలుపెక్కె మండలమ్ము 35

సీ॥ రసపిండమో! వియద్రసవాది కండమో!
సమయం బనెడు గొప్ప సర్పమునకు
గటికచిగుళ్లచేఁ గర్పూరం బగు వెండి
దభిషేకఘటమొ! యనన్యజునకు
శ్వేతాతపత్రమో! వెల్లవింజామర
మొక్కొ! చక్రవర్తి ప్రద్యుమ్నపతికి
మందాకినీధౌతసిందూరకుంభమో!
యైరావతమునకు నచ్ఛకరికి

గీ॥ భంగమ్మై కొమ్ము లూడిన ప్రాతదైన
గోవుపునుకయొ! తెలిరిక్క-గోదుమలపొ
లం బయిన యాకసంబున కంబుజారి
బింబ మురుచంద్రికలఁ బాలవెల్లిఁ బఱపె 36

కం॥ కాలాంతకు కనుమంటలఁ
గాలిన పూలవిలుకానికై స్మారకచి
హ్నాలయమొ! గగనఋషికిఁ
బోలిన పటికంపు లింగమొ! కమండలువొ! 37

సీ॥ పుండరీకము వేలుపుల యేటిలో, మృదు
వాలుకాస్థలి నిశాపథమునందు
దంతత్సరువు నభస్సరవారియందు ను
ర్వ్యాలతెట్టె యాకాశజలధియందు
శ్వేతచక్రము మీనకేతుని రథమునఁ
గంబువు చదలుసంద్రంబునందు
తెలిపావురము వియత్తలసౌధమున మాని
కఁపుబిళ్ల ప్రాక్సతీకబరియందు
గీ॥ నదనుమసికల్మి శబలమా నభవనయన
దహనదగ్ధమనోభూశ్చితాస్థలంబు
నాఁగ జాబిల్లిబిల్లిక ననిచె జగము
పండువెన్నెలపఱపలోఁ గుండ యయ్యె 38

మలయజపిండపాండురము మానితసిద్ధసతీకరాంబుజా
తలులితరాజతవ్యజనతల్లజమో! తలిరాకువిల్తు పూ
ములుకులు నూరు సానయొ! చమూరువు బింబితమైనయద్దమో!
నెల వెలిగెన్ వియోగశిఖి నిబ్బరికించెదు పెన్సురంటిమై 39

కం॥ కందేటికి వెలికలువ యె
డందలరాయంచ లెలమిడంబున శయనిం
పం దగు మృదు వగు నిసుకల
కందువ తోవవిందు విందుగా జిగిఁ జిందెఁ 40

గీ॥అప్పు డభిసారికాసార్థ మనుప దూతి
కలు ప్రియులతోడ సంవాదముల వికార
భంగురమ్ముల శ్లేషార్థబంధురముల
సప్రపంచమ్ముల బొనర్పసాగి రిటుల 41

సీ॥ వ్యర్థవాహితతరవారి వో రాజ! క్షే
పణికవద్ధర్మార్థపరరతుఁడవ
కా నవ స్త్రీకృతమాత్మ నీకుఁ ద
త్సతి నుపేక్షించుట తగున కాంత!
ప్రియ దమయానట్లుఁ గూర్చెద నేమి దాని దు
ర్లభ యని చింతింప లగ్గు కాద
వాఁడ సాగుండు నీ వలె రిపుమండలా
గ్రము గ న భయవృత్తిఁ గ్రాలువాఁడు

గీ॥ కాదుగా నీది శిల వోని కఠినబుద్ధి
ద్రావకత్వంబొ చుంబకత్వంబొ కాని
లేక యాకర్షకత కాని నీకు లేద
భ్రామకత్వమ్మునకు నీవు పాదు కితవ! 42

పరుల సుదంతులన్ దవిలి పైకొనుచున్ జర కగ్గమానటుల్
సరగున సంప్రహారముల సల్పెడి నీవె మగండ వౌదు వో
వరరత ధారితోరుకరవాలుఁడ వౌచును విగ్రహంబు వోం
గ రమణ ఘూఁగవో! పర మకాండమునందు మహోపదాప్తిమై

గీ॥ విభ్రమమున లయాంగుళీవిభ్రమమున
జాలయూచల వివరంబుఁ జాల జూచు
లోకయంత్రితనాశ నైయు లోక మందఁ
దగని దగ నిజైక జెలి దద్దఁ గని వలపు 44

సీ॥ సాహసంబున సాహసంబునఁ గమల గ
మలవాసఁ గెల్చు నిర్మలవిభాస
యుష్మదర్పణదర్పణోజ్జ్వలాశయ శయ
బిసజాతనిర్జితకిసలజాత
మధురాధరయునుఁ గామధురాధరయు హరి
హరివక్షోజసంభారనమ్ర
వనజాక్షి కామదారుణముదారుణనేత్ర
హరిణదృక్కాంతిహారినయన

గీ॥ శ్రమలవపయోధరపయోధరములను మ్రది
మాకరకరమ్ములనుఁ గల్గినదియు నై త్వ
దీయబుద్ధివలగ్నగాఁ దేజరిల్లి
యును నిన్ గోరి మా దేవి వనరు రసిక! 45

సీ॥ ధీశోధన! యశోధనా! శర! పేర్మిమహా
ర్ఘ్య మహార్ఘ్య యగు మా సుమాంగి యుత్క
టాక్షమ్ము లైన కటాక్షమ్ములం జూడు
త్వద్దాస్యతత్పరఁ దత్పరిజన
ముపచరించును నిన్ను నో కమలాకృతి!
కమలాకృతుల దస్యుకాంతల ముఖ
ములను వాడించు నీ కులుకేల! న్యానర
హితనరహితవృత్తి నెసఁగు దీవు
గీ॥ కాంచనమ్ము నురఃఫలకాంచనమున
నదిమి యోడించు చెలిని రజోధిపతివి
శేషకం బన నొప్పు విశేషకంబు
గల ముఖేందువుతో లోఁగఁ గనవా నీవు 46

సీ॥ ఆ వంత నావంతయైనఁ గానవ గాన
వశి నీవు నీ మేలె వలచివలచి
నాయమ?నాయమ నలఁచ నీబోఁటి నీ
బోఁటి కాదే యది పురుషవర్య!
యసమ యసమబాణు నతిహాతి నామె చి
క్కఁ దర్పచే మూర్ఛ యై విదుర్చుకొనుచు
క్షణమేని మేనిఁ బూశయ్యఁ జేర్పదు నిన్నె
నమ్మె నెవ్వారిని నచ్చ దెందు
గీ॥ రమణిఁ గందర్పకందర్పకమునఁ దనుపు
తనువు పులకించి మితిలేని తనుపు తనుకఁ
జేయవే నటు రమణ! విశేషముగ వి
శేషముగ మరణంబె యా చెలికి నిజము 47

గీ॥ కనికరం బేదు నీ తపుల్ గని కరంబు
పరమకమితను రసికశేఖరుని నిన్ను
మదనసము వేడ్క "నిదియె ర మ్మ్రదన" యనుచు
నట్టి మదయంతి మరుదంతి యలరుదోంతి 48

గీ॥ జీవనాయక! "న సుభగం జీవనాయ
క మివ ప్రాప్నోతి" యనఁ జాలుఁ గలికిఁ దెలుప
నెందఱున్నను నేనె ని న్నెదుటఁ గొల్తు
"మైత్ర్యతో మైత్ర్యతోఽస్తు" నా మనుపు! చాలు 49

ఆన్మోఁ దారుపుగ త్తైపోౖడ లుచితవ్యాహారము ల్గుప్పికాం
త్వామోదం బొనకూర్చి రెల్ల జగముఁ హాళిం బిసాలించెద
తౌ౯ముద్వ్యావృతమై సుధాజలధిమగ్నంబో! సితద్వీపభూ
ధామంబో! స్ఫటికాలయాంతరపరివృత్తంబో! యనన్ దెల్లనై 50

సీ॥ వాడికూటముల మైవాడిన కోయల
దొరసానుల చెమర్లు దుడిచితుడిచి
పూచిన కలువపూవుల నుట్టిడి మరండ
ముల గంధముల మోచి వెలిచివెలిచి
యూ తేనియలఁ గ్రోలి యాడి పాడెడి తేంట్లు
ఝుంకారరుతి వెదజల్లిచల్లి
తఱిపివెన్నెలఁ దెగద్రావిన యలసచ
కోరకాంతల కెదఁ గూర్చికూర్చి

గీ॥ రెయివెలఁది చిన్ని యూర్పన బయిర దోలె
నప్పటికి వేగ గందర్పుఁ డతని సఖుఁడు
వింధ్యపరిసరముల దాటి వెళ్ళి రెంతొ
శారికాలాపముల దవ్వ సగముగాగ 51

కం॥ అటుల సశాంకుఁ డధిపుఁడు
పటువేగుఁడు పోయిపోయి వాసవదత్తా
కటకమునుఁ జేరి యటఁ బ్రా
కటవిభవము నామె నగరుఁ గదిసె మురియుచున్ 52

సీ॥ జనకయజ్ఞస్థానసమముగా దారోత్సు
కితరామమును నిధి కుతుకమునకు
జగముక న్బడుట సంజకు జోడు ఘుమఘుమ
వలచు తావుల ద్రవ్యములకు ఠావు
మానుష మటు లభిమానిత సురతంబు
సకలవిభ్రమముల జన్మభూమి
సంకేతనిలయంబు సౌందర్యమునకు నా
స్థానంబు శృంగారసారమునకు

గీ॥ నట్టి వాసవదత్తహర్మ్యాంతరమున
ననవరతదృప్యమానకృష్ణాగురువుల
పొగలు తఱికానితఱి మొగుల్ బొదలఁ జేయు
మురజనినదమ్ము నెమిళుల మూగఁ జేయు 53

సంతరళత్సుధాధవళ సాలము నాకస మంటు దాని నే
కాంతరసన్నివిష్టత దివౌకసు లా భవనమ్ము లందు సే
వింతురు పైడిముత్యముల పేరిట గారుడరత్నపద్మరా
గాంతరనీలరత్నములు నోచును వాసవదత్తనారయన్ 54

కం॥ అల మేడ నైన యంత
స్థల మొగవాకిళులయందుఁ దోరణమాలా
వళిఁ దారచ్ఛలమునఁ దా
రలు నెలకొనె నగరివారి రమణులఁ జూడన్॥ 55

కాచఘటాకృతుల్ తదుపకంఠనిలీన మయూరసంహతుల్
దోఁచెడు హర్మ్యభాగములతో నది పోల్చఁ బయిన్ జలత్ప్రతా
కాచయ మభ్రభూజమునఁ గల్గిన పువ్వుల గుత్తులో! యనన్
శ్రీచుళుకమ్ములై సురపురీఘనత న్నగుచున్నటుల్ దగన్ 56

సీ॥ మున్నీటిదరిపోలమ్ములు వోలె సుందరీ
పాదపరాగంబుఁ బడసె నెవ్వి
కపిశూర సమర ప్రకారకీలాల స్న
పిత కుంభకర్ణ సంభృతము లెవ్వి
ననిచి కుల్యాయమానకరిణులై క్రొత్త
దొరతలంపులతోడ దొరయు నెవ్వి
కర్పూర పూర సైకత నిషణ్ణరవాను
మీయమాన మరాళ మృదువు లెవ్వి

గీ॥ యెవ్వి సుపయోధరలో యెలయింతు లటుల
నట్టి నదు లొప్పు దాని యుపాంతసీమఁ
గన్నె లేడిపులుంగు జక్కవపులుంగు
లకుఁ దిమిరశంక నల్లకల్వపటి కూర్చు 57

సీ॥ ఘనసారఘుసృణచందనలవంగైలాసు
వాసనల్ నెఱపు ప్రవాహములును
మదవతీజఘనసంస్ఫాలనోచ్ఛ్వసితముల్
బిందువుల్ బడు తటవేదికలును

పడి దరిచెట్ల పూ ల్పలురంగులై స్వర్ణ
పట్టాంకములఁ గొట్టు భంగములును
మెయిమెయి నిదురించి మేలొ్కన్న సితకపో
తము లాడు దరిపటికముల శిలలఁ

గీ॥ గలిగి ప్రవహించు నిర్ఝరిణులకుఁ గెలనఁ
దనరునట్టిది వాసవదత్త యున్న
భవన మందుఁ బ్రవేశించె భవసుతప్ర
భావుఁ డా భావభవకేతు పార్థివుండు 58

గీ॥ అటఁ బ్రవేశించినంత నయ్యధిపునకు వి
నంబడియె నిట్లు జవ్వనుల్ సంబరమున
బ్రణయపేశలముగఁ బరస్పరముఁ జేరి
పదరికొనుచున్న చతురసంభాషణములు 59

సీ॥ ద్రవమాస కీ రీతి ద్రవమా! సకీ! చప
లా! పలాయనచపలోపమాన!
అలరుచే నలరుచేరులు జాఱఁ దిరుగు ని
య్యదియా! నను హసించు నలఘుశీల
సురయాన సుర యాన నరిగెదేమే! చెలీ!
సురకాంక్ష నాయ దాసురము నీది
పలుమరు బలు మరు గెలుచున ట్లడరెదే!
కలికారణము నీదు కలరవమ్ము

గీ॥ కలిక! కలికారణము నీదు కలవరమ్ము
లలిత! యేమే! ఖలా! మేఖలారవమ్ము
ముఖరముఖరము నై తోఁడు మొనసెఁ బోర
నీవు బలు మరుపోరె కాంక్షింతు వెప్పుడు 60

సీ॥ ఎలమి నెలమిఁ దారి! కులుకుచు వడి జారి
హా స్విసుమోపహారాళిఁ బడితె!
వడితిని కాని నీ వడిఁదిని కాని చో
బడుచుంటినే నేను పడుచునైన
వేమారు వే మారు విరిములుకులకు గురి
యైతివి కదవె! యనంగ లేఖ!
దోఁచినను బైకిఁ దోఁపగా నీవి హా
రము లహో! నీ విహారములఁ దెలిపె

గీ॥ నో సతీ! నీ సతీవ్రత ముత్తమంబు
నీ హృదయవీథిఁ బురుషుఁ డుండె నటుఁ గాని
యెడల నెడలఁగఁ జేయునే! నుడి నిటు శత
ధార శతధారసమమునుఁ ద్వన్ముఖంబు 61

సీ॥ కందమ్ము లువిద! నీ కందమ్ములై యుండ
సరియెట్లు మోముతోఁ జందురునకు
లలనా! చటులచటులంపటపరిజనా!
కదళికా! కదళికాంగణముఁ జిమ్ము
మేమె కల్పించున ట్లీక్షణ మీక్షణ
మీలితవై చెలీ! యాలసింతె?
సంజీవనికరా! జీవంజీవమిథునమ్ము
లకు మరీచికిసాలనికర మిడితి

గీ॥ నోహా! కేరళికే! రళితోరుజలద
ఖండమునుఁ గరకాకరకాలరుచిని
నిండు విరిసిన మల్లెపూదండ లొప్పు
నీదు చికురకలాపమ్ము బాదరించె 62

సీ॥ కర్పూరధూళిచేఁ గర్పూరికా! కుచ
భారమ్ము పవరింతే? పాంసులముగ
నో కురంగిక! కురంగోత్కరమ్మునకుఁ దృ
ణాంకురమ్ములఁ బ్రోది నాచరింపు
సహకారమంజరీ! సహకారసురభిళ
వ్యజనవాయువుల శ్రమాంబు వుడుపు
మకరికా! మకరాంకముకుర వే! తమ్మితూం
డ్లర్పింపు కోదమరాయంచగమికి
గీ॥ కుంతళికా! కుంతలపరిష్క్రియాంత! చెవులఁ
గూరుపవా! పురగోపురగోచరమ్ము
లైన సంగీతనినదమ్ము లళికపట్ట
మందు శశిలేఖ! శశిలేఖ నలవరింపు 63

సీ॥ కాంచనికా నీవు కాంచనమంటపాం
తరమునఁ జల్లు కస్తురికలాపి
కాశ్మీరరసము నిగారంబుగఁ బ్రవాళి
కరా! యల్కవె! ప్రవాళకాననంబు
నలదవేమె! తమాలికా! గంధసారంబు
భవనవాటము సముద్భాసితముగఁ
గడుఁ బల్లవించెనే! కపటంపుఁగేదంగి
వని పల్లవికరా! కప్రంపుదుమున
గీ॥ నోలిఁగుచలికుచప్రహారోద్ధురముగ
నిరతసురతములను నీవు నెఱపు నిమ్మ
నెడఁద నెడఁ దగు మరుబాధ సడలఁదలఁచి
పదరు నెవ్వానిఁ బెడబాసి వనరెదోసి? 64

కం॥ లలి తగ లలితగతులఁ దుల
తులకింపని నీ నెఱారతుల దయితుఁడు లోఁ
దలఁపఁడె! మహోత్సవములుగఁ
బులుకడిగిన ముత్తె మటుల బొలుతున్న పొలతీ! 65

కం॥ క్షణ దేహుని ఫలితజనే
క్షణ దేహుని నరయఁబోని సంగతి నీలో
చనలోచనములు తెల్పెడి
ననుభవమున నన్నుఁ గొన్న యన్నులమిన్నా! 66

నవని శానఖరనఖరకురుతపుల్
జవులతో రజని స్మరజని దులుపు
న్నవత నీ ప్రియుఁడు నవయకె! తరుణీ!
యివురుబోణి! యతఁ డిఁకఁ దడయఁ డెటుల్ 67

గీ॥ మధుమదారుణమాళవీమణికపోల
లలితకోమలలోలదళత లతకును
నీకు భిద లేమి బింబోష్ఠనిరత మళిని
మదనమాలిని! మాలిని! గదుమఁ దగునె? 68

సీ॥ తరళికి! తరళింపదా! యగురుపొగఁ గి
శోర మరయవె! కిశోరి! క్రన్న
శ్రద్ధతోఁ గేదంగిచపరమ్ముకనందు సం
కేతింపవే! కేతకికరా! యిఁకను
మాతంగి! కడుగవే! మాతంగశిశువు శ్రుం
గారమంజరికి శృంగారరచన
మలయుదే? గునగున మంజీరములు మ్రోయ
మదనమంజరి! లతామండపమున

గీ॥ మదనలేఖ! లిఖింపవే! మదనలేఖ
మలయపవనునకు విలాసములను నేర్ప
వే! విలాసవతీ! కేకిపృథుకమునకు
ననుచు దాసికలున్ బోటు లాడుచుండ 69

గీ॥ వినుచు మకరందుతోడ న వ్విభువతంసు
డందు లోఁజక్కి నందంద యరుగు దేరి
కాంచె దిక్సింధురకరేణుగతి ననుపమ
యైన వాసవదత్త నుదాత్త నచట 70

శ్రీముదిగొండవంశపుకరీరము సత్కవిమల్లికార్జున
స్వామికి నాగమాంబకుఁ బొసంగిన సంతు మనస్వికోకిలా
రామము వీరభద్రుఁ డిల వ్రాసిన వాసవదత్త యన్న మా
ధ్వీమధుర స్రవంతి రసదివ్యచతుర్థతరంగ మియ్యదే 71

# పంచమ తరంగము

*

సీ॥ గణనీయ హస్త శ్రవణములు తనరార
జ్యోతిఃకళను బోలు సుందరాంగి
యుద్యోతకరరూప మురఁ దర్క-విద్య కె
న జగదుద్యోతనేనరుచితుల్య
ఛందోవిచితిఁ బో ల్లసత్తనుమధ్య ద్వి
జకులస్థితినిఁ బోలు చారుచరణ
ఆనందధాత్రి వేదాంతవిద్య వలె స
త్క-విత వోలిక నలంకారయుక్త
గీ॥ వ్యాకృతిని భారతమును రామాయణమునుఁ
బోలుచు సరక్తపాదంబు ముగ్ధపర్వ
మధురసుందరకాండసంభావనీయ
మైన జంఘాయుగముఁ గల్గు నలరుఁబోణి 1
సీ॥ గురుకళత్రతఁ దారసరి ప్రియంగుశ్యామ
చెలి వోలెఁ బ్రియదర్శన లలితాస్య
సతమాలపత్రి వేల తెలుఁగు నర్మద
రేవానదిం బోలు పావనాంగి
బ్రహ్మదత్తుని రాణి భాతి సోమప్రభ
సునితంబ వింధ్యలక్ష్మి నోరయునది
పిడికిఁట నిముడు నెన్నడుమున శతకోటి
మూర్తి నుద్దించును ముద్దుగుమ్మ
గీ॥ యశ్వతరు సుత వోని మదాలస భువ
నాతిశాయిశృంగారకళాతిరీట
తరళితాకార వాసవదత్త తోఁచెఁ
గనకయంత్రిపంజర కేళికాశుకాభ 2

గీ॥ అట్టి వాసవదత్తఁ గన్నారఁ గోరి
సొగసె నా రాజు నామెయు సొమ్మసిల్లె
నట్టి ప్రియుఁ జూచి యుభయుల కధికమోహ
రసము కన్నెగఁదట్టి దిగ్భ్రాంతిఁ గొలుప 3

అంత మరందుఁడుం జెలులు నాఁడట సేదలఁ దేర్ప దేఱి రా
కాంతుఁడుఁ గాంతయుఁ గలను గన్నది విన్నది కాన వాని న
య్యంతి మనోజకేతునిగ నెంచి సగంబగు సిగ్గుఁ దొట్రు పెఁ
సంతసముఁ మెలింగొనఁగ జాణగళావతి నెంచి యారయఁ 4

ఆ రాకూఁతురి ప్రాణ మాఱవది యా నాఁబోఁటి లగ్గైన స
త్కారంబుఁ బచరించి మోదపడు నా ధన్వీంద్రుతోఁ బల్కెన
య్యా! రాజాత్మజ మిమ్ముఁ గోరి భవదీయంబౌ వియోగంబు దు
ర్భారంబై పడుపాట్లు విన్నపముక్లుప్తం బియ్యదో రాణ్మణీ! 5

వే నాల్కల్ గల దిట్ట చెప్పవిధియుఁ విఁ బత్రముంబూనియా
దోనిధ్యాయతపాత్రిమందలి సిరాతోఁ గల్పముల్ వ్రాయుచో
నోనో సొంతము కాదొ మాచెలియ దైన్యావస్థపుంగూర్పు భూ
జానీ! మీ సుఖమేది! యీమెకయి రాజ్యంబేది యేతేరరో 6

బాధిత యయ్యె నీమె కడు వాకొననేల ప్రభుండు తండ్రి యీ
యోధితయవ్వనఁ సుత ని కెంట నిటుంచఁ దలంకి బల్కె వి
ద్యాధరచక్రవర్తిమలయధ్వజు పట్టికిఁ బుష్పకేతుసం
జ్ఞాధరుఁడైనవాని కొసగం దలపెట్టె వివాహ మెల్లియే 7

కావున మీరు వచ్చుటకుఁ గా నిల శారిక నంపినార మ
య్యా! వెరవయ్యె మిమ్ముఁ బడయం జెలికాశ్రయమాశ్రయాశువన్
భావన మాసె ధన్యను భవత్ప్రియ నెట్టు లనుగ్రహింతురో!
మీవశ మింక నన్నిఁటను మీరె ప్రమాణము మాకు నిమెకుఁ 8

అన విని యవ్విభుండు ప్రణయప్రమదమ్మను వెల్లువెత్తినీ
ర్గనియలలందు నీదిన తెఱంగున నుబ్బుచు భీతభీతుఁడ
ట్లునుఁ గనుపించి ప్రేయసినుడుల్ తన యిచ్ఛకు నచ్చు మంతన
మ్మున సఖునిఁ మరందుఁబురము న్వెడనట్లుగ డించి వార్తకై 9

సీ॥ నాగమ్ము వోని సదాగత్యభిముఖంబు
హంసంబు వలె మానసాభిగతియు
వింధ్యాద్రివిపినమ్ము వెరవున శ్రీవృక్ష
లాంఛితమ్మును గండలాలితమ్ము
ముయ్యేటిసైకతమ్మును బోలి ముక్తివ
హము రవ మాడ్కి నింద్రాయుధంబు
స్కంధరమ్యము వనస్పతినిభంబును నై "మ
నోజా"ఖ్య మై యొప్పు వాజివరము

గీ. కలుగ వాసవదత్తతోఁ గలసి యశ్వ
మెక్కి పురి నిర్గమించి య య్యుక్కడీడు
రెండుగ్రోసుల ద వ్వేగి నిండుకొన్న
నక్కలెమ్ములుఁ గల మసనమ్ము డాసె. 10

సీ॥ శూలికి వ్రేలెఁ గపాలశివాభూతి
భుజగరాజావృతి బూరటిల్లఁ
బీనుంగుమంటలఁ బెటిలి పెఠీలని
నృకరోటిటంకారనినద మెగయ
మనుజమాంసముఁ దిన మరగి కంకములు ని
శ్శంక సంకులముగ సంచరింపఁ
బుంజితోల్కాముఖముఖసముజ్జ్వలితజ్వా
లనజటిలజ్వాల లినుమడింప
గీ॥ సగము చూఁడిన కోడుల మిగులు సిమసి
మాయమానవసావ్రిస మాయితముగ
వికటకటలాలసీచటులకటపూత
నల మహోత్తాలురవము బెగ్గిలము కాగ 11

సీ॥ తన నరేంద్రపరీవృతత్వంబు మండల
కృతసేవ చక్రవర్తితనుఁ జాటఁ
ద్రిదివస్థితి బలారివృతిఁ దెల్ప భీభత్స
ముగఁ బెద్దయీఁగలు మూఁగి మొరయఁ
బ్రేవుల గ్రుచ్చి పుట్టెల దండ లూని ఫా
కినులు పీన్గలఁ బంచికొనుట నార్వ
దగరజంటలు పెంట్లిఁ దడినరాల్ శుభసూత్ర
తతిగఁ జితాగ్నిఁ బ్రదక్షిణింపఁ
గీ॥ గొఱత నిడి ముక్కుచెవులనుఁ గోయఁ దొంగ
లకుఁ దొరఁగు నల్లఁ జేకపాలములఁ బట్టి
యెవ్వర దయ్యాలు దండకాటవి వలె సక
బంధమై యా యొలికిమిట్ట భయముఁ గొలుపు 12

గీ. ఆ శ్మశానప్రదేశమ్ము నతఁడు దాఁటి
వీఁక నశ్వమ్ము బఱపి యనేకయోజ
నశతపథమునఁ బోయి వింధ్యనగకాన
నాంతరమ్మునఁ జొచ్చె నిరంతరమున 13

సీ. ప్రళయకాలమున కర్కచయాప్త మై ప్రరూ
ఢార్జునం బై భారతాజిమొనకు
స్వచ్ఛందకౌశికపహ మై సుధర్మకు
ధాత్రీధృతిఁ బసితనమునకును
నాగరాజ్యమున కనంతమూలమ్ము నై
యమృతజన్మమున దుగ్ధాంబునిధికి
నిష్పన్నసాహస్ర నేత్రోంచితేంద్రాణి
నై పులోముని యన్వయంబునకును
గీ. వ్యక్తగణకారికము శూరపాలు గతికి
నందితాశోకసరళపున్నాగ మై సు
జనుల కలిమికి శ్రీఫలసహిత మై గు
ణాఢ్యసేవకు నెనవచ్చు నడవి యద్ది. 14

సీ. ఒకచోట రాఘవాత్మకు సరిదూగ వై
దేహీమయమ్ముగాఁ దేజరిల్లు
నొకవంక విష్ణుమూర్తికి మారుగా నవ
రాజితాంచితరూపరాజి నొప్పు
నొకవంక వాల్మీకిసుకవితామణి వోలె
నిక్ష్వాకువంశాభివృద్ధి నెసఁగు
నొకవైపు ముత్తైదువకుఁ బోలె సిందూర
తిలకపరివాళముల్ గలుగ దనరు
గీ. ద్రోణశకునియుతంబు నర్జునశరపరి
వారితసధార్తరాష్ట్రము వలదులూక
మడవి యది కురుసేన య ట్లడరు ధృతప
లాశవైభవమున నద్ది లంక కుద్ది 15

సీ. అమ్లానజాతిసమాలంకృతం బయ్యు
నద్ది విరుద్ధవంశాన్వితంబు
నయ్యది షట్పదవ్యాప్త మైనను ద్విప
దానాకులమ్ముగాఁ దగును నెపుడు
ద్విజకులపరివరసంభృత మయ్యు నయ్యది
నకులీనవంశ మౌట కడు వింత
దర్శితాభయ మయ్యుఁ దా విభీషణ మది
హితపథ్య మయ్యుఁ బరివృద్ధగుల్మ
గీ. మట్టి యడవిని వా ర్నిల్చి రంత రాత్రి
తత్సుఖము సుప్తిఁ గొని పోయెఁ దార లుండె
నిరులవల వేయ నదనుజాలరికిఁ జిక్క-
చాని బేడిసలో! నభస్సరసిజములు 16

తేనియఁ లాని ప్రమోయు నేలదేటుల కంఠము విప్పియొంపుదిం
పొ నళినీనికుంజశరయంత్రముపై శతపత్రపుస్తకం
బూని స్వధర్మముఁ జదువుచుండెనో కో! యరుణప్రభాతసం
ధ్యానిబిడాంశుకుండు కమలాకరభిక్షువు సంవికాసియై 17
ఘనఘటమానపత్రపుటకాండము లై మధుమద్రజంపు రొం
పినిఁ గల కల్వపూమడుగు పేరిమడిన్ దరి యున్న రైతు చ
ల్లిన తిమిరంపు విత్తులో! మిళిందము లయ్యెడ నిందుబింబ మొ
ప్పెను రజనీమహాతరుణి వేఁకువ రోఁకఁట దంచు రోలనన్ 18

గీ. అయ్యులూఖలమందలి యడు గనఁ గఁ
జందురుని కందు మిగిలె నా సమయమందు
దంపులోఁ జింది పడినవి తండులములో!
నాఁగ మిఁనుకుచునుండెఁ దారాగణంబు 19

క. అల యంబర మను ముంగిలిఁ
గల తారాతండులములకై చూడాచ
క్రలసదరుణముఖమై ప
వ లనెడు కుక్కుటము వడిగ వచ్చుచునుండెన్ 20

నిండురజంపు కుమ్మపొడి నిండిన తేఁటిపొగన్ వెలార్చు ను
ద్దండము పుండరీక మను గట్టపు దూపము వెట్టె సామికిన్
గాండజినీతపస్విని దినప్లవగేంద్రుఁడు మిన్నుమ్రానకడల్
మండలనెక్కియూపె భసుమమ్ములుఁ జంద్రఫలమ్ము రాలగా 21

గీ॥ నను మొదటఁ గూడి వన్నె కెక్కిన యితండు
వారుణీసంగమమ్మునఁ బతితుఁ డయ్యె
ద్విజపతి యటంచు హసియింపఁ దివిరె ననఁగ
ప్రాగ్రమణి తాల్చె ముఖమునఁ బొటలమ్ము 22

సీ॥ ఉదయధరాధర ప్రోద్దండ లేలిహా
నస్వామిపడగ రత్న మురళించెఁ
ప్రాచీకుమారీమణీచారునిటలాన
దొరయు కుంకుమబొట్టు తుఱఁగలించె
నహారాఖ్య నొప్పు విద్యాధరమహాను
భావుని రసలింగభరము మెఱసెఁ
దూర్పుటొయ్యారిచేతులఁ గుల్కు గుండ్రని
బంగారు ముకురమ్ము ప్రస్ఫురించె
గీ॥ వేలుపుఱ్ దొరకడ యన్న వెలఁదిమిన్న
సంజక్రొంబట్టు మొలనూలునం జకచ్చు
కల సువర్ణదీనారచక్రము రహించె
ననఁ దనికె దినకరబింబ మవతరించి 23

సీ॥ ముజ్జగమ్ముల మేలు మొనయింపఁ దమకించు
బిసరుహాప్తుని రాగరసము లేమొ!
పొడుపుఁగుబ్బలిగుబ్బకడ నూరు గైరిక
నిర్ఝరిణుల నీటి నిట్ట లేమొ!
పఱువెత్తు తేజీల యొఱపుగట్టెల బ్రద్ద
లౌ తమ్మికెంపుల జోతు లేమొ!
యుదయభూమిధరంపు దుదిఁ బూచిన జపాల
తాంతమ్ము లీనెడు కాంతు లేమొ!
గీ. అరుణహరిఖరనఖరహతాంధకార
వారణాధిపు రుధిరంపు ధార లేమొ!
ఘుసృణమసృణమ్ము లై విభావసుని ప్రథమ
కిరణములు శోణరించ్ఛోళిఁ దుఱగలించె. 24

సీ. వినుఁబ్రోలి తొలిగవనున నిండుహొనుకుండ
  సంజలేఁదీవఁ బుష్ప మది యొకటై
కాల్చిన యినుపబుంగకు జోడు చదలఁ జే
  జేదారరాచెట్టుచిగురుటాకు
బలు కెంపుఁబట్టుండ ప్రాగద్రిధాతురా
  గారుణదిక్సింధురాంఘ్రివీప్స
రక్తమండలుఁడు తారలఁ గల్వల గ్రహింపఁ
  జూచె నాఁ గరములఁ జాచువాఁడు
గీ. తారకాభ హరింపఁ గుమారనిభుఁడు
ఛాయఁ గోరుట నధ్వగసముఁడు గోప
తిత్వమున హరి, హరి కెన తృప్తపద్ముఁ
డిరుల తెక్కలికాఁడు భాస్కరుఁడు వొడిచె. 25

సీ. అల కురుక్షేత్రమ్ములందు మహాభార
  తీయరక్తమ్ముల తీండ్రఁ గురిసి
శాక్యాశ్రమీయవృక్షముల శాఖాసక్త
  కాషాయశాటీవికాస ముంచి
జలదమ్ములం దింద్రవిలు కాంతు లాలికించి
  కర్కంధువుల ఫలగరిమ నించి
ధ్వజపటమ్ములఁ గుసుంబాపూఁతఁ బూసి మం
  జిటిసిస్తు సూరెమ స్త్రీల కెత్తి
గీ. అవసరమహానటుని తోపుజవనిక యన
నాకసపుమేడయంగణం బలుకఁబడిన
పీతనద్రవ మనఁ గాసె లేఁతయెండ
బాలవిద్రుమఖండ శోభావిభాసి 26

అంత నొకింతలోనె మిహిరాంశువు లుష్ణములయ్యెఁ జాటువృ
త్తాంతవిలోలకోకపరితాపహరమ్ములు కాగ నేమొ! భా
స్వంతుని డాలఁ బొర్లుటనొ! వహ్నిప్రతాపములోనఁ జేరనో !
యంతట రాజునుం జెలియ యయ్యెడవిన్ దిగియావులించుచున్

వందలక్రోశముల్ గడచి వచ్చుట నాకట రేయి నిద్రలే
మిన్ దమ మేన్బడల్పడఁగ మెల్లని పయ్యెర నూఁగు పూలతా
విన్ దిరుగాడు తేంట్ల రుతి వీలుగ నా పొదరింటిలోన ని
ష్పందనిజాంగులై ప్రసులభంబగు నిద్దురబోయి రవ్వనిన్ 28

వణిజుండట్లుఁ బ్రసారితాంబరుఁడు కల్పద్రుమాశాప్రసా
ధనచంగుండునుఁ గాష్ఠదీపనముకై తా నోట దావస్థితిన్
మినుమధ్యమ్మున వెట్టవెల్గు వెలుఁగన్ మేలెంచి కందర్పు డెం
దు నెటన్ వాసవదత్త కన్పడమి కెంతో చిత్రమున్ జింతనై 29

తిరిగెన్ బ్రేయసిఁ బొంచె నట్టిటులుఁ భృథ్వీజాగ్రశాఖాలతాం
తరకూపాధరదిగ్విదిక్తటములన్ బ్రమాన్జిబులన్ రాశిగాఁ
బలిపో నెండిన యాకులన్ వెదకె యే భాగమ్మునం దాతఁడ
త్తరుణిన్ గానక వేసరిల్లియటుశోకాక్రాంతుఁడై కూయిడెన్ 30

పరిహాసమ్మున కెందొ డాఁగితె? సఖీ! ప్రాణప్రియా! రావె! నీ
కొఱకై నా పడుకష్టపాటెఱుఁగవా కోమలీ! యో మరందా! సుహృ
ద్వర! నీవేనియు దైవవంచితుని నన్ దర్శింప రావో! మదా
చరితం బెట్టిదొ! పూర్వదుష్కృతికటా! సంధించె నీకష్టమున్ 31

సీ॥ కాలగతికిఁ దప్పి కడచనరా దహో!
విధివిపాకం బెంత! విడ్వరంబు
గ్రహకటాక్షప్రసారం బింత కటువె! క
టా! చెడ్డకలల కియ్యదియ! ఫలము
బీరువోవునె! పెద్దవారి దీవన లక్క
టా! దుశ్శకునసార మలమె నిటులఁ
గురుజనమ్ముల కుపచరియింపనో! యగ్ని
హోత్రు నుపాసింపనోకొ! సరిగ
గీ॥ శరణనెడి వారి నోమనో! సురభులను వ
లగాననో! కోలుపోవనేల? సతి నిటుల
నెపుడుఁ గాఁదగు వానికి నెవ్వఁడే న
గోచరుండౌనె! మనువెట్లు! కొమ్మ విడచి 32

క॥ చెలిఁ దలఁచి రేలుఁ బవలున్
విలపించుచు నిటుల భూమివిభుఁడు కుడిదెసన్
గల యడవిం బడి చనుచున్
జలనిధికచ్ఛంపు దరి వనమ్మునఁ జేరెన్ 33

కూఁకటిమూఁగపిట్ట లెసఁ గ్రోల్చెడి సుందరసుందరీలతా
నీకకుడుంగముల్ నెలలు నిండినవిం బసవించి యున్నవి
న్మ్రాఁకలు కోసి పెట్టిరిరు పోదుముల న్మొగకట్టు తోట్లలై
మ్రాఁకులుఁదామెకూయునదిరా! యనిపించునుఁదద్వనమ్మునన్

సీ. పొగడగన్నేర్లు కానుగుప్రబ్బవటివేళ్ళఁ
దమ్మిపచ్చికలుఁ గ్రొత్తన నెసంగఁ
బ్రచురనిర్మితబహుపర్ణశాలలఁ గొండ
మల్లెల లత లల్లిబిల్లిఁగొనఁగఁ
గొండద్రుమచ్ఛాలు మధుకోశముల్ పిండి పెఁ
జ్ఞౌద్రవర్షమున వృక్షములఁ దడుపఁ
"హుహూహుహూ" యని వానకోయిలల్ వాగొడ్డు
పొదల బిట్టారజమ్ములనుఁ గెరల
గీ. నాగకేసరకేసరనారికేళ
కేతకీతాలరాజతాలీతమాల
బీజపూరార్కపర్ణజంబీరతరులు
పెరిఁగి కడుఁ గిఱ్ఱుమని పరస్పరము నొఱయ 35

సీ. ఘనసారపున్నాగకంకేళికోవిదా
రముల గుల్మము లంధతమస మొలయ
మల్లెలు గిఱకతాళ్ళల్లొనేరేళ్ళు చీ
మల దూరనీనట్టు లలమికొనఁగఁ
దీయమామిడినవల్ తినుచు సోత్కంఠముల్
కలకంఠములు కలకలనఁ గూయఁ
గోరకమ్ములఁ దగి కురవకమ్ములు పుల్క
రించిన వనఁగ శోభించి తనరఁ
గీ॥ బవనసంవాహితానేకపనసవిటపి
విటపమై కుక్కుటకుటుంబపటలవాసి
తోత్కటకుటమ్మునై యల యుదధికచ్ఛ
సన్నివేశప్రదేశమ్ము వన్నెమిగులు 36

సీ॥ తొవరుటశోకంపుఁ జివురుడాలు పదిచె
ఱంగుల కెజ్జని రంగుఁ బూయ
విరియఁ బూచిన పొన్నపరి పరిసర మెల్ల
ధూసరితముగఁ బూదుమ్ము నెఱప
ననదుమారమునఁ బింజరము లౌ వావిళ్ళ
రజ్యమానాళికమ్రరవ మెసఁగ
రాపుప్వునెత్తావి దీపించు శిలలఁ గుం
దేళ్లు సౌఖ్యమ్ముగా నిద్దురింప
గీ॥ రేల చా ల్పంపెగల తెగ పృథుమధూక
ములుఁ గదంబకదంబకమ్ములునుఁ గొండ
గోఁగులు లవంగభూజముల్ కొనలు సాఁగి
పొదలఁ బొదల లతల్ పెను పొదలఁ గ్రమ్మ 37

సీ॥ కలివావిళుల యూడకంతల నుడుముల
బుడుతలు విస్రబ్ధముగ మెలంగ
ధవళరోమమ్ము మెత్తని తోలు నొప్పు మృ
గమ్ము లెం దాఁక లేక చరియింప
నవరమెకమ్ములు సహకారవని నెమ
ర్పఁగ మదిమది ముంగిసలును మలయ
సహచరీసహచరణహృషితచుంచుర
చంచుచకోరముల్ సంచరింప
గీ॥ భృంగరాజమ్ము లనెడి పులుంగుల నెడి
పెంటు లుత్కంఠఁ జవిఁ జూచు వితతవేత్ర
లతలు పెనగొన్న యులిమిరులఁ దరులందుఁ
గందముల భృంగబృందమ్ము దందడింప 38

గీ॥ గండకషణమ్ములచే మదకాండకలన
నలఁపువారిన ముచికుందము లను చెట్ల
కాండము లచట నుండు వేదండములకు
నెగడు చెక్కుల పెండీట బగటుచుండ 39

గీ. చటకసంచార్యమాణవాచాలచటుల
చాటుకైరమ్ము లన నేర్వఁ జాటువులనుఁ
గరము దరిఁ జేరి కిన్నరీగణము పాడ
నల్లచారలు కల దుప్పు లుల్లసిల్ల 40

గీ॥ శ్రవణహారిసనీడపర్వతనితంబ
నిర్ఝరనినాదముల వేడ్క నిగుడ వినుచు
నిదురముదమున మసలిక యొదవు కరుల
కర్ణతాళానకధ్వని క్రిందుకొనఁగ 41

పసుపుందుంపల నెత్తగాఁ దివిరి త్రివ్వన్ దద్రిసం బుట్టి పైఁ
గోసర నుమ్మట్టెలు రజ్యమానములుగా ఘుర్ఘుర్ధ్వనిం బోత్రిపో
తసమూహమ్ము చరింప నేచి గురివెందల్ క్రుమ్ముకొన్నట్టి కుం
జసమృద్ధమ్ములజాహకమ్ములనువొందన్ దాఁచుకో దేహముల్ 42

గీ. దంశదంశనమునఁ గుపితమ్ములైన
క్రోఁతిపిల్ల లలిగి కలిగొట్టుచెట్టు
లందుఁ బర్ణపుటమ్ముల నణఁగి మణఁగి
యున్న పురుఁగుల నఱచేత నూఁచి చఱవ 43

గీ. క్రిమ్ము హారులు భిదురశిఖరఖరనఖర
దళితకుంభిమదచ్ఛురితమ్ములైన
కేసరభరమ్ము లెగుర లంఘింప నొప్పె
నవ్వనమ్మునఁ గొంతద వ్వరిగి యతఁడు 44

సీ. జలదేవతకు మేని కలపమ్ముల విశేష
ములో! సుధాసహాచరీమూర్తు లేమొ!
వారుణీజయపతాకా రాజియో! శేష
సంతాన నిర్మోకసంఘ మేమొ!
రమకు లీలాతర్పణముల ధారాగణం
బో! చంద్రికలకుఁ దోఁబుట్టు లేమొ!
పీయూషకరమండలీయాత్తపరిశేష
పరమాణువుల గుత్తిపఱపు లేమొ!
గీ. యన నురు నురుంగు తెట్టెలు పాంతకాంత
తనుఁ బెనుపఁ బెల్లు నుద్దాడు తరఁగ లాటుఁ
బోటు నై తాండవోద్దండభుజము లాచ్చి
ఖండపరశు విడంబించు కడలిఁ గాంచె 45

సీ. పక్షభృత్ క్షితిధరభరితకుక్షినిఁ గల్గి
శరణార్థులనుఁ బ్రోచు కరుణ గలది
తిమితిమింగిలకులస్థిమితత్వనిలయంబు
నభిజాతమణుల రత్నాకరంబు
వారిజాతముఖోత్థపారిజాతము సగ
రుని కుమారకులు త్రవ్విన బిలమ్ము
శకునులఁ దిన వడి జరుగు నక్రముల తా
వు కరిమకరములు పొరలు తావు
గీ. నిర్మలజలమ్ముల కరళ్లు నింగి కెగయఁ
చిందు బొట్ల వైమానికశ్రేణి యెల్ల
చిచ్చువడి ముత్తియము లౌ! నా మెచ్చి చూడ
నడరు నా శ్రీకరంబు నీరాకరంబు 46

సీ॥ వారినాగములు శూత్కారింపఁ బెనుసామ
జముల బంధించు సజ్జార మనఁగ
మీనకర్కాటకస్థాన మై రాశి నా
నిలను రెండవ మహాబిల మనంగ
లవణసంభూతిస్థలం బై భయంకర
కుంభీనసీగర్భగోళ మనఁగ
నచ్యుతస్థితియు గోత్రాశ్రియస్థితియును
సమకూడి యోగ్యాసి చరిత మనఁగ
గీ॥ నొనరి మారుతమర్మరితోరుతరళ
తాళదళశబ్దచకితపాథఃప్రజామి
థునమృదితపులినమునఁ బచ్చ నగు లేఁత
నాచు చదునుగఁ దగ నొప్పు నారరాశి 47

సీ॥ అంభోజచారుమత్స్యాభిశోభితము వి
శ్వామిత్ర తనుజన్మవర్గసమము
ధృతమహాపాత్రంబు నృపవంశభంగి స
త్ప్రభుతవో ల్లజ్జనక్రమకరంబు
శబ్దశాస్త్రమునకు సంబంధ మై స్త్రీన
దీకృత్యబహుళతాధిష్ఠితంబు
హావణించి నటుల ముక్తాలంకృతము విర
హి వలె గందఁపునీటి తవులుఁ గలది
గీ॥ విద్రుమాంకూరకోటివిభిన్నముఖము
లౌట ఖిన్నము లై యున్న యచటి శంఖ
నఖముఖరములు ఖరము లౌ శిఖరముల లి
ఖించు తటరేఖతో సందడించు జలధి 48

సీ॥ సుర గండరించిన యిర వయ్యె నసురకు
నిర వయ్యె నిలువ నా శరధిరాజు
తొడరి కోపించిన తోయమ్ము సగ్గర
తోయాప్లుతముఖుండు తోయరాశి
వృద్ధత్వ మున్న నెవ్వేళను సుందరీ
వృత మైన యుపకంఠ మెసఁగు జడధి
కాలకూటమ్ము నిర్మాలించి రెన్నఁడో!
యైన నెల్లపుడు విషాకరుండు
గీ॥ నర్మదానుగతిన్ విలాసోర్మి యుదధి
గాలిఁ గబురంపఁ గదళీవనాళి మాతు
లుంగలవలుల నేలాలవంగములనుఁ
బూన్చునో! ఘుమఘుమలాడు పొంగువాడు 49

సీ॥ ఆ రాము సేతువే యాలాన మై దరి
పోవడతావి యను సురవలపుఁ గని
భంగమ్ము లను ముడివడు నాటి బొమలును
గర్జితం బనెడి యాక్రందనమ్ము
సుడులచే నానాటి సుడివడుటయు ఫేన
ముల కల్మి నప్పటి మూర్ఛ తెరలు
నాగనిశ్వాససంఘుస్వరూపమునఁ ద
దురుబాధ వెలిబుచ్చుచున్న విధముఁ
గీ॥ గలిగి యెన్నఁడో తరికొండ కలచఁ బడిన
పాటుఁ గోల్కొన దయ్యె దీనాటి కనఁగ
మొఱయునుఁ బయోధి సలిలమ్ము గరుడవంశ
పతత్రిరథకలిలమ్ముగాఁ బ్రిస్తరింప 50

ఆ లీలన్ దగు నబ్ధిఁ గాంచి యతఁ డి ట్లన్యోఁదొడంగెన్ భళీ!
మేలే వాటిలెఁ గీడు సేయు విధిచే మీనాకరం బియ్యదే
నాలోకింపఁ దొఱంగుదున్ దను వభాగ్యం బేల! యీ జన్మలో
శ్రీలావణ్యపయోధి నా చెలియ నీక్షింపంగ లేనేకదా ! 51

గీ. ఆత్మహత్య యనామయు లైన వారి
కొప్పదని రార్యు లైననుఁ దప్పు దిపుడు
సార మిసుమంత లేని సంసారజడధి
నొ ప్పొకటి యున్నె ! పెద్దలే తప్పి చనరె 52

గీ॥ పరసతీదోహాళి భుజంగభావ మందె
"సర్పసర్ప" యటంచుఁ దా సర్ప మయ్యె
నహుషసమ్రాట్టు, యుద్ధంపు నడతఁ దప్పి
యాడెను యుధిష్ఠిరుఁ డసత్యమునుఁ దానె 53

సీ॥ గురు భార్యతోఁ బోయెఁ గొంకడు ద్విజరాజు
కవిచేత నభిభూతిఁ గాంచె నలుఁడు
బ్రహ్మస్వమున కాసపడి చెడె బుధసూతి
స్మృతిఁదప్పి తొండ య్యె మిడికె నృగుఁడు
పంచత్వ మొందె గోబ్రాహ్మణపీడచే
కార్తవీర్యుఁడు వేయి కరము లూడి
వనమున నేడ్చె శంతను వతివ్యసన మై
యబల య్యె సుద్యుమ్నుఁ డంగ లార్చె

గీ॥ నశ్వతరపుత్రినిన్ గువలాశ్వుఁ డొందె
సోమకుని జంతువధ జనస్తోమ మెఱుఁగు
రాక్షసాచార్య కన్యాకరగ్రహమున
శాపకూపస్థుఁడు యయాతి చక్రవర్తి 54

ఉరలెన్ బంక్తిరథాసువుల్ మిగుల రామోన్మాదమై మిత్రుకూఁ
తురుకై విక్లబుఁ డయ్యె సంవరణుఁ డెంతో కుత్సితుండయ్యెము
న్బురుకుత్సుం డిటు లెందరో ఘనులు నొప్పాల్ తప్పిలం చెంచకె
ల్లరు సర్వక్రియ లుర్విగా సలుప నేలా! నేను శంకించుటల్ 55

క. అనుచుఁ బ్రియురాలిఁ దడవుచుఁ
గొనకొని కందర్పకేతు కొంకక పులిన
మ్ముననుఁ గడచి యంచువెల్లువ
ను నడచి విషరాశిలోననున్ జొరఁబడినన్ 56

గీ. కచ్ఛపమ్ము లనిచ్ఛముల్ గా జనె నభ
యంకరములుగ మకరము లడఁగె శింశు
మారము లమారములు గాగ మాటె గ్రాహ
ములును సానుగ్రహమ్ములై మూలకొదిఁగె 57

అక్షుద్రమ్ములుగాఁ గనంబడియె క్షుద్రాండమ్ము లంత న్నృపా
ధ్యక్షుం డందునఁ దానమాడి ముని దేహమ్ము న్విసర్జింపఁబో
నక్షీణధ్వని మింట వించె నశరీరాలాపముల్ "వత్స! నీ
దీక్ష న్మానుమలంతి కాలముననింతిన్ గాంతు సౌఖ్యమ్ముగా" 58

క. అని వినుపడఁగా మునిఁగెడు
మునుకువ దిగనాడె నతఁడు మోదముతో న
వ్వనరాశినుండి వెలువడి
పొనరగు తత్పులినభాగమున విహరించెన్ 59

సీ. ప్రాయేటి విసదారిపదుపు లూడ్చిన కుబు
సంపుఁ బట్టమ్ముల సొంపు లొలయ
లకుముకుల్ కొనగోళులఁ విదారించిన
పెనురొయ్యచేపల తునుక లెసఁగ
జలమున నుండు ముంగుల కులమ్ములు నైక
వర్ణముల్ దుముకుచుఁ బఱచి మెఱయఁ
దిని వఱదులు విడిచిన యెండ్రకచ్చెవం
కరబొచ్చె లందందు వరుసకొనఁగఁ
గీ. దనరు నా యిసుమెడ వసుంధరకు ముకుర
మనఁగ సందరపుందొర కమరిన పటి
కముల నెలక ట్టనంగఁ బ్రకాశిలు నది
పద్మరాగయుతంబ బ్జవనము పగిది 60

సీ. అలవడిఁ దరిఁ బడు పొలసలఁ దిన నధి
ష్ఠించి కొంగలు తెలు పినుమడింప
ననుదినం బొడ్డి కోరాడి కొమ్ముల నెల
మన్నులు తటి విషమం బొనర్ప
జలకపివిహారణతులితాతిచపలాంబు
లవములు పడి తమాలములఁ దడుప
నలుపువోములుఁ గొల్లఁ గల హంసములు మధు
పములును మధురారవమ్ము మొఱయ
గీ. తుహినకరకిరణోజ్జ్వలతోయమనుజ
శయనమ్ముదితచమచ్చమక్ జ్వలిత మగుచు
నా యిసుకనేల వనసీమ ననుకరించు
లలితవిద్రుమవల్లీ విలాసరేఖ 61

సమధికదానధారలకు శౌరముఁ లో కదటమ్ముగలం దళుల్
గుమిఁగొని మ్రోయనల్లదిగుభుంభులుఁ బెందొరయాదుర్ణదరం
గము లెగయన్ దరాహతులఁ గ్రైవస మై దరిఁ బద్ధ నీరదపుఙ్
గముల జిగుల్ జెలంగఁబులిన మ్మొలయు న్నయనాభిరామమై 62

గీ. అజుని భువనమ్ము వోలె ముక్తాభిరామ
మై విభీతసనాభి దశాశ్రయమ్మ
నైన యా సికతాతలమందుఁ గొంత
తడవు కందర్పకేతువు తారుచుండె 63

క. అతఁ డదిసుత నడవిన్ ఫల
వితతుల దుంపలనుఁ దినుచు వేగించెనుఁ గొం
తతడి నట నపుడు వింజము
గతిని ఘనశ్యామవర్షకాలము తోఁచెన్ 64

సీ. రేవతిచిగురాకు చే వలె హాలిధృతి
కర మై ప్రమోదముం బరిఢవించి
యారూఢశరజన్మ మై షడాననుని మ
యూరంబు సంగడం బై రహించి
తరణివిభ్రమములు దండడిఁగొనఁ బ్రబల
యావసరం బోజ నంగవించి
నిరుపద్రవము కాన సరిదూఁగఁగా ఘనో
త్సేకితసారంగతృప్తి నెసఁగి

గీ. భానుఁడత్త మిలిన వేళ పాటి గాగ
నర్తితవినీలకంఠ మై వర్తిలెఁ జడి
కారు విరహుల యెడఁ గోయఁమారు అంప
మో! యనఁగ సారెఁ గ్రొవ్వాఁడి మొలకలెత్తె. 65

గీ. జలదకరకాస్తి రజ మీఁగి జటిని మేఘ
నాదయుతి దశకంధరుఁ బాదరించె
మెఱసె జలదర్తువరుఁడు సమృద్ధనిమ్న
గానదత్వాస్తిఁ గాకలీగాయనగతి 66

క. సీరాముని యే తేరఁగ
మీఱెను దేవేంద్రు విల్లు మింట నభశ్శ్రీ
ధారితరశనాబంధము
తోరణమణిమాల చదలుతోరఁపు మేడన్ 67

విరహాము నెంచి యేగు తఱి వెట్టమగండు పయోధరమ్ములన్
ద్యురమణికిన్ దనున్ దలఁప నుంచిన క్రొన్నెలవంకచాలన్
గఱివిరికల్వకాన కెన కావిరిమిన్నను కాము కేళికా
సరసి నెసంగు నాకమణిచారు వనన్ దగెనయ్య దయ్యెడన్ 68

క. పీనపయోధర తోలకరి
నా నొక మాతంగకన్య నర్తించుచుఁ జేఁ
బూనిన త్రాడో! ఖమందా
రానోకహముకుళరాజియా! హరిధనువా! 69

క. పలురతనము లొప్పిన పూ
విలుతుని విలుబద్ద యన వివిధమాణిక్యో
జ్జ్వలము రతీనఖమార్జన
శలాక యన వఱదగూడు చదలఁ దలిర్చెన్ 70

క. ఆసకోలఁది యేమున్ననుఁ
దా సంద్రమునందు నీరుఁ ద్రావిన మొయిలా
యాసమునఁ గ్రుక్క శంఖము
లా! సౌరాధ్వమున వరుస లయ్యె బలాకల్ 71

గీ. కృష్ణకేదారికాగోష్ఠి నెగిరిపడెడు
పీతహరితమ్ము లగు కప్పపిల్ల లనెడి
లక్క-బలములతో మించులలనఁ గూడి
యా ఋతువిలాసి చదరంగ మాడఁదొడఁగె 72

క. ఇనదీపకజ్వలిత మగు
ఘన మనియెడి నల్ల యొఱపుఁగల్లునఁ దోలికా
రను నగసాలి ఘటించిన
కనకఁపు గీ ట్లనఁగ మెఱపుగమి తులకించెన్ 73

ఘనఘట లుగ్రమారుతవిఘట్టనఁ బాఱుచుఁ దాఁకఁ దారకల్
తునిసి తొరంగెనో! దెసలతోయ్యాలు లూను సరమ్ములూడితా
రనిచయ ముర్లెనో! భువనరాజిపయిన్ సుమధన్వుఁ డెత్తివో
వునపుడు సేస లేమొ! పడెఁ బొంపిరిగావడగండ్లవానలన్ 74

గీ. కోయు పదునైన అంపముల్ క్రొమ్మెఱుఁగులు
నల్లకఱ్ఱతనాబీలు నారదములు
వాని రాలిన పొడిపెల్లు వానజల్లు
లింద్రదసూరులు కోతగాం డ్రెంతవారో ! 75

క. ఆరుద్రపురువు లురు సుమ
మారపుఁ బచ్చికల బీడు మహిమహిళకు లా
క్షారసచిహ్నితశౌకశ
రీరశ్యామలకుచోత్తరీయ మనఁ దగెన్ 76

గీ. మేఘకుంభసలిలమ్ముల మించుకారు
బోఁటి భూనాయికకు నీరు వోసి వోయె
నంత వెన్నెలకార్బోఁటి యచ్ఛమైన
యంబరముఁ దెచ్చె నా స్నాత కందగింప 77

సీ. ప్రమదనిర్భరభరద్వాజద్విజౌఘముల్
శాఖిశాఖల నెల్గుచవుల మొఱసెఁ
క్రౌంచసంచార మకుంచితమ్ముగ సాఁగె
ధార్తరాష్ట్రములకు ధైర్య మొదవె
నుత్క్రోశములఁ బేర్చె నుత్క్రోశము లఖంజ
ఖంజరీటములు సంఘములు కట్టెఁ
బింఛముల్ విప్పి నర్తించ కుండె నెమళ్లు
గ్రుడ్డికొంగల కూఁత లోడ్డుమీఱె
గీ. నమరె సారసరసితపద్మాకరములు
తారతరతారకలునుఁ గశేరుకంద
పరవరాహసముత్ఖాతసరసతటవి
చకితచాతకములు శరత్సమయమందు 78

సీ. త్రావ నింపైన నీరము కల్గె వారుణీ
తిలకచిక్కణమూర్తిఁ గులికె విధువు
కంసారి మైరంగుఁ గల నింగి హంసాభఁ
గల మేఘముల పింజ లతుకువడియెఁ
బఱువళ్ళ ద్రొక్కె నిందురుచి తీవెల వింత
చెఱకుచేల్ కాముకశ్రీలు ద్రొక్కె
సౌగంధికసుగంధ మైగాలి వీచె నిం
చుక విచ్చు కుముదముల్ సురభిళించె
గీ. వరిపొలముకోఁతపరువు చేకుఱెఁ బట్టుప్ర
భాప్రభాతమ్ముల శుకప్రపంచమధుర
కలకలము లగు వరిచేల నెలవుల దిగె
రాజహంసలు యజమానులో జనపుడు 79

సీ. మెఱయు బేడిసమీలు మెసవ మడుంగుల
ప్రక్కఁ గొక్కెరబారు పిక్కటిల్లెఁ
గంచుకులకు సంకుచించుట యొదవెనుఁ
గప్పల బెకబెకల్ చప్పఁబడియెఁ
దగడుకాఁడలకు బాంధవము లై గోదుమ
కంకులు పొలము లలంకరించె
వరిమళ్ళఁ గాపుసుందరులు పాటలఁ బాడ
మృగయూథములు వించు మెచ్చుఁ జూపె
గీ. స్మేరకాశ్మీరము రజమ్ముఁ జిలకరించె
నింద్రధన్వి ధనుస్సున నెక్కు డించె
జలజబంధూకములు శోభఁ గులకరించె
శరద జలదంబుద సుఖాతిశయము నించె 80

ఆ శరదంతరమ్మున వనాంతరమం దట నిందునందు భూ
మీశకుమారుఁ డట్లుఁ జరియించుచు నొక్కెడ నొక్క కుంజసం
కాశము ఱాతిబొమ్మ నొకనాఁడు కనుంగొని మెచ్చి తాఁకఁగా
నా శిలపాంచాలి తత్క్షణమె యుద్దిర! వాసవదత్త మ్రొక్కెడిన్ 81

క. కందర్పకేతు వల్యా
నందంబక్కజముఁ బిరిగొనన్ గని యపు డా
సుందరిని ప్రియురాలి న
మందపరీరంభణమున మన్నించి యనెన్ 82

సకిరో! వాసవదత్త యేమిది! కలా! జాగర్యలో! నైంద్రజా
లికమా! యన్నఁ బొలంతి యుంబ్రియుని హాళిన్ గ్రిమ్మరన్ గాంచ
నెంతో కృతార్థాత్మ నైతి నంచుఁ గడుసంతోసిల్లి నిట్టూర్పుచుం
బ్రకటింప న్నమకట్టె ని ట్లతని వేర్పాటాదిగా నంతయున్ 83

గీ. మందభాగ్య నపుణ్యను మత్కృతమున
నొంటిఁ బల్లటిలుచు రాజ్య ముజ్జగించి
యనఁ దలఁప రాని గోడుపా లైతి రకట!
సామి! సామాన్యజను నట్లు శ్రమలఁ జిక్కి 84

క. ఆ సోదర నాఁడు మన మటు
దూప నుపాసమున నలపుతోడఁ బ్రశాంతిం
బాప్రింప నిదుర దేఁడితి
మాపయి మీకన్న మున్న యఁట మేల్కాంటిక్

నే మేల్కాంచి ఫలాదిసంగ్రహణమున్ జింతించి వానిన్ గొనం
గా మిట్టాడితి నల్పమాత్రమున నికాఁనన్ మహాభాగ! యీ
సీమన్ మాన్గుబురందు నంతరిత మా సేనాని వేశంబు ను
ద్దామంబున్ గనియుల్కినన్నుఁగొనిపోదండె త్రియే తెంచెనో! 86

జనకుం డంచును లేక మీకొఱకు మీ సైన్యంబె చన్దెంచెనో!
యని నే నెంచెడినంత చారుఁ డొకరుం డంతంత న న్గాంచి చె
ప్ప నొకం డప్పుడె లుబ్ధనాయకుఁడు నా వైపుర్వడింపంగఁ దో
డన వేఁటాడి సరించు వేఁటకాఁడునన్ డాసెన్ బ్రియా! యట్టిడే

గీ. వార లిరువురకును రాణువ కరిహారిప
దాతిభరము సమాన మై తగియె నంత
వారు బలముల నొండొరుం బోర మొనసి
రేకమాంసార్థు లగు డేగ లీడు కాఁగ. 88

సీ. శరవర్షదుర్దినంబు రవిఁ గిరణములఁ
జెఱచి పొదువఁ గాండివిశిఖ లుఱుకఁ
బిఱుదీసి షండులు పరుగెత్త నెదిరి ఖం
డించినవా ర్గరాళించి యూర్వ
వెరవరుల్ దవ్వేయు తరవార్ల కెర లైన
మగల విద్యాధరల్ మరులుకొనఁగ
ఖండితగజపదాగ్రముల జో ళ్లను వలం
కృతులుగా దయ్యాలు శ్రుతులఁ దాల్ప
గీ. సమరసందర్శనాయాతసంచరద్వి
యచ్చరుల చారణుల చరణాళి తోర
ణములఁ దోరపు చక్రవాళము రచింపఁ
గ్రందుకొని పోరు నెత్తురుకళ్ల మయ్యె 89

బొల్లుల దుర్భగాత్ములకుఁ బోల్చి సృగాలములున్ సృగాలికల్
కొల్లగొనంగఁ దీఱు పొలంగోళములే యని యెంచి జిహ్మగ
మ్ముల్ల సుకాడినట్లుఁ గని మూర్ఖుల నాసలుఁ బాసి ద్వేష్టను
ర్వల్లుల జీవ మొకర్పరిఁ బైకొని లాఁగిరి బంట్లు రాణ్మణీ! 90

సీ. హేమకక్ష్యలతోడ శృంగారరచనతో
ఘనవిలాసులు వోలెఁ గదలునవియుఁ
ద్యాగులు వలె దానధార లై మార్గణ
సంపాతముల వెల్లు సైచునవియు
శరదహాస్సుల కనుకరము లై పద్మమ్ము
లందగింపఁగఁ బోర నమరినవియుఁ
గదళుల ద్విజములన్ గలిగి సదారామ
నీకాశముగ రవణించునవియు

గీ. రాత్రముల భాతి బహుళనక్షత్రమాల
లొప్పునవియును నై దంతు లుద్ధతముగఁ
గ్రుమ్మలాడఁగ సమరము ఘోరమయ్యె
నా పుళిందద్వయమ్మున కార్యపుత్రి. 91

సీ. మల్లికాక్షముల రాజిల్లి యాటల తోఁట
లందు నుద్దేశమ్ము లటులఁ దనరి
యభినవభాండభారాంచితమ్ములు కుమ్మ
రిండ్లతోఁ దరబడి నెయిది యొప్పి
యావర్తముల నాశ్మదేవమణులఁ గల్గి
రత్నాకరప్రకారముగ నొనరి
శ్రీబనిభమ్ములుగాఁ బానభృతము లై
యింద్రివృద్ధుల వేల్పుటేపు నెనసి
గీ. మిక్కుటమ్ముగఁ గనలినవాఁకాఁ! నాగ
క్షమ వదలి యేచి పైఁ బాఱి చౌకళించి
కరత నిరుతెగ మొనలందుఁ దురగములు మ
హాభయంకర మైన య య్యాహవమున 92

చెవులు పరాపవాదములఁ జేర్చు ఖలోదయసాధుబాధలం
దు విడని సాక్షు లక్షు లగు నో ర్వగదుం బాగడంగరాని పెం
జవటల మొక్కసొదల పొసంగని చోట నిసీ! చెనంటు లీ
యవయవముల్ తొలంగుటె సయమ్మని మెచ్చిరొ! యాడె

క. తుములప్రదోషతిమిరమొ! (మొండెముల్
యమరీపలితంకరణమొ! యధిపా! యోధౌ
ఘములకు నంధంకరణమొ!
సమరజరజ మప్పు డాకసమ్మునఁ బ్రాఁకెన్ 94

సీ. అవినీతు పోకడ నౌద్ధత్యమునఁ ద్రుళ్ళి
సత్త్వముఁ రాజసచ్ఛాయ మాటి
పరు లాడుకొన విన బరువు గా గను కాత
రుఁడు వోలె వినుకలి కెడరుఁ గూర్చి
యున్మత్తు భంగి వాయురయమ్మున న్మెట్టి
మొగతాళి కనఁగఁ గన్నుఁగవ మూసి
పాటిఁ దప్పిన రాజు పాటిగా నక్షత్ర
పథమున గమనమ్ముఁ బరిఢవించి
గీ. పతితుఁ డట్లు విముక్తగోత్రతనుఁ బఱఁగి
గొంటు వలె సత్పథద్యుతిఁ గుంటుపఱచి
కలితధూమ్యాభ ధూమాటకులము పఱవ
వోలఁబడినట్లు నిండె నా దౌష్ట్యమమ్ము 95

సీ. నరకవిచ్ఛేదము మురవైరి సవురున
సవరించె నొకట్టండు చలమువట్టి
రారాజు భంగి నాత్మోరుభంగమ్మునఁ
దలఁచి చొచ్చెను సరోజలము నొకఁడు
విడిచెను శక్తిని విక్లబభూతగా
తుత్రిందై యొకండు కర్ణుండు వోలె
శరతల్పశయ్యపైఁ జిర ముండె నిట్టూర్చు
చునుఁ గతాయువు భీష్ము నెనసి యొకఁడు
గీ. వేటాకండు కట్టావృతవిగ్రహుండు
తపణకుఁడు వోలె వెండి యొకట్టండు పడె సు
రాపు డటు రాము తమమున రావణవధ
మాచరించెఁ బ్రభూ! యొకఁ డాహవమున 96

గీ. బౌద్ధసిద్ధాంతమునకు సంబంధు లనఁగ
నపు డచట క్షుధితక్షుత్పిపాసితదర్శ
నులుగఁ గొందఱు చెడి రట్లు వెలితిపడిరొఁ
బాలకల నిరు వరూధినుల్ బ్రుంగుచుండ 97

మొగరములందుఁ గ్రేళ్ళురికి మొత్తుకొనంగ ఖరాసిధారలన్
దెగి రిపువాఁగులన్ భటులు తేజులునేన్గులుఁ గూలె డెక్కముల్
తెగిపడెన చ్ఛమూపతులుఁ ద్రెళ్ళిరి ప్రాణముతోడ నొక్కఁడేన్
మిగులఁడ యెందు న క్కదనమేదిని పీనుఁగు పెంటగా నటుల్ 98

ఒక జడదారితాఁకుటిలు నొయ్యనఁ దాఁకొని దాఁగి యుంటి నం
దేక్షలనుప్రిక్క నే నపుడు దివ్యచరిత్రి! సుమాదికమ్ముతో
వికలమనస్కుఁ డైన ఋషివృద్ధుఁడు వచ్చెఁ దదాశ్రమంపుటే
లిక యిఁక యోగపున్ గమకలిన్ గనె నాతఁడు యుద్ధసంగతిన్ 99

కని యతఁ డీ యభాగ్యదెసఁ గాంచి చిరాకున "నోసి! నీ కత
మ్మెనఁజెడెనాశ్రమీయవనిపోర మృతాంగసమాకులమ్ము కా
గ" ననుచు "నశ్రుపుత్రికవు కమ్మ"ని తిట్టెను నాథ! యంత నే
వవరుచు వేడుకొంటి బలు భంగుల శాపముఁ గ్రమ్మరింపఁగా 100

నా మొఱ నాలకించి కరుణామయుఁడై క్రుధ డించి య య్యతి
గ్రామణి యెట్టకేల కనె "రాజతనూజరా! తిట్టు మోఘ మీ
వీ మొయి జాయిగా మనికి యొట్లును దప్పదు కాని నీ ప్రియుం
డా నుహిపాలరాఘవునిహ స్తము చి న్నచిరంబె సోఁకెడిన్ 101

దాన నిజస్వరూపమునుఁ దాల్తువుగాత శిలాత్వ మేది సా
ధ్వీ! నెలతినూఱడిల్లు మవధిఁ గలిగించితి నీ యవస్థ కిం
తే" నని పల్కెఁ దోడనె విధించినటుల్ పడియుంటివండి! సా
ష్టాంగత నింతవట్టును నిజస్థితి గాంచితి నేఁడు మీ దయన్ 102

గీ. అని యిటుల నా మధురవాణి యాత్మచరిత
వినుప నీడేరె నిడుమ లంచు నల తేఁడు
కడుఁ బరిణమించె నంతటఁ గలసికొనియె
వారి మకరందుఁడును వని దారిఁ జనుచు 103

గీ. అలరి యలరించె హితుని న య్యధిపుఁడు తమ
వార్త నతనికి వించి తద్వార్త వినుచు
నంత వేవేగ స్వపురమ్ము నధిగమించె
రాజపుత్రికతో మకరందుతోడ 104

సీ. తలి తండ్రి గురువు మొదలయిన పెద్ద లా
శీర్వదింపఁగఁ బ్రజాచిత్త మలరఁ
దన దేవి వాసవదత్త సంసారమ్ము
సారవంతమ్ముగా సంతరింపఁ
జేదోఁడువాదోఁడుగాఁ దన నెడయక
యుపమరి మకరందుఁ డుపకరింప
నభిలషితమ్ములై యఖిలసుఖమ్ములు
నమరదుర్లభములు నమరుచుండ
గీ. దన పురిం బాటలీపుత్రమున వసించు
చెందుఁ బగ లేక బహుకాల మేలె భువిని
గీ విబుధులకల్పవృక్షంబు ఖండదాన
కృతిచణుం డల కందర్పకేతువిభుఁడు 105

సీ. భట్టబాణస్తోత్రపాత్రుఁడు కవి సుబం
ధువు సుజనైకబంధువు సరస్వ
తీదత్తము వరప్రసాదముఁ గల మేటి
శ్లేషప్రపంచవైచిత్రి మెఱయ
వాసవదత్తఁ గావ్యమును గీర్వాణభా
ష విరచించెనుఁ గవుల్ జలదరింప
నద్దాని కిది యొక యనువాద మత్యల్ప
పద్యభాగ మ్మది గద్య మెచ్చు
గీ. కావ్య మియ్యది నిర్గద్యకావ్య మిందు
రస మలంకారమునుఁ బదరచన భావ
మతని శ్లేషోక్తి యెంతవ ట్టలరె దాని
రసికబుధకవివరవిమర్శనమె తెలుపు 106

గీ. కావ్యనిర్మాణకౌశలకమలజులను
భవ్యలలితకళాపట్టభద్రులకును
నన్నివిధములఁ జేయూత యాంధ్రమాత
యనఁ దగి సిరులఁ బ్రజ యెల్ల యలరఁగాత 107

శ్రీముదిగొండవంశపుకరీరము సత్కవిమల్లికార్జున
స్వామికి నాగమాంబకుఁ బొసంగిన సంతు మనస్వికోకిలా
రామము వీరభద్రుఁ డిల వ్రాసిన వాసవదత్త యన్న మా
ధ్వీమధురసవంతి రసదృప్తతరంగము లైదు దీనితో 108



# శ్లే ష ప ద్య ల ఘు టి ప్ప ణి

## ప్రథమ తరంగము

పద్యము నెం.

(1) కవులు = నీటి పక్షులు, భువనము = నీరు, ప్రసాదము = నైర్మల్యము, సరస్వతి = సరస్వతీనది (దేవీపరమైన యర్థము సుగమము)

(7) వకులవిద్వేషి = ముంగిసను ద్వేషించునది, కులద్వేషము లేనిది.

(12) కవిత = నీటిపక్షుల ధర్మము, రస = నీటి, అవ = అక్రమమైన.

(14) వసుదేవ = ఐశ్వర్యముచే దేవతల (కృష్ణుని తండ్రి), యశోద = కీర్తికరమైన (కృష్ణుని తల్లి), అనంతభోగి = అంతు లేని భోగముఁ గలవాఁడు, సమ + కర (స + మకర), వాహిని = సేన, నది.

(15) హిరణ్యకశిపుక్షేత్రప్రదానము = హిరణ్య = బంగారము, కశిపు = అన్నవస్త్రములు ("హిరణ్యకశిపువు" అను రాక్షసుఁడు), ప్రదానము = ఇచ్చుట, చీల్చుట "దోఽవఖండనే".

(16) విశ్వకర్మ = సమస్త కార్యములకు (సూర్యునకు), విబుధ = పండితులకు (దేవతలకు), ఆశాంత = దిక్కు చివర (ఆశలు తీరునట్లు), దక్షిణాశాప్రసాధన = దక్షిణ = దక్షిణలచేత (దక్షిణ దిశను), ఆశా = కోరిక (దిక్కు), ప్రసాధన = అలంకరించుట.

(17) రతి = క్రీడ (మన్మథుని భార్య), అనిరుద్ధ = అడ్డు లేని (అనిరుద్ధుఁడు), కావ్య = కావ్యములు (ఒక యక్షిణి).

(18) ఛాయ = శోభ (సూర్యుని భార్య), క్షణదాన = ఉత్సవముల యందలి దానము, క్షణద = రాత్రి.

(19) ధృతరాష్ట్రుఁడు = పట్టాభిషిక్తుఁడు (దుర్యోధనుని తండ్రి), గుణ = మంచి గుణములయందు (భీముని యందు), అతరళత్వంబు = చాంచల్యము లేకుండుట (హారమునందు మధ్యరత్నము

పద్యము సం

కాకుండుట). నాయకమణి = నాయకశ్రేష్ఠుఁడు (హారమునందలి మధ్యమణి), విద్యాధరుండు = విద్యావంతుఁడు (దేవతలలో నొక తెగవాఁడు), సుమనసుండు = మంచి మనస్సు కలవాఁడు (విద్యాధరులకు విరోధు లైన సుమనసు లను దేవతల తెగకుఁ జెందిన వాఁడు), రాజా = చంద్రుఁడు, మిత్రుఁడు = సూర్యుఁడు.

(20) క్షమ = ఓర్పు (భూమి), సుధర్మ = శ్రేష్ఠ మైన ధర్మము (దేవేంద్రుని సభ), సరళత్వము = సరళస్వభావము (తెల్ల తెగడ చెట్టు యొక్క స్థితి), బృహన్నల = అర్జునుని యొకప్పటి పేరు (ఒక దినుసు గడ్డి).

(21) కుశల + వయో + రూప + శక్తి (కుశలవ + య + శూర + రూప శక్తి), సు + మిత్ర (సుమిత్రా దేవి). సుమంత్ర = మంచి యాలోచన (దశరథుని మంత్రి పేరు)

(22) సదా + (పార్థుఁడు) = అర్జునుఁడు, సదా + అపార్థుఁడు, మహాభార + తరణము = బరు వైన పనిలో నుత్తీర్ణుఁ డగుట, మహాభారత + రణము. అశాంత + నవ + హితుఁడు, అశాంతనవ + హితుఁడు, భీష్ముఁడు = భయంకరుఁడు (భీష్మాచార్యులు).

(23) మిత్రునుదయము = స్నేహితుని యున్నతి (సూర్యోదయము), అచలాధిక = చలనము లేని గొప్ప దైన (అన్ని కొండలకంటెను గొప్ప దైన). గోత్రము = వంశము (కొండ), స + అనుచరుఁ డైన, (సాను + చరుఁ డైన), సానువు = కొండచరియ.

(24) కాంతారము = కఱవు, అడవి, సు + మనోహరుండు (సుమనో + హరుండు = పువ్వులదొంగ), న + భోగోత్సవపావకాగ్రసరుఁడు (నభో + గ + ఉత్సవ), నభోగోత్సవ = భోగాసక్తి లేనివాఁడు (నభో = ఆకాశమును, గ = పొందిన), పావక = పవిత్రుఁడు (అగ్ని).

(25) కటకము = సేన, (పర్వతమధ్యభాగము). = గంధర్వ = గుఱ్ఱములకు (గంధర్వులకు), శృంగము = ప్రభుత్వము, శిఖరము.

(26) స + హి + మానీ = మానవంతుఁడు, గిరి + సంస్థః = మాటమీఁద నుండువాఁడు (హిమానీగిరి + సంస్థః = హిమవత్పర్వత మందుండు వాఁడు) వృషకేతుః = పుణ్యము ధ్వజముఁ గాఁగలవాఁడు, శివుఁడు.

(27) గోత్రము = భూమి, వంశము, జనకభూ = తండ్రి ఆస్తి, జానకీ దేవి, విరామము = రామవ్యతిరేకగుణము, వ్యవధి. పునర్భూపరిగ్రాహీ = మరల రాజ్యము నొందినవాఁడు, పునర్భూ = మరియొక భర్తను వివాహమాడునది.

(28) సంధి = శరీరములోని అతుకులు, విగ్రహము = శరీరము, సు + దక్షిణ (సుదక్షిణాదేవి), గో = భూమి, ఆవు.

(29) స + దా + భోగుఁడు, సదా + న + భోగుఁడు, సృగాల = నక్క యొక్క, సృగాలుఁడను రాక్షసునియొక్క. చక్రము = రాజ్య చక్రము, చక్రాయుధము.

(30) ముక్తామయశ్చ, ముక్త + ఆమయశ్చ, ఆమయము = రోగము, రామ, రామా. సు + బాహువు, సుబాహు వను దనుజుఁడు. సమదృష్టి = సమానభావము, రెండు కన్నుల చూపు. ఈశ్వరుఁడు = ప్రభువు శివుఁడు.

(31) కరచ్ఛేద = చేతులను గోయుట (ఒక శిక్ష), చేతులతోఁ ద్రుంచుట, కరపత్రముల కోఁత = పూర్వపు దండనావిశేషము, అంపముల కోఁత, కంజము = శంఖము. నేత్ర + ఉత్పాటనము = కన్నులఁ బెఱుకు శిక్ష, వల్కలములను + ఉత్పాటించి స్వీకరించుట ఖల = దుష్టునియొక్క, శిల్పముయొక్క. కంటక + యోగంబు = క్షుద్ర శత్రువుల + సంబంధము, గగుర్పాటు + (ఆనందమున) కలుగుట. రాజా = రాజుతో, చంద్రునితో. సూచి + భేదము = ఒక శిక్ష,

సూదిచే + రంధ్రము వేయఁబడుట. సార్వభౌమత = ఉత్తరపు దిక్కునఁ గల యేనుఁగుయొక్క భావము. పరివాదము = అపవాదము, వీణావాదనవస్తువు.

(32) పాముకు రెండు నాల్కలు. ఛలనిగ్రహప్రయోగము = కపటము చే సాధించుట, తర్కమునందొక పద్ధతి. శూలభంగము = ఒక శిక్ష ప్రసవాముకుబాధ. అకృష్ణవర్త్మ = నలుపు లేని ప్రవర్తనముఁ గలవాఁడు. అనాశ్రయాశువు = ఆశ్రయించిన దాని దహింపని వాఁడు. పావకుఁడు = పవిత్రుఁడు, అగ్ని. విషాశి = విషముఁ దినువాఁడు, దుఃఖించువాఁడు. శంకరుఁడు = శుభకరుఁడు, శివుఁడు. త్రిశంకువు = హరిశ్చంద్రునితండ్రి, ఉత్సాహప్రభుత్వమంత్రము లను మూఁడుశక్తులుఁగలవాఁడు. నక్ష-త్రుఁడు = న + న + అ + క్షత్రి + సరణి + గళితుఁడు = అక్షత్రియపదభ్రష్టుఁడు కానివాఁడు కాని వాఁడు = క్షత్రియధర్మము వదలనివాఁడు, న + నక్షత్రసరణి గళితుఁడు = నక్షత్రమార్గమునుండి జారని వాఁడు.

(33) అ + నతిమయుండు = ఒకరికి నమస్కరించు వాఁడు కాఁడు, లేక యొకరు తనకు నమస్కరింపవలెనని కోరువాఁడు కాఁడు (అ + న + తిమయుఁడు = తిములను మత్స్యవిశేషములు లేనివాఁడు కాఁడు = తిములఁగలవాఁడు) సదా + హిమకర + ఆశయుఁడు = ఎప్పుడు = చంద్రునివంటి + స్వచ్ఛమైన మనస్సు కలవాఁడు, సదా + అహిమకర + ఆశయుడు = ఆధారమైనవాఁడు. అమృతము = నీరు, అమృతము. మర్యాద = మేర. సత్పోతుఁడు = మంచిపిల్లలు (ఓడలు) కలవాఁడు. న + చ్ఛిద్రోకుడు = గొప్పఛిద్రములు లేనివాడు (ఓకము = ఛిద్రము). సముద్రుఁడు ఉద్రోకుఁడు. ఇది వ్యతిరేకి విశేషణము. ఓకము = ఒక జలజంతువు కాగా నుత్సృష్ట ఓకములు లేనివాఁడు = ఓకములు కలవాఁడు. మహోక్ష + అదీనస్య, తస్య. క్రోధోఽపి న అచలః = ఆ గొప్పవానికోపము క్షణస్థాయి

మహానదీ + ఇనస్య తస్య సమీ దిశస్య) అధః నక్రాః అచలాః, అక్షీణ అ మహానదీభర్త కడుఁగున మొసలి కొండయుఁ గలవు (వాక్యార్థ వచనము). క్షణద = ఉత్సవకరమైన, రాత్రి. కు + ముత్ + అవనము = భూదేవి + సంతోషమును + కాపాడుట, కుముద + వనము = కలువ + తోఁట. నక్ర + అరాతి + బలుఁడు, న + తారా + అతి + బలుఁడు, అతి = అతిక్రమింపబడిన.

(34) జీవనము = జీవిక, ప్రాణము. మిత్రమండలగ్రహణము = స్నేహిత సమూహమును (సూర్యమండలమును) పట్టుట. కలి = యుద్ధము, కలిపురుషుఁడు.

(35) శివము = శుభము, శివ = పార్వతి.

(36) నానా + రామా = స్త్రీలు (ఆరామ = వనములు).

(37) ఈశ్వర = రాజులచే, శంకరునిచే, కోటి = ప్రకర్ష. శిఖరము. విష్ణుపదము = విష్ణుపాదము, ఆకాశము, అవ — యుఁడు = స్వచ్ఛమై విశాలమైన అంతస్సు కలవాఁడు.

(38) వారవధి = వర్షర్తువు. విధగ = విధముగ. విమల + తరవారి = ధారా (కత్తి), విమలతర + వారిధారా. రాజహంసలు = రాజశ్రేష్ఠులు, రాజహంసములు.

(39) సుశర్మత = సుశర్మ యనువాని భావము, గొప్ప శుభములు కలవాని ధర్మము. భోగి = మందరపర్వత మను కవ్వమునకుఁ ద్రాడైన సర్పము, భోగము ననుభవించు వాఁడు. బలము = సైన్యము, శక్తి. భువనము = లోకము, నీరు. కాలధర్మము = ఆ కాలమునందుఁ జేర్కొనఁబడు ధర్మము, మరణము.

(40) కువలయాపీడభూషణుఁడు = భూజనులలో మిన్న, "కువలయాపీడము" అను పేనుఁగు నలంకారముగాఁ గలవాఁడు. సంధ్యా + ఉచ్ఛ్వసనము = వ్యవహారములందయిన గొప్ప చైతన్యము, సాయంకాల + తాండవము.

(41) అనుచర + అనుగత = అనుచరులయొక్కయు, దక్షిణ = సమర్థుల (పండితుల) యొక్కయు, సత్ = సాధువులయొక్కయు, ఆగతి = ఆగమనము గలవాడు (అనుచరుడైన, దక్షిణసదాగతి = దక్షిణపు గాలి గలవాడు). కలకంఠము వంటి కంఠము, కోకిల స్వరము. అతిక్రాంత + దమనకుడు = పరిభవింపబడిన + శత్రువులు కల వాడు, శిశిరమునందైన దవనమునతిక్రమించిన వాడు (దవనము నకు వసంతము సమయము కాదు) సురభి + సుమనో + మనోజ్ఞుడు = పండితుల యొక్కయు + మంచివారల యొక్కయు యింగితము నెఱింగినవాడు, పరిమళించు + పువ్వులతో + మనోహర మైనవాడు. పల్లవము = శృంగారము, చిగురాకు. సర్వసులభ పద్ముడు = అందఱకు సులభ మైన లక్ష్మి గలవాడు (ప్రజలకు గావలసినంత యైశ్వర్యము నొసగూర్చును). పద్మము = తామర పువ్వు. కనకము = బంగారము, సంపెంగ. కృత + కాంతా + రత + రంగము = అనురాగము (కాంతార + తరంగము = అడవుల + వాగు). భ్రమర = కాముకులచేత, తుమ్మెదలచేత ప్రవాళ హారిణులు = పవడాల హారములు గల స్త్రీలు, చిగుళ్ళతో మనో హరము లైన లతలు. ఉత్కలికలు = వేడుకలు, పెద్ద మొగ్గలు (ఉత్ + కలికలు). వయస్సు = యౌవనము, పక్షి.

(42) వంశదీపకు = వంశాలంకారము, వెదురుడిప్పలో నుంచిన దీపము, అక్షత + దశ = తక్కువ కాని + మంచి స్థితి (వత్తి). లతాంత + శర + అసనుడు (లతాంతశరం అస్యతి నిరస్యతి ఇతి) = అంద మున మన్మథుని నిరసించు వాడు (మన్మథుడు).

(43) వైరవ = ఖలులకు, కలువలకు, విబంధువు = శత్రువు, విశేషబంధువు. శర్వరీ — రి = శర్వ + రీతి + హారి = శివుడు + వలె + హృదయంగముడు — శర్వరీ + ఈతి + హారి = రాత్రి నగు + విపత్తు + హరించువాడు. ప్ర + సాధిత + అశుడు = బాగుగా

పొందించఁబడిన (అలంకరింపఁబడిన) + ఆర్ద్రకోర్కలు (దిక్కులు) కలవాఁడు. సత్వము = చిత్తము, జలజంతువు. జీవనము = వృత్తి, ఉదకము.

(45) పత్రరథమ్ములు = వాహనములున్నా రథములను, పక్షులు కబంధములు = మొండెములు, నీళ్లు వాహినులు = సేనలు, నదులు

(47) జైనులలో భవిష్యత్తు సన్యాసివలెఁ దెలియఁగోరువాఁడు. పెరుగు ముద్ద నపాయనము గా నివ్వవలయు నట.

(54) స్నేహము = తైలము, మైత్రి. దశ = వత్తి, అవస్థ. పతంగ = మిడుతలు, సూర్యుఁడు

(57) భ్రమరకములు = ముంగురులు

(61) నఖాలంకృతులు = గోటిగుర్తులు, న + ఖ + అలంకృతులు = (ఆకాశమున కలంకారము కానివి) పయోధరములన్ — స్తనములను, మేఘములను.

(63) జీవితేశ + పురము = భర్త యొక్క శరీరము, (యముని పట్టణము)

(61) మాసరములు = దీర్ఘములు.

## ద్వితీయ తరంగము

(2) గురుకళత్రము = గొప్పపిఱుఁదు, గురుభార్య.

(11) నందన = నందనవనము, సంతోషకరము. కన్యాతోనైనసామ్యము, తారలు. ఉల్లసత్ + హార, ఉ — త్ + ధార, పయోధర = స్తనములచే (మేఘములచే) అంత = మనోహర మైనది. కర్ణ = చెవి, కర్ణుడు, లోచనము = కన్ను, నిరూపణము. శ్యామల + కుచ (శ్యామ + లకుచ = గజనిమ్మ).

(12) సిత = తెల్లనైన (శుక్రుఁడు) శనైశ్చర — మెల్లగా జరించు (శని). తెలిడాల్ = తెల్లకాంతి (చంద్రుఁడు). భాస్వత్ = ప్రకాశించు

మిత్ర హితునియొక్క, సూర్యునియొక్క, చేతనా + అవనము = తెలివిగల్లనైన రక్షణము, చేతనా + వనము = కాంతిపుంజము.

(29) శతమన్యు = నూరువిధము లైన దుఃఖము, ఇంద్రుడు.

(37) మల్లికా + అర్జున = గులాబిపూల తెలుపు, సప్త + పత్రస్యందనము = ఏడాకుల అరటిచెట్టునుండి రసము ప్రవహించుట, పత్రము = గుఱ్ఱము ధాత్రి = ఉసిరిక చెట్టు, దాది. శిఖండి = నెమలి, అర్ధచంద్రములు = నెమలికన్నులు పనస = చెట్టు. కుముద = కలువ, పాదము = కొండతటిత్రి, కేసరి ను॥ శ్రేష్ఠ మృగములయందు, ఆ పేరు కల వానర శ్రేష్ఠునియందు వర్తించును. శంబరములను = ఎఱ్ఱని చిన్న జింకల పిండు, శంబరుడను రాక్షసుని వంశము.

(38) దంతములు = పొదరిండ్లు, పండ్లు. శతకోటి = వజ్రాయుధము, దానముల్ = చీల్చుటలు, ఈవులు. బహు + లతా (బహులత, ప్రియంగు = ప్రేంకణపుచెట్టు, శ్యామ = నల్లతెగడ, ("ప్రియంగు శ్యామ" యను నొక రాణి) గుహా = కొండగుహ, కుమారస్వామి. నాగ = ఏనుగులయొక్క, పాములయొక్క. విభూతి = ఐశ్వర్యము, పైనలదుకొన్న భస్మము. మల్ల + నాగ = బలిష్ఠము లైన ఏనుగులచేత, మల్లనాగుడను కామశాస్త్రప్రణేతచేత. కాంతార + సామోది (కాంతారస + ఆమోది)

(39) సాను + గ్రహ — చరియలయందుదిరుగు సూర్యాదిగ్రహముల యొక్క. (స + అనుగ్రహ) గుల్మము = బోదెలేని చెట్టు, వ్యాధి విశేషము ధాతువికార = గైరికాది ధాతువులచే నైన మార్పు, శరీరధాతువుల మాఱుపాటు. అభయము = వట్టివేరు, రక్షణము, మృత్యుఫలదుండు = ఒక దినుసు పండ్ల నిచ్చువాడు, మరణమును ఫలముగా నిచ్చువాడు. ప్రమితి = యథార్థజ్ఞానము = పరిమితి, ప్రస్థము = కొండనెత్తము, ఒక కొలత (తూకము) పేరు. పిహి

కాంబరుఁడు=దిగంబరుఁడు. ఆకాశమునఁ గప్పినది, అంశుకము =వస్త్రము, కిరణము. భీముఁడు=భయంకరుఁడు, కీచక=వెదు రుచే, కీచకునిచే. అ + క + లీనుండు = భూమియందు లీనము కాని వాఁడు అనఁగా నఖ్యాఁడు, ఉత్తమవంశమున జన్మించని వాఁడు, వంశ=వెదురు, వంశము. సనాదుఁడు=ధ్వనిఁ గలవాఁడు అపేత నాదుఁడు=ఉత్తరముగాఁ బ్రవహించు నదులు లేనివాఁడు.

(40) భద్ర—ముస్తము, శకుని = పక్షి నాగ = సర్పము పుష్క రాక్ష=కమలబీజములయొక్క, కృష్ణునియొక్క. పిహిత=మూటు పఱచిన, దిగంబర=దిక్కు. ఆకాశము (దిగంబరజైనులయొక్క). దర్శనము=కనుపడుట, శాస్త్రము, వంశపత్రములు= వెదురాకులు ("ప్రవిపాత్ర" మొదలయినవి కవిత్వమున గల వృత్తముల పేళ్లు)

(42) కాంతార + ఊషర + సాను + గము (పొందినది). కాంతా= లోపరస + అనుగము. మదనము=మంగ చెట్టు, కాముడు కూ- టాలము=శిఖరములయిన రెండు వైపుల నేక వేళ సూర్యచంద్రులఁ గల్గి రెండు కనులతో గురువైన యగస్త్యుని కొలఁకు ఎదురు చూచు చున్నదా!

(41) ఉత్కటములు, వైరాటములు = ఒక రకపు చేఁపలు. కంజ కచ్ఛము=లోమము లున్న ప్రక్క.

(46) ముఖభంగము=పెద్ద తరంగము, ముఖవికారము. భూభృత్తు= కొండ, రాజు. వేల = తటము, కాలము. కబంధము = నీరు) మొండెము. శతపత్రము=నెమళి,

(56) ఘనసారము=పచ్చకర్పూరము, నీరు. వాహిని=ప్రవహింపఁ జేయునది, ప్రవహించునది. న్యగ్రోధమ్ములు = వటవృక్షములు, న్యక్ + రోధములు=నీచములైన + దరులు. బృహన్నల=ఒక రకపు గడ్డి నానా + విటపి + ఇత + ఆసవము=మకరందము, ఇత= కలిగిన, నానా + విట + పీత + ఆసవము=మద్యము, రంభ +

అరఁటి, దేవవేశ్య కీచకశత = వెదురుగుమ్ములు, ఉపకీచకులు. ఘం—ర్గ. ఘంటారవ = కాగుజనుముచే, ఘంటల ధ్వనిచే, ఆవే దిత = ఆచ్ఛన్నమైన, తెలియఁజేయఁబడిన, మార్గము = మృగ సమూహము, త్రోవ.

(57) మదనశలాక = గోరువంక కామోద్దీపనముఁ జేయు నోషధము. చాయ = నీడ, ఛాయాదేవి. పత్రములు = ఆకులు, వాహనములు. పల్లవ = చిగురాకులచే, విటులచే, గాణిక్యము = వేశ్యా సమూహము శాఖలు = కొమ్మలు, వేదశాఖలు. శకుని పక్షి, దుర్యోధను మేనమామ సదీ—ము = మంచి = రాజుకొలువు వలెఁ గావలసినన్ని శ్లేష్మఫలములఁ (పండ్లను) గలది.

(61) కరీరము = వెదురు మొలక.

## తృతీయ తరంగము.

(5) సుధ = సున్నము, అమృతము. కుల్యా—లము = పర్వతము

(6) బృహ—ములు = "బృహత్కథ" యను గ్రంథము పైశాచిక భాషలో "గుణాఢ్యుఁ" డను మహాకవిచే రచింపఁబడినది. సర్గలట్లు లంబము లందుఁ గలవు (ఆశ్వాసములవలె). అందు "సాలభంజిక" యను విద్యాధరి వర్ణింపఁబడినది. సాలభంజికలు = బొమ్మలు మాణవక + క్రీడితములు = బాలుర + ఆటలు, ఆ పేరుఁ గల్గిన వృత్తము.

(7) ఘట = ఏనుఁగుల గుంపు. మత్తవారణము = వలభి ప్రదేశము, మదించిన యేనుఁగు. సుతలము = శోభించు ప్రదేశము, పాతాళము. గవాక్ష = కిటికీ, ఆ పేరుఁ గల వానరవీరుఁడు.

(8) పంచజనుఁడు = మనుష్యుఁడు సుప్రతీకత్వము = మంచి యవయవములనుఁ గలుగుట, ఈశాన్యదిగ్గజభావము. అచక్రత = అమాయికత, సుదర్శనము = విష్ణుచక్రము, మంచి దర్శనముఁ గలుగుట,

(9) చంద్ర=బంగారము, చంద్రుఁడు. సత్పథము = మంచి నడువడి, ఆకాశము. తపస్య=ఫాల్గుణమాసము, తపస్సు. వృషము = ఎద్దు (వ్యవసాయమున), వృషభరాశి.

(10) నానా + సవ = యజ్ఞములు, నానా + ఆసవ = మద్యములు. అగ్రంథులు=కుటిలస్వభావము లేనివారు, గణుపులు లేనివి. పక్ష పాతము=రెక్కలతో వ్రాలుట. పటుహంసములు = సమర్థులలో శ్రేష్ఠులు. అ + మర్మ + భేదులు = తత్త్వ + విరుద్ధముగా నడువని వారు, మర్మస్థానముల భేదింపనివారు. స్నేహము = మైత్రి, తైలము. కావ్య + జీవ + జ్ఞులు = కావ్యతత్త్వజ్ఞులు, శుక్ర=బృహస్పతి + బుధులు, అగ్రహులు = బంధనము లేనివారు, గ్రహములు కానివారు, అసంఖ్యులు=పోరు లేనివారు, సంఖ్య=సద్బుద్ధి. గో + పాలుఁడు=మాటఁ + దప్పనివాఁడు, రాముఁడు=సుందరుఁడు. భ + రతుఁడు=నక్షత్రశాస్త్రమున + ఆసక్తిఁ గలవాఁడు, శత్రు + ఘ్నుఁడు = శత్రువులఁ + జంపువాఁడు. ప్రియం + వదుఁడు =ప్రియముఁ + జెప్పువాఁడు. పుష్ప + కేతువు=మంచితనము + ధ్వజముగాఁ గలవాఁడు ("ప్రియంవదుఁడు" "పుష్పకేతువు" నను నిర్వురు గంధర్వులు). ధన + దుఁడు = ధనము + ఇచ్చువాఁడు, కుబేరుఁడు. ప్ర + చేతసుఁడు = ఉన్నత + మనస్సుఁ గలవాఁడు, వరుణుఁడు (విరోధాభాసాలంకారము).

(11) ఖండ + అభ్రములు = చంకవద్దఁ జేయఁబడు నఖక్షతములు, శకలములైన + మేఘములు. శరద = శరత్కాలము. ఇంద్రాణి = రతిబంధ విశేషము, శచీదేవి. పల్లవ = చిగుళ్ళచే, విటులచే. కరేణువులు = ఆఁడేనుఁగు. రక్త = అనురక్తులను. సురత = రతి, దేవత్వము. బిలాసి = విలాసి, పాము ("వ" "బ" యో రభేదః). భుజంగ + పరులు = విట + శ్రేష్ఠులు, సర్ప + శ్రేష్ఠులు. మహా నటుఁడు = శివుఁడు.

(17) సార్వభౌమ + కరంబు = ఒక దిగ్గజపు + తొండము, రారాజు + చేయి = మాలిని = ఒక నదిపేరు, ఒక వృత్తము. కోక + నదము = చక్రవాక + ధ్వని (గలదియు)· ప్రబుద్ధ + అంబుజ + అక్ష + పూచిన + తామర + కన్నుఁ గలది (నది· కోకనదము = యెఱ్ఱ తామర). ప్రబుద్ధ + అంబుజాక్ష = మేల్కొనినవిష్ణువు (గలది— శరత్తు.) విభాకర + తనయ = యమున, శని. రాజ + హంసులు = చంద్ర + సూర్యులు· పుండరీక + కుముదములు = తామరలు + కల్వలు, ఆగ్నేయ + నైరృతి దిగ్గజములు.

(18) "అంధతమసము" ఒక నరకము, "తమసా" = ఒక నది. అ + "వీచీ" + "దుర్గమము" = ఈ రెండు నరకముల స్నానతలకు రాకుండఁ జేయునది· విష్ణుపది = గంగానది.

(20) కేసరము = కింజల్కము, సింహపు జూలు. నారి + కేళీ + ధరములు = కాంతా + లీల + గలవి, + అరి + కేళీ + ధరములు + శత్రు + లీలల + ధరించనివి· అసంస్కృత = దిద్దఁబడని· అతి దూరగ + ప్రశ్రయ + అక్షములు = దూరము నాక్రమించు తాండ్రచెట్లు, వినయమునకుఁ గడు దూర మైన యింద్రియములు. జప = దాపనము· సత్ + ఆరామ (సదా + రామ).

(21) ముని = అగిసెచెట్టు, మదనము = కామము, వృక్షవిశేషము· ఉత్తంభిత = మోయఁబడిన. కృతమాలా + అంతములు = రేల చెట్లచే + మనోజ్ఞములు, మాల = పూదండ. అరిష్టములు = కుంకుళ్లు, జబ్బులు.

(24) బలి + ఆప్తము = బలవంతులతోఁ గూడినది (బలిచక్రవర్తి). భోగులు = భోగపురుషులు, పాములు సురాలయములు = కల్లం గళ్లు, దేవతాయతనములు.

(25) సుభద్ర = గొప్ప శుభము, భీమసేనుఁడు = భయంకరసైన్యముఁ గలవాఁడు, సబలుఁడు = బలముఁ గలవాఁడు (బలరాముఁడు).

సత్య + భా (కాంతి) + మా (లక్ష్మి). బహుధా + అన్య, బహు + ధాన్య.

(26) జీవము = వింటినారి, ప్రాణము. మార్గణలక్ష = యాచకలక్ష, బాణలక్ష. పంచత = ఐదింటి భావము, మృతి. సంఖ్యము = యుద్ధము. (సత్ + అగతి) నిర్వృతి = ఋతి (దుఃఖము) లేనివాఁడు.

(27) శృంఖలాబంధంబు = సంకెళ్ళు వేయుట, కవితలో బంధవిశేషము. కోశము = బొక్కసము, తామరమొగ్గ. జాతి = వంశము, జాజి. దక్షిణ—వామకగణము = ఉత్తముల—సగౌరవించుట, కుడి యెడమల నిర్దేశము. శర—భిద = ఒక శిక్ష, కస్యముచే — భేదించుట. వృషము = పుణ్యము, ఎద్దు. ద్విజ — క్షతి = ద్విజుల — నష్టము, దంత — క్షతి.

(28) కర + వాల (జుత్తు). కరవాల = కత్తి. నిస్త్రింశత = క్రౌర్యము, ఆయుధత్వము. లక్ష — లక్షలకొలఁదిగా నగు (లక్ష్యము), దాన = ఈవినుండి (భేదించుట నుండి). అనంగత = అంగవైకల్యము, కామత్వము. అంబరము = వస్త్రము, ఆకాశము. భంగురత్వము = కౌటిల్యము, శృంగారచేష్టా విశేషము. మారుఁడు = శత్రువు, మన్మథుఁడు. అధర + రాగము = నీచులందు + అనురాగము, పెదవి యెఱుపు. ఎలయన్న = యౌవనవతి. చల - రాగము = చంచలమగు ననురాగము, గీతస్వర విశేషము.

(29) ఖర్మము = పౌరుషము, పట్టువస్త్రము. గాంధారము = గతి, స్వర విశేషము. దుర్వర్ణము = వెండి.

(30) రసనాబంధము = మొలనూలుచేఁ గట్టుట, నాలుక మడత. కృంతనము = కత్తిరింపు.

(31) ఉత్ప్రేక్ష + ఆక్షేపములు = పరాకు + అధిక్షేపము, రెండు అర్థాలంకారములు.

(32) సుర=కల్లు, దేవతలు, పాత=త్రాగువాఁడు, పాలకుఁడు శత కోటి=నూరు కోట్ల ధనము, వజ్రాయుధము. ఆస్థానము=సభ, ఆస్థానము=తగని చోటు, గురుగ్రహము=గురువైన గ్రహము, గొప్ప గ్రహము లేక గొప్ప—పట్టుదల.

(33) చంద్రలేఖ=ఒక శిరోభూషణము, చంద్రరేఖ. అళి = తుమ్మెద (ఆళి = చెలికత్తె) నవమాలిక = క్రొత్త పూదండ, విరజాజి. సచిత్రక=తిలకముఁ గలది, చిఱుతపులిఁ గలది. మంజుఘోష=సునాదముఁ గలది, ఒక యప్సరస. సుకేశి = చక్కని కురులఁ గలది, ఒక యప్సరస.

(35) తారక=కను గుడ్డు, చుక్క. అచ్ఛిద్ర=లోపము లేని, తప్పు లేని, ద్విజ=దంతములు, విప్రులు. మాల్యవత్ + సుకేశ=పూదండఁ గల మంచికొప్పు గలది మాల్యవంతుఁడు, సుకేశుఁడు నను రాక్షసరాజులు. సుజాతరూపము=కుదిరికఁ గల రూపము, మేలిమి బంగారము సహస్రాక్ష=వేయి కనులు, ఇంద్రుఁడు. పులోముని కూఁతురు=శచీదేవి. గోత్రము=వంశము, పర్వతము. లావణ్యము=మేని తళుకు, లవణభావము. ఎలయిూడు=యౌవనము.

(36) ఖచరులు=దేవతలు. సత్....ఆకల్ప = భూషణములు. సదా—కల్ప=కల్పవృక్షము. మదనము=కామము, ఒక చెట్టు.

(38) ఆపీ—శి=ఆపీతరక్త=అంతటను బచ్చనైనవియు నెఱ్ఱనివియు (పువ్వులచే) నైన, బాగుగా రక్తముఁ ద్రాపిన, పలాశి=కోరింద చెట్లు, రాక్షసులు. దోషానుబంధము=రాత్రిపొడవు, తప్పులతో సంబంధము. జాతి=జాజి, దమనక=దవనము, వైరి. ఇంద్రాణి=వావిలి, శచి. సురతాణి=దేవేంద్రుఁడు. సు + ఖ + ఆశలు = నిర్మలమైన + ఆకాశము + దిక్కులు, సుఖకరము లగు నపేక్షలు. వాస్తుకుఁడు=నాగరకుఁడు. స + తామరసః, సతాం—అరసః.

(39) అమ్లాన = పెద్ద రేకుల చామంతి, వాడని. ధీవరత్వము = బెస్త పెద్దతికము. సాల + రాజీవ — ఉత్పలములు = చెట్లు తామరలు — కల్వలు, మత్స్యభేదములు. అనవబద్ధ = చేరని, తుపిఁని — పాతము = మంచు — పడుట (తు — హి — నిపాతములు — ఇవి పాదపూరణము కొఱకు సంస్కృత కవితలో సామాన్యకవిచే వాడఁబడును). మురువకము (బకము), మరువము. కు — వలయ = భూ — మండలము యొక్క, కలువలయొక్క.

(42) అతిముక్తక — మునులు = అడవిమొల్ల అగిసెలు అత్యంత ముక్తులైన — మునులు యతిదూరము = యతులవలన, కడుదూరము. విక్రియగతికి = వికారమునకు. విక్రీతము = అమ్మఁబడినది.

(43) షిడ్గులు = శృంగారులు, చర్చరి = చప్పట్లు, తాళవిశేషములు.

(50) రణరణకము = వేడ్క. అపరాంతవాసినీజనము = పాశ్చాత్యస్త్రీలు.

(54) తథాగతులు = అట్లు వచ్చియున్నవారు, తథాగత = బుద్ధుని, ధ్వంసము = నిందించుట. భాస్వత్ + దర్శనము = ప్రకాశించువారి. దర్శనము, సూర్యదర్శనము. కు + ముత్ + ఆకర = కచ్చితపు సంతోషము నిండినవారను (కుముద ఆకర = కల్వల-సరస్సుల యొక్క) నృపులు = భూపతులు. అక్షహృదయ + అజ్ఞాన + హృత + క్షములు = వ్యవహారతత్త్వము (ద్యూతశాస్త్రము) + తెలియమిచే + కోల్పోయిన + ఓపిక (రాజ్యము) గలవారు. కార్తస్వరము = బంగారము. శకున-శ్రావకులు = తమకైన శకునముల వినుపించువారు, పక్షుల వంచించుట కట్టి కూఁతల వినుపిఁచువారు. రూపము = స్వరూపము, మృగము

(55) దివ్యచక్షువు = జ్యోతిష్కుఁడు, అర్జునుఁడు. కృష్ణాగురులు = సుగంధద్రవ్యవిశేషములు. కృష్ణా = ద్రౌపది, గురువు = తజ్జనకుఁడు లేక ధౌమ్యుఁడు, సు + అబలా + అర్థులు, స్వ + బల + అర్థులు.

నెలకారు = శరదృతువు. ఆశ = దిక్కు, కోర్కె. పాణిగ్రహము = చేయిఁ బట్టుకొనుట, పెండ్లి. అసులభము గా = శోభించు చేయి దొరకనట్లుగా, సులభము కానట్లుగా. అధరీకృతులు = ధిక్కరింపఁ బడినవారు, భూమిగాఁ జేయఁ బడినవారు, సుస్థిరాత్ములు = స్థైర్యము బాగుగాఁ గలవారు, భూమి యైనవారు (ఇది అర్థము లేకున్నను విరోధాభాసకొఱకు స్వీకరింపఁబడినది)

(56) తిర్యగ్గతులు = వాయువులు, వక్రగతిఁ గలవారు, గంధము = గంధము. ద్రోణశాస్త్రము = వాయసము తీర్చుట దాని ఫలముఁ దెల్పుశాస్త్రము (ద్రోణము = కాకి), ద్రోణుని శాసనము.

(57) బృహత్ + కథ = గౌరవనీయమైన + స్వచరిత్రము ("బృహత్కథ"యను గ్రంథము "గుణాఢ్యు" నిచే వ్రాయఁబడినది). గుణాఢ్యుఁడు = మంచి గుణముఁ గలవారు, పై గ్రంథకర్త.

(58) వందిఘోషము = అర్జును రథము పేరు, వందించువారి కంఠరవము. వితానము = ఉల్లడ, యజ్ఞము. రాజ + ఉపహారము = (ర, లయోరభేదః) లాజల కానుక, రాజుల కివ్వఁబడిన యుపాయనము. సుమనః = సజ్జనులయొక్క, దేవతలయొక్క.

(62) రామ + ఆకర్షణము, రామా (స్త్రీ). అంగద = భుజభూషణముతో, అంగదునితో. సత్వము = బలము, జలచరము. కరకములు = చేతులు, వడగండ్లు. వృద్ధశ్రవస్సు = పెద్దల చెవి, ఇంద్రుఁడు.

(63) గోద = గోదానాదులఁ జేయునది (గోదావరి). తుంగభద్ర = ఉన్నతమును శుభకరమును (తుంగభద్రానది). నర్మ-ద = నర్మసచివునియొక్క (నర్మదానది). శోణపు = ఎఱ్ఱని (శోణానది). మాలిని = మాలఁ గలది (మాలినీనది). స్వర్వ్యాపిని = స్వర్గమునకు వ్యాపించినది (గంగానది). వైదగ్ధి = చాతుర్యము.

(70) దనివు = రతి. (71) ఋద్ధి = కుబేరు భార్య.

(73) ముర్మురము = కమ్మ. సురభి = చైత్రమాసము. బలిసద్మ = పాతాళము. తమిబంధము = కాలుచీఁకటి. కరణములు = ఇంద్రియములు.

(75) నిగళితుఁడు = సంకెల వేయఁబడినవాఁడు. వజ్రపారము = అతికించు నొక బంక. (77) శుచి = శృంగారరసము.

(83) ప్రస్తరము = శయ్య. పుష్పమ్ములు = పూలు.

(86) శ్రుతి = చెవి, వేదము. (87) నాసికావంశలక్ష్మి = వెదురువలె నున్న నాసికయొక్క శోభ.

## చతుర్థ తరంగము

( 2) ప్రత్యయము = నమ్మకము.

( 6) మందిమానము = అల్పతేజస్సు కలుగుట, వసువుల = కాంతుల, ధనముల. వారుణి = పడమటిదిక్కు, మద్యము. రాగము = ఎఱుపు, అనురాగము. సంజ్ఞ = పరిభాష, సూర్యునిభార్య. అంశుకము = కిరణము, వస్త్రము. తరళ తరళములు = కడుఁ జంచలములు.

( 8) అమ్లానతఱపు = పెద్ద గోరంట. కూకు + మల = అస్తమించు + కొండ. కంగేలి (కంకేళి) = అశోకము.

( 9) బాసవాలేస్తు = ఐరావతము. వారుణీ—గణిక = పడమటి దిక్కను వేశ్య. సనాభి = సమానము.

(10) తార = నక్షత్రము, ఒక బౌద్ధదేవత. అంబరము = వసనము, ఆకాశము. మాంజిష్ఠరాగము = ఎఱుపు మించిన పసుపురంగు. కాలేయము = తత్కాలము దయినది, మ్రానిపసుపుతో నూరిన పరిమళద్రవ్యము. పయోధరము = మేఘము, స్తనము. లక్ష్మి = శోభ, లక్ష్మీదేవి. లబ్ధ పీత + అంబర = పొందిన + పచ్చ వలువ (విష్ణువు) కలది. అంబరము = ఆకాశము. వరము = నరించుట. పల్లవ—

అనురక్త = చిగుళ్లవలె—ఎఱ్ఱనైన. విటులయందు—అనురాగము కల. పొను—సిడము = బంగారు టెక్కెము.

(14) శంభళి = తార్పకత్తె. (15) కాపేయము = కపిక్రీడ.

(16) రోమంథ—మంథర = నెమరువేయుటలో + మెల్లగాఁ బ్రవర్తించు, మ్రదిష్ఠ = కడు మృదువయిన, గోష్ఠీన—పృష్ఠము = ఆవులు ముందు మేయుచు వెళ్లగా నయిన వెనుకభాగము కలవింకము = పిచ్చుక.

(18) క్షణ-ద = క్షణసౌఖ్యము నిచ్చు (క్షణద = రాత్రి). తులాధారుఁడు = తూనిక వేయువాఁడు, సూర్యుఁడు.

(19) పుటకినులు = తామరతీవలు.

(21) ప్రదోషము = ప్రదోష వేళ, మిక్కిలి దోషము. అంతరమ్ముల = మధ్యప్రదేశముల, తంతమ భేదముల. తిరస్కరించె = కనుపడకుండఁ జేసె. కువలయంబును = భూమండలమును, కలువను. కౌశిక = గుడ్లగూబయొక్క, ఇంద్రునియొక్క.

(23) అవటము = పల్లము, నూయి. (25) ఆతర్పణము = ఐదు వ్రేళ్లతోఁ బెట్టు ముగ్గు.

(27) ఉచ్ఛ్వాసము = ఊపిరి వెలిబుచ్చుట, ఆఖ్యాయిక పరిచ్ఛేదము. వక్త్రము = ముఖము, ఒక వృత్తము. సంశ్లేషము = ఆలింగనము, కావ్యగుణము.

(31) విశ్వరూపము = లోకరూపము, కృష్ణుని విశ్వరూపము.

(32) తారక = నక్షత్రము, తారకాసురుఁడు. ద్రోణ = మాలకాకి యొక్క, ద్రోణాచార్యునియొక్క. కాష్ఠ = దిక్కులను, కట్టెలను. అటత్ + ఉలూక—శకుని = తిరుగు—గూబ యను ("ఉలూకుఁడు") పక్షిఁ (శకుని) గలది. కాలిమము = నలుపు.

(35) రక్త-మండలుండు = ఎఱ్ఱని బింబము (అనురక్తమైన) ప్రజగలవాఁడు కరము = హస్తము, కిరణము. ఋక్షములు = నక్షత్రములు, ఎలుగు

బంట్లు. లక్ష్మణయుతుండు = గుర్తుఁ (మచ్చ) గలవాఁడు, రోహిణి = ఒక నక్షత్రము పేరిటి చంద్రునిభార్య, ఆవు.

(38) వాలుక = ఇసుక. త్సరువు = పిడి. (39) చమూరువు = లేడి.

(41) సార్థము = సమూహము. వికార = భంగురమ్ముల — కామవికారముచే — రమణీయము లైనవానిని. (కొన్ని) శ్లేషార్థ = రెండర్థములచే (కొన్ని). సప్రపంచమ్ములు = విస్తరింపఁబడినవి (కొన్ని). స్తుతినిందలలో కొన్ని, సంవాదములు.

(42) ఇందు స్తుతినిందారూపక శ్లేషము కలదు. వ్య-వారివో! రాజ! = వృథాగా కత్తిఁ దాల్చినవాఁడవా! (కాదని స్తుతి). వ్య — వారివి — ఓ రాజ (ఔనని నింద). క్షేపణిక వత్ = బల్లకట్టుపైఁ గాలువ దాటించువాఁడు వలె (వాని చేతఁ దెడ్డు నీ చేతఁ గత్తి యని ధ్వని). ధర్మా-డవ = ధర్మమునందు మిక్కిలి యాసక్తిఁ గలవాఁడవా! ధర్మముగా దొరకిన పరస్త్రీ సంగమముఁ గలవాఁడవే యని యొక యర్థము. క్షేపణికుఁడు = వ్యర్థముగా నెవరియొద్ద నేమియు తీసికొనక వారిని (కాలువ) దాటించును. అవ — స్త్రీ — కృతమా + ఆత్మ = చెడ్డ - చేసియయుందు - లగ్నమైన-మనస్సు, నీకు, కాన్ = కాగా, తత్స — తగున (నింద). కానవు + అస్త్రీకృతమా + ఆత్మ, నీకు = నీమనము అస్త్రముగాఁ జేయఁబడినది, నీకంటె కామె కనుపడదు. కాని యామె సతి. నీవంటి వాని కామెనుపేక్షించుట తగునా ? యని (లాలనారూప మైన స్తుతి). ప్రియదము = ప్రేమ నిచ్చునది. దము = భార్య. ప్రియను భార్యనుగాఁ గూర్చదను. ఏమి! యనియుఁ, గూర్చద నేమి? కూర్చననియు. లగ్గు కాదా! యనియు, లగ్గు కాద యనియు. వాఁడు + అసారుండు, వాద — సారుండు. మండలాగ్రము = కత్తిన్, గన యనియు, మండల + అగ్రము = సమూహమునకు- ముందున్న వాఁడుగాన + భయవృత్తిఁ గలవాఁడని స్తుతియు. కాదుగా !

(కాదుగా). ద్రావక, చుంబక, ఆకర్షక, భ్రామక నామములు, నాయక భేదములకును, లోహమునకు సంబంధించిన ఱాళ్ల భేదములకు వర్తించును. ఇట్లు శ్లేషము. ద్రావకుఁడు = చూపుచేఁగ్రొత్తార్థ రాలిఁగాఁజేయువాఁడు (ద్రవింపజేయువాఁడు). (లోహమును ద్రవింపఁజేయు ఱాయి = ద్రావకము). చుంబకుఁడు = రతికౌశలమునఁ జుంబించు వాఁడు, స్పర్శాలోలత్వముఁ గలిగించువాఁడును. "యత్సంబంధా ల్లోహ ముపగచ్ఛతి స చుంబకప్రస్తరః" ఇతి. ఆకర్షకుఁడు = దూరమునుండియే యాకర్షించువాఁడు. సూదంటు ఱాయి జాతిలోని పాషాణము. భ్రామకుఁడు = మాయమాటలచే భ్రమింపఁజేయు వాఁడు, లోహమునుఁ ద్రిప్పు నొక ఱాయి. నీకు లేద! నీకులేద. కితవుఁడు = ధూర్తుఁడు.

(43) పరుల = ఇతరుల (శత్రువుల), సుదంతులన్ = కాంతలను (మంచి యేన్గులను). జరకు = ముసలితనమునకు, "జర" యను రాక్షసికి, సంప్రహారముల—, యుద్ధముల. కర + వాల = హస్తము, కేశబంధము (కరవాలము = కత్తి). వరరత = శ్రేష్ఠరతి, ఓ శ్రేష్ఠులయం దాసక్తిఁ గలవాఁడా! విగ్రహంబు = శరీరము, విశేషమైన పట్టుదల. రమణ = విలాసముగా, ఓ రమణ: పరమ + కాండము = మంచి— సమయము, పరము + అకాండము. మహా — పద + ఆప్తి, మహా + ఆపత్ + ఆప్తి.

(45) స + ఆహాసము = కూడిన + క్రీడతో, కమల = సుందరి. కమలవాస = లక్ష్మి. యుష్మత్ + అర్పణ. శయములు = హస్తములు. కిసల + జాత = చిగురాకుగుంపు. కామ + ధుర = వలపుబరువు. హారి = సుందరమైన, హారములుకల. హారిణ = లేడిసం॥మైన, హారి = హరించునది. శ్రమలవపయో —ధర = చిరుచెమటఁ గల. మ్రదిమ = మృదుత్వము. మ్రదిమ + ఆకర.

(46) ప్రేమ — హార్య = ప్రేమచేతనే వశ యగునది. మహార్య = చాల యోగ్యురాలు. ఉత్కట + అక్షములు = స్వాభిప్రాయము దెలియ

జేయుటలో నిపుణములైన-యవయవములు కలవి. కమలా + కృతి = ఐశ్వర్యధన్య! దస్యువు = శత్రువు. ఉరఃఫలక + అంచనము = ఒప్పిదమైన యురము. రజః + అధిపతి = రజోగుణహేతువైన కాముము (మన్మథుఁడు). విశేషకము = ఉద్దీపింపఁజేయునది, తిలకము.

(47) గాన—వశీ = ఎప్పుడు సంగీతము పాడుకొనువాఁడు. కందర్ప! కంఁదర్పకమున = కామక్రీడన్. విశేషముగ = శేషము లేకుండ, పైపెచ్చు.

(48) కమిత = మోహమునఁ బైకొనువాఁడు.

(49) మైత్ర్యతః = మైత్రీకరణహేతువువలన, మైత్రి + అతః = స్నేహము + ఇందువలన, అస్తు = అగుగాక. జీవనాయ = జీవనార్థము. కమివ = అర్థపదార్థమును వలె. "సుభగం యథాతథాన ప్రాప్నోతి కిం?" = చక్కగా సేవించుట లేదా? (కర్త ప్రేయసి).

(53) దా—మమ = ("దారయతీతి దారః మదనః") మన్మథునిచే వేడ్కఁ గలవారలుగాఁ జేయఁబడిన, రామ = కాంతలు కలది. దారా = భార్యయందు, ఉత్సుకిత = వేడ్క నొందింపఁబడిన రాముఁడు కలది. జగము కన్న = లోకము కన్న, సూర్యుఁడు.

(57) సుందరి = అందగత్తె, సముద్రతటమునఁ' గన్పట్టు నొక వృక్షము, పాద—పరాగము, పాదప—రాగము. కీలా—లములు = కీలాలము = జలము, రక్తము. కుంభకర్ణము = ఒక జాతి పక్షి. కుల్య + అయమాన + కరిణులు = ఉపనదులుగా—నగుచున్న—యేనుఁగులు కలవి, వంశీకు లగు పెద్దలను + (గొప్పతనమును) అందుకొనుచున్న + అభిప్రాయములు కలవి. సు + పయః + ధరలు, సు + పయోధరలు.

(60) ద్రవము = పలుగెత్తుట, క్రీడ. సు + రయాన, సుర = కల్లు. అన = త్రాగుటను. సురకాంత = దివ్యకాంత. కలి = తగాయిదా.

(61) హస్తికుసుమములు=పున్నాగపూలు.

(62) జీవంజీవములు=చకోరములు, మరీచి + కిసాలము = మిరియపుఁ జిగుళ్ళు.

(66) క్షణదేశుని = చంద్రుని, ఈక్షణ + దేశము = నేత్రప్రదేశము. లోచనము = ప్రకాశించునది, కన్ను.

(67) నవ—రుతము. నిశాత = తీక్ష్ణీకరణమున, ఖర=క్రూరము లైన, నఖర=గోళ్ళయొక్క, రుతము=అవ్యక్తశబ్దము. స్మరజని= ("స్మరం జనయతీతి స్మరజనిః") కామోత్పాదక మైనది.

(68) మాళవీమణి=మాళవదేశ కాంతలలో మిన్న. దళత=పత్రములఁ గలుగుట.

(69) కిశోరము=గుఱ్ఱపుఁ బిల్ల.

(70) అనుపమ=సమానము లేని సౌందర్యముఁ గలది, నైఋతిదిక్కునందలి యాఁడేనుఁగు.

## పంచమతరంగము.

(1) గణనీయ—హస్త—శ్రవణములు=లెక్కబెట్టఁ దగిన (పొగడఁ దగిన) హస్తానక్షత్రము (చేతులు) శ్రవణనక్షత్రము (చెవులు). ఉద్యోతకర—రూపము = ప్రకాశమాన + స్వరూపము, న్యాయవార్తిక కారుఁ డైన "యుద్యోతకరు" నిచే—చక్షురింద్రియగోచర మైనది. జగత్ = జగముయొక్క, ఉద్యోతన = ప్రకాశింపఁ జేయుటలో (ఆనందింపఁజేయుటలో) ఇన=సూర్యుని, రుచి = కాంతికి, తుల్య=సమాన మైనది. ఛందోవిచితి = ఛందశ్శాస్త్ర సంబంధమైన యొక గ్రంథము, తనుమధ్య=సన్నని నడుముఁ గలది (గాయత్రీఛందస్సులోని యొక వృత్తము పేరు) చరణము=పాదము, గోత్రము. వ్యాకృతి=వ్యాకరణశాస్త్రము. (క్రమాలంకారము). స-రక్త-పాదంబు=ఎఱుపుతోఁ గూడిన పాదము, "తేన రక్తం రాగాత్" ఇది మొదలైన పాదములతోఁ గూడుకొనినది. ముగ్ధ—

పర్వ = అందమైన గణుపుల చేత (ఆది, సభా, ముఖ్యపర్వముల చేత). సుందర — కాండ = మనోహర — నాళముల చేత (సుందర కాండచే).

(2) గురు + కళత్ర = గొప్ప + పిఱుఁదులు కలుగుట, గురు — భార్యాత్వము "ప్రియంగుశ్యామ" యను "నరవాహనదత్త" నృపాల భార్యయొక్క చెలికత్తె పేరు "ప్రియదర్శన". ప్రియ + దర్శన. తమాల — పత్రములు = చీఁకటిచెట్లు ఆకులు, మకరికాపత్రములు లేక తిలక భేదములు. వేల = నదీ తీరము. నర్మ + ద = పరిహాస చతుర, "రేవా" నది. సోమ + ప్రభ = చంద్రబింబము వంటిది, బ్రహ్మదత్తుని భార్య పేరు. నితంబము = మొల, కొండనడుము. శతకోటి = వజ్రాయుధము. మద + అలస = అశ్వతకుని కూఁతురు పేరు. శృంగారకళాతిరీట = (తిరీటము = కిరీటము) గొప్ప శృంగార శిల్పము, తరళిత = ప్రకాశింపఁజేయఁబడిన.

(8) ఆశ్రయాశువు = అగ్ని (ఆశ్రయింప దహించువాఁడు).

(9) వేల్పుతిండి — నీర్గని = అమృత - సముద్రము.

(10) సదాగతి = వాయువు, సదా + గతి, మానస + అభిగతి = మనో + వేగముఁ గలది, మానససరస్సును గూర్చి పోవునది. శ్రీవృక్షము = గుఱ్ఱపురొమ్మునఁ గల సుడి పేరు, మారేడుచెట్టు. గండము = బుద్బుదాకారమైన గుఱ్ఱపుసొమ్ము. ఖడ్గమృగము. శుక్తి = సుడి, ముత్యపుఁజిప్ప. ఇంద్రాయుధము = నల్లకన్నుల గుఱ్ఱము, ఇంద్రుని యాయుధము రవ = వజ్రము. స్కంధము = మూఁపు, బోదె. వనస్పతి = చెట్టు.

(11) శివ = నక్క, పార్వతి. నృకరోటి = మనుష్యుల తలయెముకల యొక్క. ఉల్కాముఖములు = కొఱవిదయ్యములు. వసా — విస్రము = బొడ్డుక్రింద నుండు యుల్లిపొరవంటి క్రొవ్వుయొక్క — అపక్వవాసన. కట — లాలసీ = శవ — అపేక్షగల, కటపూతనలు = పిశాచభేదము.

(12) నరేంద్రములు = పాములవాండ్రు. మండలములు = కుక్కలు, రాజ్యములోని జిల్లాలు. బలారి = గుడ్లగూబ, ఇంద్రుఁడు. దగర = పిశాచము. శుభ—సూత్రము = మంగళసూత్రము. నల్ల = రక్తము. స—కబంధము = మొండెములు (ఒక రాక్షసుఁడు "కబంధుఁడు") కలది.

(14) అర్క—చయము = జిల్లేళ్ల—గుంపు, పన్నెండుగురు సూర్యులు. అర్జునములు = ఏఱుమద్దిచెట్లు. కౌశిక = గూబ, ఇంద్రుఁడు. ధాత్రి = ఉసిరిక, దాది. అనంత = కరక్కాయచెట్టు, శేషుఁడు. అమృత = తిప్ప లేక పిప్పలితీగె వ్యక్త + గణ + కారికము = తెల్లమైన—వస్తుసమూహముయొక్క—చేయుట కలది = సర్వవస్తువుల యుత్పత్తిఁ గలది, "శూరపాలుఁ"డను నొక కోమటి జ్యోతిశ్శాస్త్రపారంగతుఁడు గణసోపయోగినినిఁ గారికను రచించె నని ప్రసిద్ధి. గతి = తెలివి. నం—గము = నందిత = ఏపొందిన (సంతసించిన) అశోకవృక్షము, సరళవృక్షము, పున్నాగముఁ గలది. పున్నాగములు = పురుషశ్రేష్ఠులు. శ్రీఫలము = మాలూరవృక్షము.

(15) వైదేహి = పిప్పలి, సీత. అపరాజిత = తక్కిలిచెట్టు. రూపములు = మృగములు. ఇక్ష్వాకు = చేదుసొర. వంశ = వెదుళ్లు. సిందూర-తిలక-ప్రవాళముల్ = వావిళ్లయొక్కయు-బొట్టుగుచెట్లయొక్కయు (సిందూరపు—బొట్టు) చిగుళ్లు (పవడములదండలు). అర్జున - శరము = స్వచ్ఛ - ఉదకము. ధార్తరాష్ట్రములు = నల్లని ముక్కు కాళ్లు కల హంసములు. పలాశులు = రాక్షసులు.

(16) అమ్లాన + జాతి = పెద్దపూవుల చేమంతి—జాజి, వన్నె తగ్గని జాతి. విరుద్ధ—వంశము = అడ్డదిడ్డముగానున్న—వెదురు. షట్పద = తుమ్మెదలచేత, ఆఱుకాళ్ళచేత. ద్విపద + అనాకులమ్ముగా = రెండుకాళ్ళతో—సుఖముగా (ద్విప—దాన + ఆకులమ్ముగా) ద్విజ = పక్షులయొక్క, బ్రాహ్మణులయొక్క. నకులి = ఆఁడుముంగి.

అభయ=కరకవృక్షము. విభీషణము=కిక్కుసగడ్డి. పథ్యము=హరీతకి. గుల్మము=బోదె లేని చెట్టు, ఒక వ్యాధి. సరసిజములు=సరస్సులోఁ బుట్టినవి.

(17) శరయంత్రము పుస్తక ముంచు వ్యాసపీఠము.

(21) పుండరీకము=తెల్లతామర, ఒక సుగంధద్రవ్యము కాండజని=తామరతీవె. ప్లవగము=క్రోఁతి. మిన్ను—మ్రాన్—కదల్—మండలు=ఆకస మను—చెట్టున—దిక్కు లను—మండలు. భ=నక్షత్రము.

(22) వారుణి=పడమటిదిక్కు, మద్యము. ద్విజపతి=చంద్రుఁడు, బ్రాహ్మణకులపతి. ప్రాక్ = తూర్పు. పాటలము = తెలుపు మించిన యెఱుపు.

(25) ఛాయ=నీడ, అధ్వగుఁడు = పాంథుఁడు. గో=కిరణములకు, స్వర్గమునకు, హరి=ఇంద్రుఁడు, విష్ణువు. పద్మ=కమలము,లక్ష్మి.

(26) కర్కంధువులు=రేఁగుచెట్లు. సూరె—మ స్త్రీలు=దిగ్గజములు. పీతద్రవము=కుంకుమపువ్వురసము=ఘుసృణము.

(29) అంబరము=వస్త్రము, ఆకాశము,వణిజుఁడు=బట్టల వర్తకుఁడు. కల్ప ద్రుము=కల్ప - వృక్షము. ఆశా—ప్రసాధనము=దిక్కులను—అలంకరించుట (కోర్కెల—బాగుగ సాధించుట) చంగుఁడు=సమర్థుఁడు. కాష్ఠ=దిక్కులయొక్క, కట్టెలయొక్క.

(30) విదిక్కులు=మూలలు (35) క్ష్వేద్రము=తేనె (37)ఒదలు=వర్ధిల్లఁగ.

(38) విస్రబ్ధముగ=నమ్మకముగా సవర- మెకమ్ములు=చమర-మృగములు. సమాచరణ=తోడుగాఁ దిరి తిరుగుటలో,చుంచురు=ఆసక్తిఁగల. వేత్రలతలు=బెత్తపుఁదీవెలు. కంధము=స్కంధము.

(40) చాటకైరమ్ములు=పిచ్చుకమగపిల్లలు. చాటువులు=ప్రియ మైన పలుకులు.

(42) రజ్యమానములు = ఎఱ్ఱనగుచున్నవి. జాహకములు = పిల్లులు.

(45) నిర్మోకము = కుబుసము. కాంతత = అందము.

(47) లవణ = ఉప్పుయొక్క, లవణాసురునియొక్క (వీని తల్లి "కుంభీనసి"). పాథః — ప్రజ = నీటిజనులు. నారము = నీరు.

(48) అంభోజుఁడు చారుమత్స్యుఁడు మొ॥ వారు విశ్వామిత్రసుతులు. పాత్రిము = ఓడ, (పుం) మంత్రి. సజ్జ—నక్ర + మకరంబు. సజ్జ = సన్నద్ధము లైన, సజ్జన—క్రమ + కరంబు. స్త్రీ—తంబు = భార్య లైన నదుల సమావేశముగలది. స్త్రీ, కృత్య, ప్రత్యయములచేత నదీసంజ్ఞచేత వ్యాప్తమైనది. శంఖనఖ—ముఖరములు = ధ్వనిచేయు నత్తగుల్లలు.

(49) సుర = మద్యము (సురాసముద్రము. ఏడుసముద్రములలో నొకదాని విశేషణము మఱొకదానికిఁ జెల్లును). తోయమ్మునఁ = విధమున. కరతోయ = ఒక నదిపేరు, చేతి నీళ్లు. (ముఖముపై నీళ్లు చల్లినచోఁ గోపము శాంతించును). సుందరీ = వృక్షవిశేషము. విషము = నీరు.

(50) తరికొండ = మందరపర్వతము. పత్రిరథము = పక్షి. ఆలానము = ఐరావతపుఁగట్టుకంబము.

(54) అశ్వతరము = కంచరిగాడిద.

(57) అక్షుద్రమ్ములు = విశాల హృదయములు. శింశుమారములు = ఒక జాతి మొసళ్లు. (58) క్షుద్రాండమ్ములు = చేఁపలు.

(60) ప్రాయేఱు = సముద్రము. నెలకట్టు = ఊతి కట్టనపునేల' పద్మ—రాగము = ఒక రత్నము పేరు, తామర—రంగు.

(61) అల-వడి = అలల-వేగము. మన్నులు = మనుబోతులు. విద్రుమ—వల్లీ = పవడఁపు - తీవలయొక్క, చివురాకుల-తీవలయొక్క లేక "గువ్వగుత్తిక" లను తీగలయొక్క.

(62) శారములు = చిత్రవర్ణములు కలవి. కరటమ్ములు = ఏనుఁగుల చెక్కిళ్లు. కుంభులు = ఏనుఁగులు. పెం - దొర-ఈదర = పెద్ద—వేగఁపు-గాలి. సిద్రములు = పాములు.

(63) ముక్త = ముత్యములచే, ముక్తి నొందిన వారిచే. విభీత - సనాభి = భయస్థునకు-సమానము. దరము = శంఖము, భయము.

(64) ఘన - శ్యామ = మేఘములచే - నల్లనైన. వింజము = వింధ్యగిరి.

(65) హలి = కైతు, బలరాముఁడు. శరజన్మము = రెల్లు—పుట్టుక (పుం) కుమారస్వామి. తరణి = నావలయొక్క, సూర్యులయొక్క. ఘన = మేఘముచే, గొప్పగా. సారంగ = వానకోయిలలయొక్క, లేళ్ళయొక్క. వినీల—కంఠము = నెమలి, (పుం) శివుఁడు.

(66) జలద—కరక + ఆప్తి = మేఘముల (నీరిచ్చు) — వడగండ్లఁ (కమండలువు) గలిగి. రజము + ఈగి = దుమ్ము (రజోగుణము) వదలి. మేఘ — నాదము = ఉఱుము (పుం) "ఇంద్రజిత్తు". నిమ్నగా — నదత్వము = నదుల — ధ్వనిగలుగుట, నిమ్న—గాన—దత్వము = సన్నని — పాటఁ — బాడు వానిభావము, కాకలీ—గాయనుఁడు = సూక్ష్మమైన యవ్యక్తమధురధ్వనితోఁ —బాడువాఁడు.

(67) నీరామని = వర్షర్తువు.

(68) ప్రియుఁడు ప్రవాసము బోవునపుడు తనపైఁ బ్రీతి తగ్గకుండుటకై గుర్తుగాఁ బ్రియురాలి స్తనముల, నెలవంకలు = గోరుగుర్తులుంచును. పయోధరమ్ములు = మేఘములు, స్తనములు. ద్యు—రమణి = ఆకాశమను కాంత. వెట్ట = గ్రీష్మర్తువు. (71) సౌర + అధ్వము = ఆకాశము. బలాకలు = బెగ్గురుపక్షులు.

(72) కృష్ణ — కేదారిక = నల్లబారిన — చిన్నవరిపొలము. మించు = మెఱుపు.

(73) కజ్జలిత = కాటుకఁ బట్టించినది. ఇన—దీపము = సూర్యుఁడను—దీపము. తొలికారు = వర్షర్తువు.

(74) తారములు = పులుఁగడిగిన ముత్యములు.

(75) నార—దములు = జల—దములు (76) శౌకము = శుకసమూహము.

(77) మించుకారు = వర్షర్తువు, వెన్నెలకారు = శరత్తు. అంబరము = వస్త్రము, ఆకాశము.

(78) భరద్వాజ — ద్విజులు = భారద్వాజసగోత్ర బ్రాహ్మణులు. శాఖి = వేదము. ఉత్ + క్రోశములు = పెన్నడపులుఁగులు, పెద్ద కొఁగలు. ధార్తరాష్ట్రములు = ఒకజాతి హంసలు. అఖంజ—ఖంజరీటములు = కాలు సాఁగిన—కాటుకపిట్టలు. తారతర = మిక్కిలి ప్రకాశమానములైన. కశేరు—కందములు = గెనుసు—దుంపలు, సరసతటము = చెమ్మ గల నేల.

(80) కంచుకులు = పాములు. తగడు = బంగారము. స్మేర—కాశ్మీరము = పూచిన—కుంకుమపువ్వు. జరత్ + అంబుద = ముసలివగుచున్న—మేఘములు కలది. శరద = శరత్తు.

(86) నల్వము = నన్నూరు మూరల దూరము.

(87) లుబ్ధ—నాయకుఁడు = బోయ—రాజు

(90) పాల = మాంసము. జిహ్మగమ్ముల్ = పాములు. లసుకాడినట్లు = నాశము చేసినట్లు. మూర్తుల = దేహములందు. ద్విట్ = శత్రువుల యొక్క. జీవము = వింటి నారి, ప్రాణము.

(91) కక్ష్యలు = మొలత్రాళ్లు, ఏనుఁగునడుమునపట్టాలు. శృంగార—రచన = గజభూషణము, రత్యర్థమైన—వేషము. మార్గణ = బాణములయొక్క, యాచకులయొక్క. అహస్సులు = పగళ్లు. పద్మమ్ములు = ఏనుఁగు మొగము నందలి బొట్లసమూహము, కమలములు. కదళులు = అంబారిమీఁది టెక్కెములు, అరఁటిచెట్లు. ద్విజములు = దంతములు, పక్షులు. సత్ + ఆరామ. రవణించునవి = ఒప్పునవి. నక్షత్ర — మాలలు = ఇరువదియేడు ముత్యములతోఁ గూర్చిన హారములు.

(92) మల్లిక + అక్షములు = తెల్ల కన్నులు కల గుఱ్ఱములు, ఒకరకఁపు హంసలు. ఉత్ + దేశములు = ఎత్తు + ప్రదేశములు. భాండములు = గుఱ్ఱపుఁదొడవులు, కుండలు. తరఁడి = సామ్యము. ఆవర్తములు = సుళ్ళు, ఊర్ములు = వంగుచు నిక్కుచుఁ బంక్తిగా నతి వేగముగాఁ బరుగెత్తు గుఱ్ఱముల పోకడలు, తరంగములు. దేవ— మణి = గుఱ్ఱపు మెడనుఁ గల సుడి, కౌస్తుభము. క్షీబులు = మత్తులు, పానము = రక్షణము, త్రాగుడు. ఇందిర = కొన్ని గుఱ్ఱముల యవయవకాంతి యొక్క. క్ష్మ = భూమి, ఓర్పు.

(94) తుముల—ప్రదోషము = యుద్ధ మను ప్రదోష వేళ. పలితంకరణము = వెండ్రుకల నతియుఁ జేయునది.

(95) రాజసచ్ఛాయ = రజోగుణమువలె, సత్వము = బలము, సత్వ గుణము. న—క్షత్రి — పథము, నక్షత్రి — పథము. గోత్రి = భూమి, వంశము. సత్పథము = మంచిపద్ధతి, ఆకాశము. ధూమ్య = పొగచాలు. ధూమ్యాటములు = కళింగపక్షులు.

(96) నర—క — విచ్ఛేదము, కము = శిరస్సు. (నరకుఁడు). ఊరు = తొడలయొక్క. ఉరు = గొప్ప. శక్తి = కర్ణున కింద్రునిచే నివ్వఁబడిన శక్తి. కటము = గజగండము, అతిశయము. క్షపణకుఁడు = బౌద్ధుఁడు. తమకున = విధమున. రావణుఁడు = అందఱ నేడిపించు వాఁడు. శ్రుతి = చెవి, వేదము. దర్శనము = కన్ను, శాస్త్రము లేక ధర్మము. క్షపిత = నశించిన.

(100) అశ్మ—పుత్రిక = రాతి బొమ్మ.

—[♦]—

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 1 | మల్లికార్ధున | ... | మల్లికార్జున |
| 3 | 20 | పెధలు | ... | పెద్దలు |
| 7 | 6 | ఉజ్వాల | ... | ఉజ్జ్వాల |
| 10 | 7 | లక్ష్మీంకాంత | ... | లక్ష్మీకాంత |
| 10 | 19 | సూరు | ... | నూఱు |
| 12 | 1 | కరబద | ... | కరబదర |
| 12 | 4 | జయార్ధి | ... | జయార్థి |
| 12 | 7 | వితధమ్ముకై | ... | వితథమ్ముకై |
| 13 | 13 | విషధర | ... | విషధరము |
| 17 | 3 | సుమిత్రుండు | ... | సుమంత్రుండు |
| 20 | 20 | పుట్టినిక్లటంచు | ... | పుట్టినిల్లటంచు |
| 22 | 2 | మధించు | ... | మథించు |
| 72 | 18 | కురగటి | ... | కుఱంగటి |
| 76 | 13 | మల్లికారున | ... | మల్లికార్జున |
| 82 | 1 | రోమంధ | ... | రోమంథ |
| 90 | 11 | కృతమాత్మ | ... | కృతమానాత్మ |
| 98 | 15 | మరండమ్ముల | ... | మరందముల |

| | | | | |
|---|---|---|---|---|
| 99 | 8 | నన్ను! గొన్న | ... | నన్నుఁగొన్న |
| 100 | 14 | దేవి | ... | దేరి |
| 101 | 5 | విచిత్రిదో | ... | విచిత్రివో |
| 101 | 6 | చరణా | ... | చరణ |
| 102 | 5 | శేద | ... | సేద |
| 107 | 1 | కఠము | ... | కంఠము |
| ,, | 8 | దచు | ... | దంచు |
| ,, | 9 | గనగ | ... | గనంగ |
| 110 | 18 | మరదా | ... | మరందా |
| 118 | 14 | కవి | ... | కలి |
| 125 | 12 | జలదంబుద | ... | జరదంబుద |
| ,, | 21 | జాగర్యలో! | ... | జాగర్యలో |
| 129 | 11 | ధూంమ్రాంట | ... | ధూంమ్యాంట |



ఆంధ్రా ఆర్టు ప్రెస్, పవరుపేట : ఏలూరు.

# వీరభద్రమూర్తి కావ్యములు

*

(1) వాసవదత్త — 3 0 0

(2) మల్లికార్జునపండితవిజయము — 1 8 0

(3) కామాక్షీపంచశతి (మూక పంచశతి కాంధ్రానువాదము)

(4) వేణుగోపాల శతకము

(5) శాంతివిలాసము

(6) తెలుగు మహిమ్నము

(3)–(6): అచ్చులో నున్నవి.

## ప్రాప్తిస్థానములు

*

1. సాహిత్యమండలి, పవరుపేట–ఏలూరు.
(ప. గో. జి.)

2. సాహితీ సమితి, గుంటూరు.

3. డా॥ శ్రీ దమ్మాలపాటి రామారావుగారు,
సత్యనారాయణపురము - విజయవాడ
(కృ. జి.)